# వీరేశలింగం - వెలుగు నీడలు



దిగవల్లి శివరావు బి. ఏ., బి. ఎల్.

వేమన వికాస కేంద్రం
మొగల్రాజపురం - విజయవాడ-10

ప్రచురణ నెం. 4
జనవరి 1985.

వెల : రు. **15-00**

ముఖచిత్రం : చంద్ర

ప్రతులకు :
వేమన వికాసకేంద్రం
36-12-6, మొగల్రాజపురం
విజయవాడ-520 010
ఫోన్ : 76588

ముద్రణ :
సర్వోదయ ప్రెస్, విజయవాడ.
విద్యోదయ ప్రింటర్స్, విజయవాడ.

# విషయ సూచిక

# చదవండి!

| | | |
|---|---|---|
| విశ్వదాభిరామ వినురవేమ (వేమన అంతరాంతరాల్లోకి) | — | 25-00 |
| వేమన-వివిధ దృక్కోణాలు | | |
| మేలుప్రతి | — | 30-00 |
| సాదాప్రతి | — | 25-00 |
| వేమన దర్శనం- విరసం పేరిట వక్రభాష్యం | — | 10-00 |
| వీరేశలింగం - వెలుగునీడలు | — | 15-00 |

## వేమన వికాస కేంద్రం

36-12-6, మొగల్రాజపురం, విజయవాడ-520 010

ఫోన్ : 76588

---

| | | |
|---|---|---|
| శాస్త్ర విజ్ఞానం, శాస్త్రీయ సోషలిజం | | |
| (-) గతితర్కం | — | 6-00 |

యోచన - యోజన ప్రచురణలు

36-12-6, మొగల్రాజపురం,

విజయవాడ-520 010

# అంకితం



లిటరరీ ఆర్కెయాలజిస్టు

మా బంగోరె

మధుర స్మృతికి

# హితసూచని నుండి హితకారిణికి

— త్రిపురనేని వెంకటేశ్వరరావు

కాలం ; 1830 ఆగష్టు నాలుగో వారం, ఒక సాయంకాలం. (విజయవాడ)

స్థలం : నాగపూరు దగ్గర కామిటి కంటోన్మెంటులో

రెసిడెంటు Mr. GROEME తో జరిగిన ఒక సంభాషణలో బాల వితంతువుల పరిస్థితి దయనీయంగా వుందని ఒక భారతీయుని గుండె కొట్టుకులాడింది.

"హిందువులు ద్వితీయ వివాహము లేకుండా చేసుటచేత బహుమంది బాల్యమున విధవలైన స్త్రీలు ఓక్కలి కష్టపడుచున్నారని" కొట్టుకులాడింది. అదొక తెనుగు గుండె. ఆ గుండె కాశీయాత్ర మధ్యలో కొట్టుకులాడింది. సహగమనాన్ని ఉపస్మృతులేతప్ప, మన మూల స్మృతులేవీ నిబంధించలేదని గయా పండిత పరిషత్తును ఒప్పించిన పండితుని గుండె అది. అది ఏనుగుల వీరాస్వామయ్యగారి గుండె.

బాల విధవలపాట్లు చూచి కొట్టుకొన్న తెనుగు గుండె అదొక్కటేకాదు. పిదప రెండుమూడేళ్ళలో బొంబాయిలో మరో తెనుగు గుండె కొట్టుకుంది. అది కొట్టుకులాడటంతో సరిపెట్టుకోక గొంతు పెగుల్చుకుని వాదించింది. ఒక మహారాష్ట్రుని గొంతు కను కలుపుకొని జంట గొంతుగా మోగింది ముంబాయి ప్రకాశిక అనే పత్రికలో మోగింది. దానితో చిత్పావనులు ఖండనాఖండ పరశువులెత్తారు. ముంబాయిలో మోగిన జంట గొంతులకు ఆంధ్రనుంచి మరో గొంతుక గట్టిగా వత్తాసు పలికింది. అది కాశీ యాత్రికునిదేమోమరి. వారుకూడ వ్యవస్థాపకులుగావున్న హిందూ లిటరరీ సొసైటీ ప్రణాళికలో విధవా వివాహ ప్రోత్సాహం ఒక అంశంగా వుండేది. ఇది 1837 నాటికి జరిగిన కథ.

సహగమన దుర్యోగం నుంచి వితంతువును తప్పించిన వంగ దేశం, వెంటనే ఆమెకు పునర్వివాహయోగం కలిగించబూనుకోలేదు. తలంచనూలేదు మళ్ళీ 14 ఏళ్ళకు, 1842 లో పరాశర స్మృతి తెరచి నష్టేమృతే శ్లోకాన్ని తీసి విధవా వివాహం శాస్త్ర సమ్మతం సుమీ అని చూపించి వూరుకుండిపోయింది.

అప్పట్లో ఆంధ్రులు రాజకీయంగాకూడా మేల్కొని దక్షిణానికి నాయకత్వం వహిస్తున్నారు క్రిష్టియనులుగామారినవారికే ఉద్యోగాలివ్వటాన్ని (Caste Disabilities Act) వ్యతిరేకించీ, రైతులను పెట్టే బాధలను బ్రిటిష్‌పార్లమెంటు దృష్టికితీసుకెళ్ళి పని చేస్తున్నారు. జాతియొక్క భావ జీవితాన్ని సాంఘిక జీవితాన్ని ఆధునికీకరణ చెయ్యడానికి,సర్వతోముఖంగా సంస్కరించడానికి ఒక సమగ్రప్రణాళికను,ఒక బ్లూప్రింటును ఒకరు తమ జీవితకాల కృషిగా అప్పట్లోనే తయారుచేశారు. గత శతాబ్దపు తొలి

సగంలో యావద్భారతంలో పొడచూపిన సకల సంస్కరణలకు, గాఢ విచారణకు తలమానిక మనదగినట్టి ప్రణాళిక-జాతి పునర్నిర్మాణ పథకము అది.

దానిపేరు హిత సూచని. దాని కర్త సామినేని ముద్దు నరసింహనాయుడు ఇరవైయేళ్ళు ఫస్టుగ్రేడుమున్సిఫ్‌గా న్యాయశాఖలోపనిజేసి ఈప్రణాళిక సిద్ధపరచి కన్నుమూశారు. వారురాజమండ్రి ఆదివెలమలు. మద్రాసులోసైతంసరైన ఆంగ్లవిద్య భారతీయులకు దొరకనప్పుడు (1839 వరకు బందరు, మద్రాసుల్లో ఇంగ్లీషు మీడియం స్కూళ్ళులేవు.) తంజావూరు రాజులు కుంభకోణంలో పెట్టించిన ఆంగ్లవిద్యాశాలకు పోయి చదువుకొని కంపెనీ న్యాయశాఖలో న్యాయాధికారి అయ్యారు. వారెవరోకాదు, వైతాళికులనే భావకవితా సంకలనానికి కర్తలుగానూ, సీతారామరావణుల ప్రేమ త్రిభుజాన్ని అశోకంఅనే నాటికగానూ వ్రాసి సాహితీలోకపరిచితులైన ముద్దు కృష్ణగారి ముత్తాత.

ఆయనే మనకు తొలి వ్యావహారికభాషా వాది. పద్య రచనను వెనకబెట్టి వచనాన్ని విజ్ఞానవాహికగా, ప్రాచుర్యంలోకి తేవాలని చెప్పిన ఉపదేష్ట-రాగల పరిణామాన్ని వూహించినద్రష్ట. పకృతిశాస్త్రాల విజ్ఞానం మొత్తాన్ని తెనిగించి 'గ్రామ్యమైన' సులభ వచనంలో మన యువతీ యువకులందరికీ అందించాలన్నవాడు. అతడే తెలుగులో తొలివ్యాస రచయిత. హితసూచనే ఆవ్యాస సంపుటి. మూఢ విశ్వాస ఖండనానికి ఉపక్రమించిన తొలిహేతువాది. దయ్యాలు, మంత్రాలు, బ్రహ్మరాక్షసులు ఆవేశించడాలు, బాణామతి, భూత వైద్యం ఋషుల దివ్యదృష్టులు స్వర్ణయోగం వంటివన్నీ బూటకమనిచెప్పిన తొలి ఆస్తికహేతువాది. వైద్య విజ్ఞానం తెలుగులో అత్యవసరంగా వెలువరించాలని, నాటి అంటురోగాలప్రాబల్యందృష్ట్యా గట్టిగా ప్రబోధించినవాడు నాటి హిందూవివాహవ్యవస్థని సమగ్రంగా పరిశీలించి,అందులోఏపాక్షికసంస్కరణశకలాన్నో పైనవేసుకోవడం గాకుండా, దానికి సర్వతోముఖ పరిష్కారాన్ని ప్రధమతః ప్రతిపాదించిన భారతీయుడు. బాల వృద్ధ వివాహాలు, కన్యాశుల్కాలు, పంచరాత్ర వివాహ వ్యయాలు తప్పని తగవని చూపించి స్త్రీ విద్య రజస్వలానంతరవివాహాలు వధూవరుల పరస్పరేచ్ఛాపూర్వక వివాహాలు, విధవా పునర్వివాహాలు కర్తవ్యం అన్నవారు. అన్నింటికన్నా ఇంకోమాటుంది. ఆయన వర్ణాంతర వివాహ ప్రతిపాదకుడు కూడాను. హిందూ సంఘం కులవ్యవస్థనుంచి బైటపడాలని, సర్వకుల సమానత్వమని గాకుండా కులవిభాగ రాహిత్యం కావాలన్నవాడు. ఆ నాటికి అఖిల భారతంలో అలా పలికిన గొంతు అదొక్కటేనేమో! (ఇంకా మహాత్మా పూలే విజృంభించలేదు) అంత పనికి నాందిగా వృత్తిలో, సంస్కారంలో, నాగరికతలో, అలవాట్లలో సమీపంగావుండే కులాల మధ్య ముందుగా పెళ్ళిళ్ళకుపూనుకోవాలి; చివరికి విద్య,నాగరికత పెరిగేకొలది సర్వ వర్ణాంతర వివాహాలు అనులోమ విలోమాలు జరిగేట్టు చూడవలెనన్నాడు. ఇదీ ఆయన ప్రణాళిక.

వారిలో హిత సూచనేకాదు, హితాచరణ కూడా వుంది. ఒక బాల వితంతువును వివాహానికి సిద్ధపరచి, ఆమెను పెండ్లాడితే జీవయాత్రకు కావలసినట్టి ఆస్తి ధనం యిస్తానని ప్రకటించి ప్రయత్నించారు. అయినా ఎవరూ ముందుకురాలేదు. అందుకని ఆయనతొలివితంతువివాహక ర్తకాలేకపోయారు. న్యాయాధిపతియినా ఆయనఉచితవైద్యం చేసేవారు. ఇంకా కలరా, మశూచివంటి అంటువ్యాధులనివారణా కృషి బాగాచేశారు. కలరాలో మందులిచ్చి మంచి సాంఘిక సేవచేశారు. అటువంటి కృషికి వారే ఆద్యులు. ఇవన్నీ చేసినతర్వాతేవారి హితసూచనీ రచన. వర్ణాంతర వివాహసూచన హితసూచనికి వెలుపలగాచేశారు. హితసూచనిలో విద్యా ప్రణాళిక ఇచ్చి, స్త్రీ విద్యను గూర్చి యిలా వ్రాశారు.

"ఈ అనుక్రమముగా విద్యచెప్పించేయెడల స్త్రీజాతికి ఎవరెవరి మర్యాదస్థితికిన్ని అనుకూలమని తోచినమట్టుకు విద్య చెప్పించవచ్చును. సాధ్యమైనంత మట్టుకు గ్రంథము స్త్రీలున్నూ చదవడమునకు లాయఖుగా నుండేలాగున రచించవలసినది. పురుషులకే కాకుండా జియోమిత్రి ఎరిత్మెటిక్ ఎస్ట్రానొమి..." స్త్రీలకుకూడా చెప్పించాలన్నారు.

నిర్బంధ వైధవ్యం అనేమాట వారివాడకమే వీరేశలింగం వ్రాతలో వచ్చింది. ఆ వైధవ్య నిరసన మానవ హృదయంతోను హేతువాదంతోను వెలివరచారేగాని శాస్త్ర సమ్మతి నన్వేషించినవారుకారు. అనగా ఆయన వైఖరి వంగీయుల భావ ప్రభావ ఫలితం కాదు. అది వారి సొంత గొంతుక.

న్యాయాధికారంలో, ఇంగ్లీషువారితో సన్నిహిత సంపర్కం కలిగివుండగా, ఆనాటి సంచార న్యాయ స్థానాల వ్యవస్థ ఎందరెందరి దేశీ పండితులతోనో, సంప్రదాయజ్ఞులతోనో చర్చా విచారాలకు పెద్ద అవకాశంకలిగించింది. ప్లీడరు పట్టాదార్లుకూడా అప్పట్లో వుండేవారుకారు. ఆచార వ్యవహారాలు తెలిసిన పండితులే ప్రాడ్వివాకులనే పేర సంచార న్యాయ స్థానాలలో వాది ప్రతివాదుల తరపున వాదించేవారు. ఎక్కడికక్కడ అట్టి పండితులతో తన సంస్కరణ, హేతువాదం అంతా చర్చించేవారు. తన కులం పెద్దలతో కూడా విచారించేవారు. వారి వేషం, భాష, మతం వారిని ఆంగ్ల మానసపుత్రు లనడానికి వీల్లేకుండా చేసినై. తెంగలశాఖ పంగనామాలు, పంచెకట్టు, తలపాగ, అంగరఖా, ఆయన వైష్ణవం ఆయన సంస్కరణకు, హేతు వాదానికి అడ్డంకాలేదు.

హితసూచని పూర్తిచేసుకొని, దానికి పీఠిక రాసిపెట్టి అచ్చు వేయకుండా ఎంత కాలంనుంచి అట్టిపెట్టారో! ఒకరోజున పెద్దాపురంలో కేసువిచారిస్తూ వికారంగావుందని విచారణ చాలించి, తెల్లవారేదాకా లేపవద్దని, తెల్లవారగా లేవకపోయినట్లయితే రాజమండ్రిలో తన కొడుకుకు కబురంపమని చెప్పి నిద్రపోయి మళ్లీలేవలేదు. అది 1855 గాని 1856 కాని కావచ్చంటారు.

వారి కుమారుడు పెరిగి పెద్దవాడై రాజమండ్రిలో ప్రభుత్వ న్యాయవాది యైన తర్వాత 1862లో ఆహితసూచనిని అచ్చు వేయించారు. బందరు క్రైస్తవ పత్రిక హితవాది దాన్ని వెంటనే ధారావాహికంగా ప్రచురించి ప్రచారంలో పెట్టింది. పెరిగి పెద్దవాడై వీరేశలింగం ఆ హితసూచని సంపాదించి చదివి వాడుకొన్నాడు.

జలుమూరు వితంతువుల మహజరు :

ఈలోగా ఏమీ జరగలేదనుకోవద్దు విద్యాసాగరులవారి ఉద్యమంలో ఆంధ్రులు భాగం పంచుకొన్నారు. పాత గంజాం జిల్లా, నేటి శ్రీకాకుళం మండలం పాతపట్నం తాలూకా జలుమూరు వితంతువులు మద్రాసు గవర్నరుకొక మహజరునామా పంపుకొన్నారు. అందులో 37 మంది వితంతువుల సంతకాలున్నవి. అందులో రెండు ఇంగ్లీషు సంతకాలు! 1856 లో తెలుగు వితంతువుల ఇంగ్లీషు సంతకాలు! ఆశ్చర్యం కదూ! మహజరు ముగింపు :-

".........We, therefore, beg of your Excellency, to have mercy enough to intercede on our behalf and to frame an enactment with the authority of which Hindu widows may marry, if they choose and the opponents who excommunicate such widows may be punisbed".

ఈ మహజరు వ్రాసిపెట్టి, యీ సంతకాలు చేయించిన మహానుభావుడెవ్వరో మనకు తెలియరాలేదు. కాని ఇటువంటి ఉదారాశయులు, సంస్కారులు కొందరు తెనుగు పల్లెలలోకూడా ఉన్నారనిపించుతున్నది. (ఇదీ లీనార్డు పరిశోధనట).

స్త్రీ పునర్వివాహం గూర్చి ప్రత్యేకంగా మైసూరు కృష్ణమనాయుడి కన్నడ రచన హిందూ వివాహ శాస్త్ర సంగ్రహం తెనుగయి హిత సూచనికి తోడైంది. హిత సూచని ప్రణాళిక తలకెక్కగా బందరులో 1864లో దైవ సహజీనీ సభ ఏర్పడింది. సామినేని నాయుడుగారి బంధువులు ఉమారంగ నాయకులునాయుడు దానికి నాయకులు. అదొక మేధావుల కూటమి. సకల కుల సమ్మేళనం. సభ్యుల జాబితాను చివరలో చూడండి. 1872 నాటికి ఉమారంగనాయకులుగారు పురుషార్థ ప్రదాయిని అనే పత్రిక పెట్టి హిత సూచని ప్రణాళిక ప్రకారంగా ఆంధ్రులకు అన్ని రంగాల్లోనూ విజ్ఞానాన్ని అందిస్తూ నడిపించారు. 1864 లో మద్రాసులో వెలసిన తత్వబోధినీ పత్రికవలె ఇది బ్రహ్మసమాజ ప్రభావంకలదికాక నవ్య హైందవతా పత్రిక. అందులోనే తొలిసారిగావిధవావివాహంమీద చర్చ దండిగా దీర్ఘంగా నడిచింది ఇరుపక్షాలవాదమూ అందులోనే. ఆ పత్రికఅన్నింటా అలా చర్చావేదికగా పనిచేసింది-చాలగొప్ప విషయం. ఈ చర్చ ముదిరి ఆ పత్రికను దాటి విధవా వివాహం సంగతి అణాకర పత్రాల యుద్ధంగా 1872లోనే వ్యాపించింది. వీరేశలింగం ఈ పత్రికకు తొలి సంచికనుంచీచందాదారు. అందులో తన శృంగారపద్య కవిత్వం ప్రకటించుకొంటూ (రసికజన మనోరంజనం), దానిలో వచ్చే సంఘ సంస్కరణవేపు కళ్ళు తెరిచారు. స్త్రీ విద్యవరకూ వెళ్ళారు. ఈ పురుషార్థ ప్రదాయిని ప్రణా

శిక, పంథా ఆకర్షకంగావుంది. ఆదర్శంగావుంచి దాన్ని వరవడిగా తీసుకొని 1874లో రాజమండ్రి వివేక వర్ధని, 1875లో విశాఖ సకల విద్యాభివర్ధని పత్రికలు వెలసినై. వివేక వర్ధనిలో వీరేశలింగం స్త్రీ విద్యా ప్రబోధ కారత్వంతోనే పరిమితమైవుండగా సకల విద్యాభివర్ధనిలో పరవస్తు రంగాచార్యులవారు విధవా వివాహం శాస్త్ర సమ్మతమంటూ విజృంభించారు. ఈ పరవస్తువారు తిరుపతి కవుల పరమ గురువులు.

అసలు విధవా వివాహ ప్రబలయత్నం 1872లోనే బళ్ళారిలో జరిగింది. ఆ యత్నం విఫలమైనప్పటికీ, సంస్కరణకూ సంస్కృతికీ బళ్ళారి ఒక కేంద్ర గా నిలిచి పోయింది. పంతులుగారికి సహాయుడైన సభాపతి మొదలియారు అక్కడివారే. 1874లో కొత్తగా మద్రాసులో విధవా వివాహ సంఘంపుట్టింది. అదిచాలా పెద్దమోతుబరుల సంఘం ఆ పెద్దపెద్ద పేర్లు వింటేనే సనాతనులు వొణికారు. బొంబాయిలోనూ మోతుబరులే ఆ మోతుబరులుచేసిన అలజడి పెద్దది. అంతలో పురుషార్థ ప్రదాయినిలో విధవా వివాహంగూర్చి సౌఖ్యార్థి అనే మారుపేరుతో ఒకరు వ్రాసేవారు. వీరేశలింగం గారు స్త్రీ విద్య విషయంలో కొక్కొండ వారితో వివాదం ఆ పురుషార్థ ప్రదాయినిలోనే నడపడాన, సౌఖ్యార్థికూడా వీరేశలింగంగారే అనుకొన్నారు బళ్ళారి ధర్మవరం కృష్ణమాచార్యులవారు స్త్రీవిద్యతోనే తమలాగే ఆగిపొమ్మని, స్త్రీ విద్యావీరంలో తెచ్చుకొన్న మంచిపేరుకాస్తా విధవా వివాహచర్చలోదిగి పాడుచేసుకోవద్దని, మద్రాసు మోతుబరులు విధవావివాహ వ్యతిరేకతని తట్టుకోగలరుగాని మనవంటి మధ్య తరగతి కించిన్మాత్రులు తట్టుకోలేరు నాయనా, మద్రాసు మోతుబరులతో ఉజ్జీ కట్టకు అని హితోపదేశ లేఖ వ్రాశారు. కాని సౌఖ్యార్థి వీరేశలింగం కాదు. కానేకపోయాడు. ఆ మద్రాసు ఘాటీలకు విశాఖ రంగాచార్యుల వారు తోడై విజృంభించేసరికి కొక్కొండవంటి స్త్రీ విద్యా వ్యతిరేకి భయపడి, వీరేశలింగం విధవా వివాహంలో తనతో కలిసి వస్తాడని అనుకొని, తనతో చేసిన తగాదా మరచి కలాలు కలిపి సనాతనమ్మన్యతకై "రంగాచార్య నాస్తికులపై" ధర్మయుద్ధం సాగిద్దామని సందేశ లేఖలంపారు, పాపం. అప్పట్లో వీరేశలింగంగారిలో స్త్రీ పునర్వివాహవీరం కాదుగదా, అసలప్పటికి ఆ సానుభూతి కూడా ఏర్పడలేదని పిస్తుంది. సంతానంలేని విధవ పెదతల్లి తనభర్త ఆస్తిఅమ్మితే ఆ అమ్మకంచెల్లదనివాజ్యం చేసి ఆరేళ్ళుకాలేదు; తనదింకా ఒడుదుడుకుల బ్రతుకుగా వుంటుండగా విధవ పెదతల్లి ఆ స్తిని ఆశించడంతప్పని తానింకాసమాధానపడలేదు. అంతపాటి ఉదారభావాలేవుంటే అదే అనుకూల సమయం. అసలు ఆ తర్వాత తాను పూనుకొన్ననాటికి ఆ కేంద్రాలు మూడూ మూగవోయివున్నై. 1874-75ల్లో అయితే వేడివేడిగావున్నై. కానితాను జీవితంలో నిలదొక్కుకోలేదు, చిన్న వయస్సు, కాబట్టి విధవా వివాహోద్యమమే ఏకంగా తలపెట్టక పోవచ్చునుగాని అసలాభావాన్ని సమర్థించక పోవడమేమిటి? వివేకవర్ధని మాటను విరగేసి నిర్ధవకవేవి అంటూ వెంట్రుకలు లేనిది విధవ అంటూ వెక్కిరిస్తున్న కొక్కొండవారు ఆ వుత్తరం వ్రాసిన మీద రంగాచార్యుల వారితో చేరి కొక్కొండ

వారినే మళ్ళీ ఖండించకపోయారా? మద్రాసు మోతుబరుల కంటికి తానగుపించలేదని చెప్పడమేగాని, అగుపించి వారి పిలుపేముట్టివుంటే అందులో దిగే స్థితి ఎక్కడుంది? రాజమండ్రి కోర్టు వ్యవస్థను ప్లీడర్ల దగ్గరనుండీ, రికార్డు కీపరు సిరస్థదారుదొర, న్యాయాధిపతి వరకూ పెకలించివేసి అడలెత్తిస్తున్న స్థితిలోకూడా విధవా వివాహానికి సమయంకాలేదంటూ వాయిదా వేస్తూవచ్చారు. తనంతతానుగా సమస్యను ఎత్తుకోలేదు. చల్లపల్లి బాపయ్య చాల కష్టపడి ఆయన్ను మొగ్గించవలసి వచ్చింది. వైదిక సంస్కర్తల్ని కూడగట్టి తెచ్చి చెప్పించాల్సి వచ్చింది. 1872 లోనే పురుషార్థ ప్రదాయినిలో నడిచే విధవా వివాహ వివాదంలో కలిగించుకోకుండా తప్పుకొని, అప్పట్లో స్త్రీ విద్యా వీరంలో తెగ విజృంభించారు. రాష్ట్రంలో స్త్రీవిద్యాశాలలు మూడు నూర్లకు పైగావెలసి జమీందారీ జమీందారిణులనుంచీ మధ్య తరగతులవరకూ స్త్రీ పాఠశాలలు పెట్టించి వుండగా పిచ్చి పండితుడొకరు దాన్ని కాదనటంతో ఆ తగాదాను ముదరబెట్టి రభసరేపి జాతిచూపు తనవేపు తిప్పుకోవడం జరిగింది. పంతులుగారు అదృష్టవంతులై కొక్కొండ వారు ప్రత్యర్థులుగా దొరికారు.

ఆంధ్రలో స్త్రీ విద్యకు స్త్రీలే ప్రారంభకులు. గొడే జానకమ్మ జమిందారిణి ప్రారంభకురాలు. పోతం జానకమ్మ తొలివ్యాస రచయిత్రి. ఆమె భర్తతో ఇంగ్లాండు వెళ్ళివచ్చి ఆ విదేశీయానంగూర్చి వ్రాయగా కొక్కొండవారే 1872 లో తమ పత్రికలో ప్రకటించారు. వివేకవర్ధని పెట్టకముందే ప్రకటించారు. కొమ్మిరంగయ్య, గజ్జెల రామానుజులనాయుడు, జయ్యేరు సూరి వంటివారు పంతులుగారికి స్త్రీవిద్యా ప్రచారంలోమార్గదర్శకులు పంతులుగారు విధవావివాహ వీరంపూనేనాటికే ఆ వాదరంగంకూడా చాలావరకు పూర్తయిపోయింది. ఆంధ్ర దేశంలో ఎందరో విద్యాసాగరుల వారి వాదాన్ని, దానికేదో కొంత చేర్చికూడా వినిపించారు. రాజమండ్రి, కాకినాడ మద్రాసు సభల్లో పంతులుగారు పొందిన విజయాలు పంతులుగారి విజయాలు కానేరవు. అదంతా విద్యాసాగరులెప్పుడో పొందిన విజయానికి పునశ్చరణ. ఆ పైన ఏమైనావుంటే ముద్దు నరసింహం నాయుని హృదయవాద విజయం. పంతులుగారి తొలి ప్రసంగం అదేకదా! 1879లో మొదలైన ఆ ఉపన్యాసాలుకూడా మూతపడ్డాయి. 1880 అంతాఖాళీ. పునర్వివాహనాటకం రెండూ అసంపూర్ణంగానే నిల్చిపోయినై. ఆరంభించి పరిత్యజించినంత పని అయింది. కాలుపంతులుగారి పత్రిక మున్సిపాల్టీ పైకివెళ్ళింది. రెండేళ్ళుకోలాహలంచేసివిశ్రమించిన మద్రాసు సంఘంలాగానే రాజమండ్రిలో తయారయింది. బ్రహ్మసమాజ శివనాధశాస్త్రి వస్తారనగా మళ్ళీ కోలాహలం లేచింది. 1881 లోకాకినాడ సభలో చైర్మన్ పైడా రామకృష్ణయ్యగారు తగిలారు. ప్రసంగం మెచ్చారు. మెప్పుతోనేసరి.

ఆస్తి డబ్బు వృత్తిఅంటూ ముట్టజెప్పి మొగ్గింపకుండా, ఆదిలో ఆదర్శం కోసమని వంగదేశంలోకూడా వితంతు వివాహ వరులు దొరకలేదు. శివనాధశాస్త్రిగారు విద్యాసాగరులవారిబాధలన్నీ చెప్పివుండాలి. ఆయన ఆర్జనంతా పెట్టవలసివచ్చిందీచాలక

పోతేఅప్పులుచేసి,అవితీర్చడా కిఆ యనపడినయమయాతనలు, గృహస్థుగాళ్ళ దురాశలు గొంతెమ్మకోర్కెలు, పరాన్నభుక్తిపరాయణత అంతావినివుండాలి. ఎంత ప్రచారంచేసినా 'రెండేళ్ళగా ఎవ్వరూ ముందుకురాని కారణం అప్పుడు తెలిసింది.' 'పెద్దనిధి కావాలి'. రాజమండ్రి బృందంలో ఎవ్వరూ ధనవంతులుకారు. కాని డబ్బు కావాలి.

గత శతాబ్దంలో సంస్కరణతో రాజకీయాందోళనలో కోమట్లు ముందున్నారు. శతాబ్దాదిలో మామిడి వెంకటార్యుడు మహాపండితుడులేచి వైశ్యులకు వేదం విధించిన కర్మ కాండంతా కోమట్లం జరుపుకొంటామని అడిగాడు. బ్రాహ్మణులు తిరస్కరించారు. తానే పౌరోహిత్యం చేసుకొంటామన్నాడు. బ్రాహ్మణులు నిరోధించారు. కేసుపెట్టారు. ఆ కేసు దశాబ్దాలు నడిచింది. వెంకటార్యుని వాదనే చివరకు నెగ్గింది. విశ్వబ్రాహ్మణులు కూడా అప్పుడే విజృంభించారు. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిచేత 1834కే స్త్రీ నీతిశాస్త్రమును వ్రాయించింది తుళంగసెట్టి అనే వైశ్యులుకదా ! మద్రాసు నేటివ్ అసోషియేషన్ పెట్టి, ఇంగ్లీషు పత్రిక నెలకొల్పి దక్షిణ భారత ప్రథమ రాజకీయ నాయకుడైన గాజుల లక్ష్మి నరసుచెట్టి వైశ్యులు. వీరేశలింగం రచనలను పాఠ్య గ్రంథాలుగా పెట్టించి వారిని వారి సంస్కరణలనుకూడా 1875 నుండే ప్రోత్సహించిన సమర్థి రంగయ్యచెట్టిగారు విద్యా విషయంలో నిర్వహించిన పాత్ర పెద్దది. మచిలీ బందరునుండివచ్చి బ్రహ్మ సంస్కరణ బీజాలు నాటివెళ్ళిన బడిపంతులు ప్లీడరై, అంతర్జాతీయ నీతి ప్రచారక సభ్యుడై ఉత్తర భారతంలో ఉపన్యాస యాత్రచేసి, అలహాబాదులో ఆ సభాధ్యక్షత వహించ గలవాడై తిరిగి జబ్బిగావస్తూ రాజమండ్రిపౌరుల మేళతాళాలతో ఎదురేగి యిచ్చిన స్వాగతం పొందివున్న ఆత్మూరి లక్ష్మీనరసింహచెట్టి వున్నారు. సమయానికే రాజమండ్రిచేరారు. పిల్లి వైశ్య జమీందారు పైడా రామకృష్ణయ్యగారిచేత విధవా వివాహనిధి 30 వేలు వాగ్దానంచేయించి పెళ్ళి ఒక్కింటికి వెయ్యి రూపాయిల ఖర్చువిరాళ మనిపించాడు. స్వీయచరిత్రలో చాలమంది వైశులు పంతులుగారికి తోడ్పడినట్లు కనపడుతున్నారు. 1880 పడిలో వెయ్యి రూపాయలంటే పదిపన్నెండెకరాల ఆస్తిపెట్టు. అంత మదుపు ఆ సెట్టి జమిందారు పెట్టకపోతే వీరేశలింగం చరిత్రకెక్కక పోయేవాడు. విద్యాసాగరులకు పైడా రామకృష్ణయ్యలు దొరకలేదు. మహారాష్ట్రలో విష్ణుశాస్త్రికి మాత్రం పెద్ద జమీందార్లు, ఫైల్మానులతోసహా దొరికారు. పైడావారి నిధితో పదమూడు పెళ్ళిళ్ళుచేసి, క్రమంగా వివాహ వ్యయం సహాయం తగ్గించివేస్తూ, ఆదర్శ విధవా వివాహాలు జరిగేట్టుచేసిన దక్షతమాత్రం పంతులుగారిదే. కాసిసంఘ సంస్కరణ పంతులుగారి సంపాదనకు ఉపకరించకపోలేదు. వారి రచనలు లాభించాయి. ధనవంతు లయ్యారు. జట్కాబండి, గొడ్డుమాంసం పెట్టి పెంచే గండుకుక్క, ఎక్కడెక్కడనుంచీ తెప్పించి నాటిన నానాఫల పుష్పజాతుల చెట్లు నిండినతోట, వేసవి శీతవాసాలు, దంప తుల సాయంకాల విహారాలు, మూడునగరాల్లో బవంతులు-అంతా యూరోపియన్ శైలి జీవితం అమర్చుకోగలిగారు దక్షిణ భారత విద్యాసాగరులు. బంగాలీ విద్యాసాగరు

లంటారా, నెలకు వెయ్యిరూపాయలు ఆదాయమిచ్చే ఆస్తిని కొడుకుకు ఇవ్వకుండా ఆ ఆదాయాన్ని 45గురువ్యక్తులకు, పైన కొన్నిసంస్థలకు నెలనెలాముట్టేటట్టు వీల్నామా వ్రాసేసి, కలకత్తా నగరవాసం వీడి దూరంగా సంతాలీపరగణా అడవుల్లోకి వెళ్ళి ఆ కొండజాతి సేవలో శేష జీవితం గడపిన దయాసాగరులు

కాని మన పంతులుగారు తనకు విధవావివాహ నిర్వహణకు అవకాశం కలిగించిన పైడారామకృష్ణయ్యగారిని గూర్చి మంచిమాటలెన్ని వ్రాసినా చిట్టచివరి మాటగా మాత్రం ఆయన దాతృత్వాన్ని అప్రధానంచేసి వ్రాశారు. అదే బహుబాధాకరమైన సంగతి

"ధనము లేకపోవుటచేత సత్కార్యములు సాగక నిలిచిపోవనియు, అప్పటికి రామకృష్ణయ్యగారి ధనముతో చేయబడిన వానికంటె ద్విగుణముగా వారి ధన సాహాయ్యము లేకయే చేయబడినవి" (267, స్వీ.చ. 1వ భాగం, విశాలాంధ్ర ప్రచురణ). పైడావారి పదివేల ట్రస్టు ధనం పాత దంపతుల క్షేమానికేగాని కొత్త పెళ్ళిళ్ళకు కాదని కట్టడ జేసినట్టి ఆత్మూరిని దెప్పిపొడవడానికైనా ఈ మాటలు అనవలసినవిగావు.

పంతులుగారితో తనకువచ్చిన విరోధాన్ని అవతలబెట్టి ఆత్మూరివారు సంస్కరణ కోసంగావచ్చి, వధూవరులకు కట్నం చదివించి ఇలా దెప్పిపొడిపించుకొని వెళ్ళడం ఆయన శీలాన్ని పెంచి, పంతులుగారి అనుదాత్త చిత్త ప్రవృత్తిని తెలుపుతున్నది మన సంఘ సంస్కరణలో పాల్గొన్న వివిధ కులాలు, వ్యక్తులు ఏవో ఎవరెవరో ఏకొంచెంలీలగా తెలిసివున్నా, పంతులుగారి స్వీయచరిత్ర ఆత్మూరి వారి ప్రాధాన్యాన్ని దాచివేసిందని తెలుసుకోగలరు. ఆయన్నొక ఇంగ్లీషు చదువుల జడ్జి మాత్రుడిగా, దారిలో ఒగిపోయినతోడిప్రయాణికుడిగామాత్రమే పంతులుగారు చిత్రించారు ఆ చిత్రణే ఆస్వీయ చరిత్ర అంటే నాలో అనుమానం కలగడానికి కారణమయింది. కోమట్లు ఆర్య వైశ్యులని పిల్చుకోడానికి ఆయనేకారణం. వారు సోమయాజులు, వేదపండితులు. వారినిగూర్చి బ్రాహ్మణ పండితులు పద్య కావ్యాలు వ్రాశారు. ఆయన కుల వ్యవస్థను నిరసించి ఉపన్యసించాడు పంతులుగారు బ్రాహ్మణకుల విమర్శేగాని కుల వ్యవస్థ మీద అంతపాటి వ్రాయలేదనుకొంటాను. "క్రైస్తవాచార్య ప్రేరణమున ఈ నడుమనే జాతి భేదములనియనర్థమును తెలుపుచునొక ఉపన్యాసమిచ్చెను" అని వ్రాశారు. ఆ క్రైస్తవులనుండి పంతులుగారు పొందిన ప్రేరణ, ప్రోత్సాహ సహాయాలు ఇంతంతకాదుగదా. వారినసలు ప్రచ్ఛన్న క్రైస్తవులనే వారున్నారు. ఈ వ్రాత గురిగింజతనం. "ఆకస్మికముగా వేదములయందు అపరిమిత విశ్వాసమునొంది వేదపాఠశాల పెట్టియున్నారని" ఎగతాళి మాటలు వ్రాశారు. సంఘ సంస్కరణకు వేదాన్ని సాధనం చేసుకోవచ్చని ఆత్మూరి భావన. ఆర్య సమాజమే అట్టిది. అప్పటికే ప్రచురమయింది. పంతులుగారి సంస్కరణ మనేది ఆర్యసమాజ సంస్కరణస్థాయిని అందుకోలేదని తెలియకుండా వ్రాశారు; ఆయనే ఆ దారి తొక్కివుంటే ఛాందస పక్షం అవాక్కు అయ్యేది. బ్రాహ్మవైదిక మతాల కల

గలుపు నడవడి తప్పేది. తెల్ల అధికార్ల మిషనరీల అండదండలు దొరికేవికావు. బహుశా రావుసాహెబ్ బిరుదు లభించేదికాదేమో అర్జనకూడా వుండేదికాదేమో.

అంతేకాదు,లాయరుగాజడ్జిగా కూడాఆత్మూరికిస్వీయచరిత్రలోపంతులుగారుతగుపాటి స్థానంయివ్వలేదనుకొంటాను. తనకుతెలిసినంత లా ఆత్మూరికి తెలియదని ధ్వనించారను కొంటాను తమ్ము వెలివేసిన విరూపాక్షపీఠాధిపతిమీద దావావద్దంచేకూడా వేశారని, జిల్లా కోర్టు దాన్నికొట్టివేసిందని, అది ప్రతిష్ఠసమస్య అయిందని హైకోర్టులో దాన్ని తాను జాగ్రత్తగా నడుపుకొన్నట్టుగా వ్రాసి ఆత్మూరివారి ఆ విజయంలో తనచేయి వుందని పించారు. ఆత్మూరి సామర్ధ్యం తెలిసినవారెవ్వరూ ఈ ధ్వనిని నమ్మరు. ఆయన జీవిత చరిత్రలిందుకు భిన్నంగా చెప్పుతున్నాయి. పంతులుగారు - కోర్టులు అనే శీర్షికా దృష్టితో స్వీయచరిత్రను చూస్తే వారి లిటిగేషన్ పెద్దదని, అందులో అందెవేసిన చేయిఅని, అంతేగాకుండా కోర్టు పండితుణ్ణనికూడా అనిపించుకోవాలన్న అభిలాష వారికిలేకపోలేదని తెలుస్తుంది. పంతులుగారి జీవితంలో కోర్టుపేచీ చాలా పెద్ద భాగమైవుంది. దాన్ని ప్రత్యేకంగా పరిశీలించి, వారి జీవితరచనలో ఒక అధ్యాయం కేటాయించాలి. అందులో తప్పనిసరి లిటిగేషన్ ఎంత, సంస్కరణకు ఉపయోగించినదెంత, వ్యక్తిగతకోణమెంత వగైరాలు చర్చించదగివుంటుంది. పంతులుగారేకాదు, వారింట్లో పెరిగి, ప్రథమవితంతు వివాహవరుడైన గోగులపాటి కూర్మనాథంకూడా లిటిగేషన్లో గురువునుమించినశిష్యుడు. నాకు తెలిసిన సంస్కర్తల్లో ఎవరూ వీరేశలింగంగారిలాగా కోర్టులవెంట పడినవాడు లేరు. మానవతా ప్రేరణ ప్రధానంగా సంస్కరణకు ఒగుతుంటారు. అట్టి సంస్కరణ కోర్టుపేచీలను కోరదు. కోర్టు వెలుపలే సంస్కరణ విజయాన్ని అపేక్షించాలి. ప్రజా జీవితంలో నిందలు తప్పవు. కోర్టులద్వారా నిందలు పాపుకోవాలనుకోవటం వింతగా వుంది. ఆ పని చిన్నవాళ్ళమైన మనం చెయ్యదంలేదు. బెంగాల్లో విద్యాసాగరుల మీదా నిందలువేశారు. వారు కోర్టుకెక్కలేదు ఇలా కోర్టు లిటిగేషన్ను పోరాటసాధనం చేసు కోలేదు. వీరేశలింగంగారు కోర్టును చీటికి మాటికి వాడుకొన్నారు. అదివారి స్వభావాన్ని తెలియజేస్తున్నది. కోర్టులో ఆయన ఓడిపోయినదొకే ఒక్క సందర్భం. కానిఅదికాస్తా మర్మభేదకమై పోయింది.

వివేకవర్ధనిని సమిష్టిగా నిర్వహిస్తూ దుష్టచతుష్టయ మనిపించుకొన్న నలుగురి లోను పంతులుగారే ఉన్నతవిద్యనభ్యసించకున్నట్టివారు. వివేకవర్ధని ఇంగ్లీషు విభాగాన్ని తక్కినవారే, ముఖ్యంగా ఏలూరి లక్ష్మీనరసింహంగారే చూచుకొన్నారు. ఆ తర్వాతవారే వేరొక ఇంగ్లీషు పత్రికపెట్టారు .ఆ స్తిక పాఠశాలపెట్టిమంచిపేరు.పలుకుబడిసంపాదించి, టౌనులో బ్రాహ్మణేతరులనుంచి ఈ సంస్కరణలకు మంచిమద్దతుతెచ్చారు. రాజమండ్రి తొలి ప్రజానాయకుడే ఆయన. ప్రకాశం పంతులుగారికి ఆయన గురువు. గొప్ప ఉదారుడు, ఆశ్రితపోషణకు పేరు. పంతులుగారి స్వీయచరిత్ర చిత్రణలో ఆయనొక సిటీ బుల్లీ-లీనార్డు పరిశోధనలో మహాత్ముడు. శివరావుగారుకూడా చెప్పేది అదే. నిజమైన

ప్రజానాయకుడు కావడాన్నే పంతులుగారు వారిమీద కోర్టునుసికొల్పారు తెరచాటునుండి, మధ్యలో తెరదీసి కోర్టులో సాక్షిగా ప్రవేశించారు. ఏలూరివారూ పంతులుగారిమీద కేసు వేశారు. ఒకకేసులో వారిని మరోకేసులో వీరిని కోర్టు బైటపెట్టింది. కాని ఏలూరిని విమర్శించిన తీర్పునే ముప్పై పేజీల్లో యిచ్చారు. తనతప్పులెన్నిన తీర్పు మాటెత్తకుండ దాచారు. స్వీయచరిత్ర ధోరణి ఇలాగుంటుది.

పంతులుగారితోపాటు దుష్టచతుష్టయం అనిపించుకొన్న వారిలో బసవరాజు గవర్రాజు గారొకరు.ఆయనశాంతశూరుడు.ఆయనచేసిఅదంతా పంతులుగారి పేరజమవేసి అకాలంగా వెళ్ళిపోయారు. తన్నుతాను చెరిపేసుకొని వెనుక వరుసలో నిలబడేవారు. ఆయన నాయకుడుకాడు, సైనికుడు. కాని నేపథ్యంలో నాయకుణ్ణి దిద్ది రంగంమీదికి పంపగలవాడు. అందుకే పంతులుగారికి ఆయనంటే ప్రీతి. బుర్రా రాజాలింగం, చల్లపల్లి బాపయ్యగారలు ఆ చతుష్టయంలోనూ,షట్చక్రవర్తుల్లోనూలెక్క కెక్కినప్పటికీత్వరలోతెరమరుగయ్యారు.

1830వ పడిలో ఒకతెల్లదొరసాని జిల్లాజడ్జిగారి భార్య పఠనమందిరంపెట్టి వెళ్ళిన దగ్గరనుండీ, సామినేని విధవావివాహ ప్రయత్నాలవల్లను వారి హితసూచని ప్రచురణ వల్లను రాజమండ్రిలో ఒక సంస్కరణ వాతావరణం ఏర్పడింది. అక్కడ బందరుసెట్టి బిడ్డ బ్రహ్మోకు ఆ రాజమండ్రికి పరిచయంచేశాడు. దానితో ఒక మధ్యతరగతి సంస్కారుల చిరుగుంపు తలెత్తింది. ఆ చిరుగుంపు సంస్కరణకు కాకినాడ సెట్టి జమీందారొకరు మదుపు పెట్టారు. ఏగజపతులో ఏ రావువారో, మద్రాసు ఘరానాలో చెయ్యలేని పనులు చేయగలశక్తి ఆ రాజమండ్రి చిరుగుంపుకు సమకూరింది. బ్రాహ్మణ బ్రాహ్మణేతర మధ్యతరగతి అభ్యుదయ శక్తుల ఉమ్మడి కృషిగా ఆంధ్రదేశ సంస్కరణ రూపుగొని విజృంభించింది. అది చెప్పడమే ఈ రచన ప్రధానోద్దేశం

ఆసంస్కరణ దుష్టచతుష్టయంలోనూ షట్చక్రవర్తుల్లోనూ ఇంగ్లీషులోఉన్నతవిద్య అభ్యసించనిదొక్క పంతులుగారేకదా. కానివారి తెలుగుసంస్కృతాలే ఆగుంపుకిఆయన్ను నాయకుణ్ణి చేశాయి. దానికి తోడు పంతులుగారికి యింట్లో పెద్దల ఒద్దింపులేదు. తన యింటికి తానే పెద్ద చిన్నప్పటినుంచీ. తండ్రి, పెత్తండ్రి చదువుముగియకముందే కాలం చేశారు. తల్లిగారుకూడా త్వరలోనే కన్నుమూశారు. తాను, తన వెంటనడిచే భార్య-అంతే. అన్నదమ్ములుగాని, అక్కచెల్లెళ్ళుగాని, మేనమామలుగాని ఎవ్వరూలేరు. ఆ పైన పిల్లలు లేరు. ఆ సంసారం బరువేముంది? ఆ సంసారం మీద సంఘానికి ఎంత పట్టు వుంటుంది? సంఘ బహిష్కారం వారినేమి బాధిస్తుంది? ఏ బంధువుల ఒత్తిడి వుంటుంది? తెల్లదొరతనాన్ని కాస్తమంచి చేసుకొంటే, సంఘంమీద దాడి చెయ్యడానికి ఆయనకు అంతా సులువే. వెనుదిరగనక్కరలేదు. ఆ కుటుంబ వ్యవస్థే ఆయన నాయక పదవికి పెద్ద వరమయింది. ఆ సులువు లేనివారంతా ఆయన్ను ముందుపెట్టి వెనుకనుండి అంతా చేశారు.

వారిలో ఎవ్వరూ దేశంమీది సంస్కరణ నాయకపట్టం తమకే కావాలనుకొన్న వారులేరు. కాకపోతే స్థానికంగా కొంత ప్రాధాన్యం (ఏలూరివారికి) తమ కృషినిబట్టికలగడం రామకృష్ణయ్యగారి నిధిమీద ఆత్మూరికి ఆధిపత్యం కలగడం - అంతేగాని అంతకన్న పంతులుగారి నాయకత్వానికే ఎసరుపెట్టేస్థితి ఎవరివల్లనూ ఏర్పడలేదు. కాని అంత మాత్రంకూడా సహించని నాయకుడు వీరేశలింగంగారు. అంత మంచిగ్రూపులో ఎవరి ప్రాధాన్యం వారికివ్వలేకపోయి, ఆ గ్రూపు సమిష్టిని చంపి అంతా సొంత ప్రయోజకత్వం తప్ప ఇంకెవరికీ ఏమీలేదనిపించడానికి తంటాలుపడి ఆ గ్రూపు సొంపుని పాడుచేశారు పంతులుగారు. అంతమాత్రపు స్వల్ప ప్రాధాన్యమైనా సహచరుల కేర్పడరాదని వారితో మచ్చరించి వారిని దెబ్బతీసినప్పటికీ వారెవ్వరూ సంస్కరణకు వ్యతిరేకులుగా మారిన వారుకారని గమనిస్తేమట్టుకు పంతులుగారి ప్రవర్తనకు మనమెంతో బాధపడకతప్పదు. సహచరులను దెబ్బతీయడానికై వారివారి ప్రత్యర్థుల సాయంపొంది, తామే ఆ ప్రత్యర్థులకు సాయపడితే వారు (న్యాపతి సుబ్బారావు) కాస్తా తమ సంస్కరణను ఒక్క రాజమండ్రిలోనే కాకుండా, రాష్ట్రంలోనే దెబ్బతీయడానికి ఉద్యమించారు.

ఎదురెత్తుగా హిందూ సమాజాన్ని స్థాపించి. మద్రాసుదాకా అనిబీసెంటు ఆఖ్యక్షతదాకాను ప్రాకించారు. విధవావివాహ సంస్కరణోద్యమాన్ని ఇలా తెలివిగా దెబ్బతీసేవారినే తమసంస్కరణకు అండదండగా నిల్చారని తుదిప్రకటనలో వ్రాయగలిగారు. కాని జీవితాంతము ఈ సంస్కరణను వీడకుండా తమ లిటిగేషన్ దండప్రహార తాడితులైన మృత సహచరులనుగూర్చి నాలుగు మంచి మాటలు వ్రాయలేకపోయారు. పంతులుగారి సహచర, అనుచర ముఖ్యులందరూ అర్థాయుష్కులు. స్వీయచరిత్ర రచనా, ప్రచురణకాలాలకి క్రమంగా కాలంచేశారు. వెళ్ళిపోయినవారిని వెళ్ళిపోయినట్లే వెంటనే వెలువరించే భాగాల్లో ఎంత చెడుగా వ్రాయాలో - అనవసరమైనప్పటికీ - అంతా వ్రాశారు. సమాధుల్లోనుంచి మళ్ళీ ఏవిధంగానూ లేవలేనంత బరువు ఎన్నపైపేజీలకునింపి - వాళ్ళ సమాధులమీద పెట్టారు. ఆ మృత సహచరులను కీర్తిశేషులుగా మిగలనీయరాదనుకొన్నారు. పంతులుగారి కసి, స్వభావం, ఏకమేవాద్వితీయంగా తన స్థానాన్ని చరిత్ర కెక్కించుకోవాలనే తపన ఇందులో ప్రస్ఫుటమవుతుంది.

స్వీయచరిత్ర తొలి సంపుటిపైన చాల గోలలేచింది. వైశ్య పత్రిక, వసుంధర, శశిరేఖ వగైరా పత్రికలు బాగా ఆక్షేపించాయి. ఆక్షేపణలను సమాధానించే పూచీ వహించలేదు పంతులుగారు. చాలా నిర్లక్ష్య వైఖరితో ఏకపక్ష కథనంగా అలాగే రెండో భాగం వ్రాసుకొంటూపోయారు. తన నైతిక వ్యక్తిత్వానికి సవాలుగా మూడేళ్ళు నడచిన ఘట్టాన్ని ఒకబొంకుబొంకి - ఆ విషయం యింకా కోర్టులో వుండడాన - (నాల్గువారాల క్రిందనే ఉప సంహరించుకొనికూడా) ఇందులో ఇప్పటికి వ్రాయడంలేదని అవతారికలో ప్రకటించి దాటుకుపోయారు. అది అబద్ధపు వ్రాతఅని ప్రచురణ కర్తలకు తెలయనిది

కాదు. దీనితోపాటు, తొలిసంపుటిలోని అసత్య కథనాల సంగతిదాగా తెలుసుకొన్న కొమర్రాజు లక్ష్మణరావుగారు తొలిసంపుటి ప్రచురణమయినప్పుడు పంతులుగారి కథన మందుంచిన నమ్మకాన్ని తగ్గించుకొని, రెండోసంపుటి సంపాదకీయ భూమికలో జాగరూక వచనం ఒకటి వ్రాయాల్సినవారయ్యారు.

"గ్రంథమునందు సమకాలికులగు ననేకులంగూర్చి ... పంతులవారు ఒక్కొక్కచో భూషింపుచు, నొక్కొక్కచో దూషింపుచు వ్రాసియున్నారు. ... కొన్ని ఎడల పంతులువారికిని మాకును అభిప్రాయ భేదములున్నను గ్రంథరచనా స్వాతంత్ర్యము సంపూర్ణంగా వారిదియేయగుటచే వ్రాసినది వ్రాసినట్లు ప్రకటించితిమి"అని ప్రకటించుకొని తమ బాధ్యత వదిలించుకొన్నారు!

అలా తమ చేతులు కడిగేసుకొని ప్రకటించిన మలి సంపుటిని దేశం తొలిసంపుటిలాగా పట్టించుకోలేదు. మంగమ్మ కేసులో భంగపడి పంతులుగారి నైతిక ప్రతిష్ఠ దెబ్బతిన్నవార్తలు వైన వైనాలుగా పత్రికల్లో ఎక్కుతుండగా, పబ్లిక్ జీవితంనుండి వారిని తప్పుకొమ్మంటున్న మాటలు వినిపిస్తుండగా వెలువడిన ఈ సంపుటి కథనాన్ని లోకం పట్టించుకోలేదు. పంతులుగారు కడమ నాలుగేళ్ళు తలవొడ్డిగల పెట్టుకొని వెళ్ళిపోయారు. జలియన్‌వాలాబాగ్‌లో జనరల్ డయ్యర్ దురంతాలపైలేచిన జాతియోద్యమ తుఫానుహోరులో పంతులుగారు నిశ్శబ్దంగా చనిపోయారు. వందేమాతరం నాటినుండే జాతీయ వాదంతో ఏకీభవించక సైదుకట్టన్లోకి వెళ్ళిపోతున్నారు. బెంగాలు బ్రహ్మ సామాజికులు - బిపిన్ చంద్రపాల్, శివనాథశాస్త్రి మొదలగువారు వందేమాతరంలో ముమ్మొనదారులుగావుండగా మన బ్రాహ్మలు వీరేశలింగ వెంకటరత్నాలు బ్రిటిషు ప్రభుభక్తిపాదులై బిరుదాలు, హోదాలు, ఉద్యోగాలు చూచుకొంటూ సంఘసంస్కరణ అన్నారు. వీరి యీ ప్రవర్తనవల్ల ఆంధ్రలో సంఘసంస్కరణకు, జాతీయతకు వేర్పాటుభావం ఏర్పడింది. సంఘసంస్కరణను జాతీయతతో జోడించే నాయకులు ఆంధ్రలోలేకపోయారు. స్వాతంత్ర్యంముందు-దాని తర్వాత సంస్కరణ అన్నవారిదే ప్రాబల్యం.

ఆ రెండింటిని ఏకకాలంలో నడపాలన్న గ్రహణ గలిగిన వారిద్దరున్నారు-వారు ఉన్నవ, ప్రకాశం. వారిద్దరూ వీరేశలింగంగారి పొరపాటు నెరిగినవారే. ఈ శతాబ్దపు తొలి దశాబ్దంనుండీ వారికృషి సంఘసంస్కరణను స్వాతంత్ర్య సాధనను జంట కర్తవ్యాలుగా గ్రహించిసాగిందే. వారిద్దరూ విద్యాదశనుండి ఆమరణమూ గొప్ప స్నేహితులు. ఒకరు కాంగ్రెసులోవుండి, మరొకరు కాంగ్రెసు వెలుపలవుండీ చేసిన కృషిలో ఏక సూత్రంవుంది. వారలా విడివిడిగా ఉండటానికి కూడా ఏకావగాహనవుంది. అందు కొకరినొకరు సమర్థించుకొన్నారు. వారిద్దరూ రచయితలేగారు, సిద్ధాంత కర్తలేగారు, ఆచరణశీలురు, త్యాగధనులు. వారి కృషిని పాత్రను తిరిగి మదింపు వేయాల్సివుంది.

వారిద్దరూ ఏకోన్ముఖమైన కృషి సాగించిపుంటే మరెంతో బాగుండేది. స్వాతంత్ర్యా ముందు వారికది ఉద్యమం మించినపని అయిందిగాని, వారికృషి అలానే సాగింది.

"ఆంధ్రులు రెండో ప్రపంచయుద్ధం అనంతరందాకా వీరేశలింగాన్ని మరచి పోయారు. దీక్షగా వీరేశలింగాన్ని స్మరించటం ప్రారంభించినవారు ఆంధ్రదేశంలోని అభ్యుదయ రచయితలు''. కాని, వారువచ్చిపోయిన కొత్తలో జస్టిస్‌పార్టీయులకే కా స్తస్మర ణీయుడుగా మిగిలారు. అదొకవిశేషం-ఆలోచించదగ్గది. అది జస్టిస్ పార్టీ సంస్కారణా భిరతినే తెలుపుతుందో, ఆ పార్టీ చేసిన బ్రాహ్మణ విమర్శకు, దూషణకు, చూపిని బ్రాహ్మణ ద్వేషానికి పంతులుగారే పునాదులువేసి మార్గదర్శకులు కావడాన్ని తెలుపు తుందో, బ్రిటిష్‌రాజ భక్తిలో ఏకీభావాన్ని తెలుపుతుందో - ఈ త్రికసమాసాన్నే తెలుపుతుందో కానవలసిన సంగతి. బ్రాహ్మణ దూషణకు ద్వేషానికి, పంతులుగారే నాందీ వాచకం పలికారని శ్రీ శివరావుగారంటారు. వీరేశలింగంగారిపై పరిశోధనలో ఇదొక నూతన కోణం. కేశవచంద్రసేనుల నాటినుండి బ్రహ్మసమాజం పాటించిన బ్రాహ్మణ విమర్శ, పురాణనింద-వెంకటరత్నంనాయుడుగారితోటి గాఢానుబంధం, నాయుడుగారి జస్టిస్ పార్టీ ప్రవేశం-కె. వి. రెడ్డినాయుడుగారు మంగమ్మ కేసులో పంతులుగారి తరపున ప్లీడరీ, ఇలా ఆలోచిస్తే...

ఆ జస్టిస్ పార్టీకూడా అడుగంటి పంతులుగారి స్మరణే లేకుండా పోతేపోయింది గాని, అభ్యుదయ రచయితలవల్ల కమ్యూనిస్టు పక్షంవల్ల ఆదీర్ఘమైన విస్మృతి సమాధి నుంచి పంతుగారు పునరుత్థానం పొందేసరికి, వారిని గూర్చి వున్న రెండో అభిప్రాయానికి ఆక్షేపణలకీమాత్రంపునరుత్థానంలేకపోయింది. తన్నుగూర్చి,దేశంగూర్చి,తనువిరోధించిన సహచరులగూర్చి తాజెప్పుకొన్న ఏకపక్ష-పక్షపాత కథనమేదైతేవుందో దాన్నే వినవలసి వచ్చింది, అభ్యుదయికుల కొత్తతరం-యువతరం. ఈలోగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలో సమూల విప్లవం సోషలిజందాకా పురోగమించివున్న నవతరం చరిత్రలో తమకు ఏకొంచెం ఊతం, ఆసరాదొరికితే చాలని, దాన్ని తమకు చారిత్రక వారసత్వంగా స్వీకరించుదామనే ఆతురతలో వెదకలాడి వీరేశలింగాన్ని ఒక మహాపురుషునిగా తీసు కొన్నప్పుడు వారి స్వీయ చరిత్రను ప్రత్యక్షర సత్యంగా నిండానమ్మి, ఆయన తన సహచరులకు చేసిపోయిన అన్యాయాన్ని కానలేకపోయారు. తనకు తాజెప్పుకొన్న ప్రాధమ్యతలనన్నింటినీ నిజాలనుకొన్నారు. దానితో వీరేశలింగంగారికి ముందు సంస్కరణయత్నమంటూ ఉందన్న మాటే వారెరుగరు సరిగదా ఆంధ్రదేశ పరిస్థితులలో వీరేశలింగంగారినొక చారిత్రక అద్భుతంగా, వారిది అచ్చమైన వ్యక్తి విజయంగా చూచారు, చూపించారు. వారి జీవితాన్ని బుర్రకథ చేసి ప్రచారించారు. అదెప్పుడో 1940ల్లో వారి బాల్యదశలో చేశారంటే సరే; కాని 1971 లోనూ 1983 లోనూ కూడా వారి వైఖరి అలాగే వుంది. "ఆయనకు మార్గదర్శకులులేరు. ఆయనతో

పోల్చదగిన అనుయాయులులేరు" అని కుందూరి ఈశ్వరదత్తుగారన్న మాటల్ని పట్టుకొని అవిచారితరమణీయంగా పీఠికాపేటికల్లో పదిలపరచి స్వీయ చరిత్రను ప్రచురించారు!? గత నలభైయేళ్ళ పరిశోధనలో పంతులుగారికి ముందొక అర్ధ శతాబ్దంగా, రెండు తరాలుగా స్వబుద్ధి స్వానుభవాలనుంచి సంస్కార భావాలను వెల్లడించిన ఆంధ్ర మహాశయులెందరో, వారి అల్పానల్పమైన కృషియెంతో వెలుగు జూచింది. కాని మార్క్సీయ చారిత్రకులు, వారి సాహిత్య సంఘాలు వీరేశలింగ పూర్వ సంస్కర్తలను, వారి కృషిని భావోదయాన్ని ప్రచారణను గుర్తించకుండా పాత పాఠాలనే యథాతథంగా వల్లిస్తున్నారు. ప్రభుత్వం దాని సంస్థలు వీరినే అనుసరి స్తున్నాయి.

కమ్యూనిస్టేతర మేధావుల ఆంగ్ల రచనలు వారిననుసరించినవే అయినై. కమ్యూనిస్టులుగాక మరియితరులెవ్వరూ ఆరాధ్య ఆంధ్ర మహాపురుషులంటూ జాతి ముందు నిలబెట్టడానికి చేసిన కృషిలేదు. ఆ నిర్ణయాలను, ఆ ప్రాధాన్యాలను వారు ఇప్పుడు పునస్సమీక్ష చేసుకోవలసి వున్నప్పటికీ ఆ పని తప్పోఒప్పో మార్క్సిస్టులే చేశారనక తప్పదు.

వీరేశలింగ విగ్రహారాధనకు వీరు పూనుకోగానే, పంతులుగారి పాత్రను అతిశయోక్తులతో నింపుతున్నారని, అందుమూలంగా ఎందరికో అన్యాయం అపచారం జరుగుతున్నదని శ్రీ దిగవల్లి శివరావుగారే వ్రేలెత్తి చూపించారు. ఐతే వీరేశలింగాన్నొక క్రామేడును చేస్తున్నారని శీర్షికపెట్టి వ్రాశారు. కాని నిజానికి అంతపని వారు చెయ్యలేదను కొంటాను. కాకపోతే, పంతులుగారిని ప్రచారంలోపెట్టి, మరచిపోయిన సంస్కరణ వాతావరణాన్ని మళ్ళీ కలిగించాలనుకొన్నారు. తద్వారా బలపడాలనుకొన్నారు. అది తప్పుకాదేమో. అప్పట్లో వారుమంచి ఆదర్శ కృషిచేశారు. కానిక్రామేడ్ వీరేశలింగాన్ని చేస్తున్నారనగానే, అది రాజకీయ వ్యతిరేకతతో చేసిన విమర్శగా చూచారేగాని, శివరావు గారు చూపించిన తిరుగులేని చారిత్రక సత్యాలను స్వీకరించాల్సి వుంటుందనుకోలేదు. అదే వారి పొరపాటు.

పంతులుగారిని క్రామేడ్‌ను చేయడం, చేయకపోవడమనే రాజకీయ స్పృహ లేకుండా, వారి కృషిని ఆనాటి చారిత్రక సందర్భంలోపెట్టి చూపించుతూ, స్వీయ చరిత్రలోని ఆత్మోత్కర్షను, పరాపకర్షను చర్చిస్తూ ప్రామాణికమైన పరిశోధనను ఒక యువ అమెరికన్ వెలువరించాడంటున్నారు. వెలువరచి దశాబ్దం జరిగింది. మన విశ్వ విద్యాలయాలు సిగ్గుపడవలసినంత పని చేశాడంటున్నారు మన సంకీర్తనకు భిన్నమైన మదింపు అతడు చేశాడన్నారు. అట్టిదొక బలమైన భిన్నాభిప్రాయం వెలువడగానే, దాన్ని చర్చించడం మన కనీస ధర్మంకావాలి. కాని అటువంటి గొప్ప పరిశోధన మాట ప్రసక్తికి రానీకుండా, దానివునికినైనా గుర్తించకుండా దానితో అంగీకారమో, అనంగీ

కారమో సవరణో తెలిపేపని పెట్టుకోకుండా, స్వీయచరిత్రకు అనేక అధోజ్ఞాపికలను, వివరణలను చేర్పించడానికే పరిశోధకులను నియమిస్తూ, పాతమదింపుతో పాత పీఠికల్ని, పాత బాణీలో కొత్త పీఠికల్ని వ్రాయించి దానిని ముద్రిస్తున్నారు. అధునాతన పరిశోధనను గమనికలోకి తీసుకొని నసుపుకోలేని సాంస్కృతిక కృషి, పరిశోధక వివరణలు వాక్యవిస్తారము చరిత్రకు పరిశోధనకు అపచారం, మేధావిత్వానికి వంచన. అలముకొన్న వార్ధక్యానికి సంకేతం.

పంతులుగారినిగూర్చి శివరావుగారి మదింపుకు, అవగాహనకు లీనార్డు పరిశోధన ధ్రువీకరణమని, చాల కొత్త కోణాలు, చాలచాల కొత్త సంగతులు బహిర్గతాలైనవని, మరికొన్ని విశేషాలతనికీ తెలియలేదని, లీనార్డుకిపతలి పరిశోధనగా చెప్పవలసిందెంతో వుందని, ఇంత వార్ధక్యంలో (86) దానికినాంది తామే పలకవలసి వచ్చిందని పలుకుతున్నారు.

నేటికి మనకుగావలసిన సంస్కరణదృష్టి వీరేశలింగంతోగాక వేమనతో ఆరంభమైనదని, వీరేశలింగాదులు వేమన చెప్పిన సంస్కరణ సాకల్యంలో ఏ ఒక శకలాన్నో వహించి కృషిచేశారని, అదీ అన్య సంస్కృతీ సంపర్కంవల్ల, పరప్రభుత్వ, మత సంస్థల సంరక్షణ సహకారాలక్రింద జరిగిందని మా వేమన వికాసకేంద్ర ప్రచురణల ద్వారా నివేదించిపున్నాను. సుప్రసిద్ధ పరిశోధకులు, స్వతంత్ర విచారకుశలురు, స్వప్రచార విముఖులు, గుణప్రబుద్ధులు అయిన శ్రీ దిగవల్లివారు నా అభిప్రాయాన్ని ఆశీర్వదించిన పెద్దలు కాగా వారి మాదిరిగానే నాతో ఏకీభావం తెలిపిన మార్క్సిస్టు శిష్ట పరిశోధకులు యం. పట్టాభిరామిరెడ్డిగారు వీరేశలింగం, అనంతరులను వేమనతో పోల్చితే Compradore Renaissance Figures అవుతారని వారిని దిగువాయి చేసే ఒకపద ప్రయోగంచేస్తూ నాకొకలేఖవ్రాశారు. ఆ పదాన్ని మెచ్చుకొని వీరేశలింగం మీద తమకున్నఅభిప్రాయానికి తగినపదం దొరికిందన్నారు శివరావుగారు. వీరేశలింగం కృషిని ఈపేర పునస్సమీక్ష చేయప్రతిపాదించారు. తటపటాయించాను. మన సంస్కరణ వికాసానికు వేమనే మూలపురుషుడని నేను ప్రతిపాదించినప్పుడు వీరేశలింగం, గురజాడల కృషిని, వ్యక్తిత్వాలను పునఃపరిశీలించాల్సి వుంటుందని అనుకోలేదు. వారికన్న ముందుస్థానంలో వేమనను నిలిపితే సరిపోతుందనుకొన్నాను. అలాగే స్పష్టపరచాను. అందుకే వేమన వికాస కేంద్రం తరఫున కేలెండరు వేయిస్తే వేమనతర్వాత లోపలిపుటలమీద వీరేశలింగం, గురజాడ, రఘుపతి, త్రిపురనేని, కట్టమంచివార్ల బొమ్మలువేస్తే ఎలాగుంటుంది అని పట్టాభిరామిరెడ్డిగారిని అడిగాను. కాంప్రెడోర్ రినేజాన్సు పురుషులైన వీరందరినీ ఆకాశమంతుండే వేమనకాళ్ళ దగ్గర కుబ్జగ్రహాలుగా వేయమని వ్రాశారు. తీవ్రవాదమనిపించి మిన్నకున్నాను.

వీరేశలింగం, గురజాడల మహాపురుషత్వానికి, విగ్రహారాధనకు అభ్యంతరం చెప్పిన మొదటి మార్క్సిస్టు ఉండనేవున్నారు. వారు కొల్లా వెంకయ్యగారు. వారు "వలస పరిధికిలోబడిన సంస్కరణ కర్తలని. వారిది వలసపరిధికిలోనైన సంస్కృతి" యని "గురజాడను మహాకవిగా చిత్రించి వేమన సరసన నిలపడం" తప్పని - వారి సంకీర్తనం "వాస్తవాలతో నిమిత్తంలేని ప్రచారమని" కొల్లావారు "దేశీయ భాషలు, జాతుల సమస్య - ప్రజాస్వామిక పరిష్కారం" అనే రచనలో వ్రాసి పునస్సమీక్షావసరాన్ని ప్రతిపాదించారు దానిపై విరసులు విరుచుకుపడ్డారు. ప్రజాస్వామిక పరిష్కారంఅంటూ వీరేశలింగం, గురజాడల డిఫెన్సుగాకుండా వేమననుదిగలాగుతూకూడా వొట్టి ఉష్క ప్రకటనా పర్వంనిర్వహించారు. వీరేశలింగం - గురజాడలపట్ల చూపిన Tolerances ను వేమనపట్ల చూపకుండా, వీరేశలింగాదులుకున్న చారిత్రక పరిమితుల వంటివానిని వేమనపట్లగానకుండా, వేమననసలు చదవకుండా విరసులు ద్వంద్వ ప్రమాణాలను అవలంబించారని నేను విమర్శించానుగాని వీరేశలింగం, గురజాడలవి వలస సంస్కృతి-వలస పరిధిగత సంస్కరణ అనేమాటను స్వీకరించలేదు.

రామస్వామి చౌదరి అన్నదమ్ములు జ్ఞాతుల కుటుంబాలైన మాయిళ్ళల్లో వీరేశలింగం మెలిక మనిషి అయినట్లుగా రామస్వామి కవిరాజు చెప్పేవారని నా చిన్నతనంలో వినేవాణ్ణి. కవిరాజు తొలుత వీరేశలింగాన్ని తలదాల్చిన వారని, 1908 బందరు సమ్మానంలో పంతులుగారికి స్వాగత పద్యపత్రం యువకవి రామస్వామిగారిదేనని చెప్పేవారు. చిలకమర్తిని మావూరు తోడ్కొని వెళ్ళారనేవారు. వర్ణధర్మాలన్న ఉక్కు చట్టాన్ని పగులగొట్టి మాల కన్నమదాసు మహా సేనానిగా కలిగిన పల్నాటి సంస్కారక వీరగాథను "కారెంపూడి కదనం"గా వర్ణవ్యవస్థపై (1908) తొలి తిరుగుబాటు నాటకాన్ని తన తొలి రచనగా వ్రాసి, ప్రదర్శింప జేయిస్తూ వీరేశలింగంకన్నా సంస్కరణలో కవిరాజే మనవే ముందున్నామనేవారు మాతాతలు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలతో రగిలి మండిన దేశభక్తితో రాణా ప్రతాప్ నాటకాన్ని బందరు టి. టి. రాఘవచారి (శ్రీనివాస చక్రవర్తిగారి మేనమామ) కంపెనీకి ప్రదర్శనానుకూలంగా వ్రాసి, రంగస్థల విజయం సాధించినట్టి ఆంధ్రుల తొలిజాతీయతా ప్రబోధకనాటకానికి కర్తలై తర్వాత దాన్ని తెల్ల దొరతనం నిషేధించింది కూడా. వీరేశలింగంగారి బ్రిటిష్ రాజభక్తిని ఏవగించుకొనే స్థితికిమారి, వారి స్వీయచరిత్ర ఆత్మస్తుతి పరాయణమైనదనేవారనీ, బ్రహ్మసమాజాన్నికాదని వివేకానందుని మెచ్చేవారని చెప్పుకొనేవారు. కాని నేను కమ్యూనిస్టునైన తర్వాత వీరేశలింగ సంకీర్తనం వింటూ, ఇదేమిటా అనుకొన్నా దానిని ప్రశ్నించ గలంత సమాచారంగాని, వీరేశలింగ కృతుల అధ్యయనంగాని లేకపోయింది. పార్టీ నిర్ణయం గదా పాటించాను - ప్రశ్నించలేదు. కాంగెసు వెనకబెట్టిన సంఘ సంస్కరణను వీరేశలింగం పేర, సాధించ దలచినట్టుగా వుండేది. అంతే. వేమన ప్రాధాన్యం కొరకైనా పంతులుగారి సంస్కరణల అనుపానులను, పూర్వాపరా

లను, పరిమితులను తడమవలసివుంటుందనుకోలేదు. అది నిజమే. వేమనకోసం ఇదేమీ అవసరంకాదు, కాలేదు.

అలాంటి నన్ను కాం(పెడోరు రినేజాన్స్ మాటతో వీరేశలింగ జీవితకృషి పున ర్మూల్య నిర్ణయం చేయాలి - అందుకు నన్ను పూనుకోమంటూ కొన్ని సంగతులు చెప్పారు. అంతా విన్నాను. విని అదేదో వారు చేస్తేనే ఔచిత్యముంటుంది; నాకన్న వారు చేస్తేనే దానికొక బరువు, సౌముఖ్యము ఏర్పడుతుంది - పైగా నేనే(వాయలంటే వీరేశలింగాన్ని మొత్తం మొదలెత్తుకొని చదివి జీర్ణించుకొన్నతర్వాత కలంమోపాలి; అది కొంతకాలం పట్టేపని. ఎంతోనోట్సు ఏర్పరచుకొన్న పెద్దలు (వాయడమే సులువు. (వాయండి, ము(దణాబాధ్యత వహిస్తానని విన్నవించుకొన్నాను. ఈలోగా నన్ను స్వీయ చరి(త చదవమన్నారు. కాని చదవటం (పారంభిస్తే అన్నీ (పశ్నలే - అనుమానాలే. ఆ కథనాన్ని మార్క్సిస్టు పెద్దలు అభ్యుదయికులు ఎలా శంకించకుండా నమ్మారో అర్థంకాలేదు. ఈస్వీయచరి(త కథనంపట్ల అపనమ్మకం కలగకపోతేమట్టుకు మన అవ గాహనా శక్తిని, ఆం(ధదేశ సంస్కరణ చరి(తలో మన పరిజ్ఞానాన్ని (పశ్నించుకోక తప్పదు. (శీ శివరావు గారికే పుంఖానుపుంఖంగా నా (పశ్నలు సంశయాలు పోస్టు చేశాను. చాలా(పశ్నల దృష్ట్యా తమ (వాత(పతిని విస్తరించారు-సవరించారు- చర్చలు పెంచారు. ఇంత కన్నా మరివద్దు-ఇది స్వీయచరి(త విమర్శమా(తమేకాదు సుమీ అని నా (పశ్నలను నిలువరించారు. వారి రచన-ఈ ము(దణా సమాంతరంగా సాగాయి.

వీరేశలింగంగారిని గూర్చి (వాయగిల అధికారం అర్హత ఇప్పుడు ఆం(ధ దేశంలో (శీ శివరావుగారికి ఉన్నంతగా మరొకరికిలేదు. వీరేశలింగమంటే వీరారాధన చేసినబంగోరెవంటి పరిశోధకుణ్ణి తన (తోవకుతెచ్చి, తన మదింపు నంగీకరింపజేసి, తన రచన పూర్తిచేసి, బంగోరేయే అచ్చువేసేట్టు అచ్చుకొనజేసినవారు. ఆ (వాత (పతి అచ్చుకని బంగోరే పట్టుకెళ్ళారట. అది బంగోరెతోనే వెళ్ళిపోయినట్లుంది. మళ్ళీ చేసిన రచన ఇది.

తమిళ మహాకవి సు(బహ్మణ్య భారతి అసంపూర్ణ నవల-చం(దిక కథలో మన వీరేశలింగం ఒకపా(త గావడంచూచి, పొంగిపోయి, దాన్ని తెనిగిం(పిం)చి, అచ్చు వేసి, ఆయన తమిళభారతి కొలుపులెలా అందుకొన్నాడో చూడండి, అంతవాణ్ణి మన మెంతగా కొలవాలో చూడండన్న బంగోరెను - అదికాదు నాయనా, భారతియార్ వీరేశలింగం సంస్కరణ పరిమితుల్ని పట్టి చూపించి సున్నితమైన వ్యంగ్యం చేశాడని తెలియాలి సుమీ అన్నారు. వితంతు వివాహాలంటే యిష్టమున్నవాడుకాడని, అనులోమ వివాహాలకే గిలగిలకొట్టుకొనేవాడని ఇష్టంలేకపోయినా సంస్కర్తగా పేరుకోసంమా(తం పెళ్ళితంతు జరిపించమంటే జరిపించ సిద్ధపడగలవాడనిచూపడం అందులో వ్యంగ్యం కదా, (గహించమన్నారు. [కాకినాడ కోమటి వితంతువైన కనకరత్నం తూర్పువాడైన శూ(దుడితోలేచిరాగా, ఆ ఫిలోమవివాహానికి పంతులుగారు సిద్ధపడక, ఆ శూ(ద(పియుని

త్తెల్లో వేయిస్తానని భయపెట్టి దూరంచేసి ఒక కోమటి యువకుణ్ణి సంపాదించి (1908 లో) పెళ్ళిచేసినట్టు స్వీయచరిత్రలోనే (II భా. 243, 244) చెప్పినగాథ వారి సంస్కరణల పరిమితిని తెలిపేదవుతున్నది. అంతేగాకుండా బ్రాహ్మణ యువతులైన కవయిత్రి సరోజినిదేవి, రాధాబాయిగారలు బలిజలైన గోవిందరాజులు నాయుణ్ణి, గౌండ్లవారైన సుబ్బరాయన్ను పెండ్లి చేసుకోగా పంతులుగారే పౌరోహిత్యం వహించి కూడా వాటిని అదోరకంగా వ్రాయడమో, అసలే వ్రాయకపోవడమో చేశారు. ఆ కథలు బంగోరె చర్చించేవున్నారు]. Veeraselingam was a Brahminical reformer అని భారతి భావమని చెప్పి లీనార్డు అది కొంత నిజమేయని అభిప్రాయపడితే, కొంత కాదు పూర్తిగా నిజమని బ్రాహ్మణేతర మిత్రుల యింటివంటే ముట్టని సంగతులన్నీ చెప్పి బంగోరెను ఒప్పించిచేసినరచన. కన్యాశుల్కం వీరేశలింగం సంఘ సంస్కరణ దావుటాకు సమర్పించిన సమగ్ర సుందర కళారూపమైన జోహారంటే - అది చాల పొరపాటు. అది వీరేశలింగం ఉద్యమంమీద, ఆ వుద్యమంలో వెలువడిన వ్యక్తులమీద చేసిన గొప్ప వ్యంగ్యరచన సుమీఅని గురజాడ డైరీలనుంచి అదనపు భోగట్టాచూపించి బంగోరె బుర్రగిర్రున తిప్పినతర్వాత చేసిన రచన ఇది. వీరేశలింగాన్ని భారతీ గురజాడల విమర్శకు గురైన వ్యక్తిగా తేల్చారు మరి. [గురజాడ రచనలన్నీ వీరేశలింగం, వెంకటరత్నంనాయుళ్ళ ఉద్యమ విమర్శేయని నిరూపించిన కమ్యూనిస్టుమిత్రులేవున్నారు]. అందుకే ఈరచనను బంగోరెస్మృతికి అంకితంచేయడం మరింత సముచితం.

అందుచేత వీరేశలింగంగూర్చి ఇప్పుడీ పుస్తకం దేనికి, స్థిరపడిన అభిప్రాయాలను కదిపి కుదిపేయడం ఎందుకు, జాతి పూజించటానికని చెక్కి ప్రతిష్ఠచేసిన విగ్రహం కొలతలు ముక్కు మొగం పోలికలు మార్చడందేనికి, విరమించవగూడదాయని నన్నూ, డిగివల్లి వారి స్నేహితులనూ కొందరు మిత్రులు అడిగివున్నారు. ఇందులో చెప్పినవి చూపినవి యథార్థాలవునా కాదా అన్నదే ప్రశ్నకాని ఎప్పుడో ఏమీ అంతగా తెలీనిస్థితిలో ఒక నిర్ణయమేదోచేసుకొని, అందుకు భిన్నంగా ఎన్నోవాస్తవాలు బైటపడినప్పుడు దాన్ని సవరించుకోకుండా పసినాటి నిర్ణయంలోనే నిలిచిపోదామనుకోవడమేమిటి? అయినా ఇందులో ఎవరో ఒకరుచెప్పని, అచ్చువేయని సంగతులేమున్నాయి? అప్పుడప్పుడుఅక్కడక్కడఎందరెందరోఅచ్చులోపెట్టిన అనేకసంగతుల్ని ఒక్కచోటికి తెచ్చి ఒకరూపమివ్వటమే ఇందులో ఎక్కువగా జరిగింది. కాదనే సంగతులిందులోవున్నవంటేఆమాటచెప్పాలిగాని, ఉన్నయథార్థాలనుదాచి, కల్పనమీద ఊహమీద అపసరమని చెప్పి మహాపురుషులను ఉత్పత్తి చేసుకొందామా? దానికి సమాధానమే నెపోలియన్ జీవితరచనలో అవలంబించిన ప్రమాణమెంత కఠినమైనదో ఈ గ్రంథాదినే శివరావుగారు ఉల్లేఖించారు. తమజాతికి అంత వీరాధివీరుడైన నెపోలియన్ను గూర్చే అంత సుకఠిన సూత్రంతో జీవితచరిత్ర కూర్చారు, కాగా, ఇదెంతపాటి విషయం?

దీనిపేరు వీరేశలింగం - వెలుగునీడలేగాని, ఇందులో నీడతప్ప వెలుగేమి చూపించారనే ప్రశ్నపుట్టొచ్చు; సమీక్షలు సాగవచ్చు. అదేమంత గొప్ప ప్రశ్నకాదు గాని శీర్షికనుబట్టి చమత్కారమంతమైన ప్రశ్న అవుతుంది. పంతులుగారు ప్రసరించిన, ప్రసరించని వెలుగులను ఎందరో ఎన్నోవిధాల విస్తరించారు. నిజానికి ఆ అతిశయోక్తులను నిగ్రహించడమే ఇక్కడ జరిగినపని. అయినా పంతులుగారు చేసినదేమిటో తమ పూర్వరచన (1944) నుంచి పుస్తకాదినే ఉటంకించి వివరించారు :

"వీరేశలింగంగారి గొప్పతనము అంతకు పూర్వమెవరున్నూ చేయనిపని చేశారనిగాని, అంతకు పూర్వమెవ్వరూ రచించని కృతి రచించారనీ కాదు - అనేకులు మెల్లగా చెప్పిన మాటలను ఆయన గట్టిగా చెప్పారు. అనేకులు కొంచెము కొంచెముగా సాధించిన కార్యములను ఆయన ఎక్కువగా సాధించినారు. అనేకులు మాటలతో సరి పెట్టిన విషయములను ఆయన కార్యరూపములో పెట్టినారు. అనేకులొక్కొక్క సమయములో ఒక్కొక్క విషయమున చూపిన తెలివితేటలను ఆయన ఒకే సమయములో అనేక విషయాలలో చూపించారు"

వీరేశలింగంగారిలో లేనిదేమంటేఒరిజినాలిటీ. ఉన్నదేమంటే ఒరిజనల్నునుమరపించే Craftsmanship. అదీ అప్పట్లోమాటే. భావాలన్నీ సంగ్రహించినవే- సేకరణే రచన మాత్రంతనది. కానిదికూడావుందట. ఇక్కడఆర్థర్ కోస్లరునువిందాం : The principal mark of genius is not perfection, but originality, the opening of new frontiers; once this is done the conquered territory becomes common property". ఈ సత్యం వీరేశలింగానికి తెలుసేమో,ప్రాధమ్యాలన్నీ తన వన్నాడుగాని పరిపూర్ణరూపాలు తనవనలేదు. వారికి ప్రాధమ్యంలేదని తేలిన విషయాల్లో ఆయన సాధించిన సమగ్రతను, సౌష్ఠవాన్ని పరిశోధకులు ఇతరులు చూపడం పేలవంగా కన్పిస్తున్నది. వీరేశలింగం గణ్యమానుడెందుకయ్యాడంటే, ఎవరినుంచి ఎలా ఎటువంటిసహాయసహకారాలనుపొందవున్నప్పటికీ,ఆచరణశీలికావడమే ఉద్యమించడమే. ఈ పీఠిక శీర్షిక దీనంతటినీ తెలుపడానికే హితసూచని నుండి హితకారిణికి అన్నాను.

ఒక గడ్డు సంగతినిగూర్చి రెండు మాటలు - అదే మంగమ్మ వ్యవహారం. మంగమ్మ వృత్తాంతాన్ని పంతులుగారు తమ స్వీయచరిత్ర కెక్కించి చర్చించలేక ముంగి నంగిఅయ్యారు; పులివంటి మనిషి పిల్లి అయిపోయారుఅని ఎంత విస్తరించి చూపించినప్పటికీ కడపటికి శ్రీశివరావుగారన్న మాట ఒకటుంది. అది గుర్తు చేయదలచాను. "ఒకవేళ మంగమ్మతో వేరేశలింగంగారికి సంబంధమున్నదనుకొన్నను, అది ఆయన ఆంధ్రదేశానికి, ఆంధ్రభాషకూచేసిన సేవకు భంగము కలిగిస్తుందా" అని ప్రశ్నించి "ఆయన జీవితచరిత్ర వ్రాసినవారు ఆయనవలెనే నిష్కారణముగా భయపడి ఆ ఘట్టమును వ్రాయుటకు జంకుతున్నారు." అనిచెప్పి ఆ ఘట్టాన్ని సుదీర్ఘంగా పొందుపరచారు. అది శివరావుగారి సాహసం, అంచచలమైన సత్యనిష్ఠ.

మంగమ్మ వీరేశలింగాలపై పుకారు పుట్టించినవారు ప్రకాశంపంతులుగారి తమ్ముడైన టంగుటూరి శ్రీరాములు, నాళం కృష్ణారావులుకాదు, పంతులుగారి శరణాలయంలో వున్న వితంతువులు, కొందరు యువకులు పుట్టించారు. టౌనంతా అగుబ్బుగా చెప్పుకో సాగి ప్రతిపక్షులైన ఛాందసులు చెలరేగేసరికి, అనుచరులకు అప్రతిష్ఠాకరమైన పరిస్థితియైంది. ఆ పుకారు నమ్మిన అనుచరులు శ్రీరాములు కృష్ణారావుగారలు. శంకాస్పద ప్రవర్తనకు సంస్కర్తలు తావివ్వరాదని, తావిచ్చినవారు సంస్కరణరంగంనుండి విరమించాలనితమపత్రికలలో వ్రాశారు. పంతులుగారుకోర్టుకెక్కగాఇకబెంగుళూరులోవారిద్దరూ మూడునెలలపాటుఒకేగదిలోనిద్రించారని, ఏకాంతములో పంతులుగారు ఆమె వీపు నిమిరే వారని రుజువుచేశారు. ఈ వ్యవహారంవల్ల పంతులుగారు ఆంధ్రదేశానికి, ఆంధ్రభాషకు చేసిన సేవేకాక, స్త్రీ జాత్యుద్ధరణ సేవకూడా తుడిచిపెట్టుక పోదనేమాట నిజమేగాని, స్త్రీ జాత్యుద్ధారకులైన సంస్కర్తల శీలం శంకాస్పదం కారాదనే మాటను, దాన్ని పురస్కరించుకొని వెడలిన అవిమర్శను గర్హించరాదనుకొంటాను. అంతేకాక, ఆనాడు నాయకుల శీల ప్రవర్తనా ప్రమాణాలను, జీవన సరళిని గూర్చి మనదేశంలోవున్న అవగాహనను కాస్త గుర్తుచేసుకోవటం మంచిది.

నార్టన్ వ్యవహారం మాట చెప్తాను. అది 1894 మద్రాసులో జాతీయ కాంగ్రెసు మహాసభ జరుగుతోంది. ఎడుడులే నార్టన్ అనే ఇంగ్లీషున్యాయవాది మన కాంగ్రెసులో ముఖ్యుడై వున్నాడు. 1830ల్లో కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళే, వీరస్వామయ్యల నాటి జార్జినార్టన్ (నాటి అడ్వకేట్ జనరల్) నుంచి మూడు తరాలుగా ఈ నార్టన్లు మన దేశీయులకు పాశ్చాత్య విజ్ఞాన వికాస భాగ్యం కలిగించడానికి, రాజకీయ హక్కులు యిప్పించడానికికృషిచేశారు. మూడోతరంలో ఈనార్టన్‌సాంసారికజీవితం శుద్ధమైనదికాదు. విడాకులు పొందని ఒకామెతో వివాహేతరమైన సంబంధంలో కాపురం పెట్టివున్నాడు. ఇంగ్లీషు వాళ్ళుకూడా ఆనడవడికి అలజడి చెందారు. కాని ఆయన నాటి కాంగ్రెసు మహాసభలో ముఖ్యపాత్ర వహిస్తున్నాడు. Social purity ఉద్యమకర్తగావున్న రఘుపతి వెంకటరత్నంనాయుడు లేచి ఆ అపరిశుద్ధ వర్తనుణ్ణి సభలో పాల్గొనివ్వరాదని తీర్మానం తెప్పించి, నెగ్గించి, వెళ్ళగొట్టించాడు. మర్నాడు మహాదేవ గోవిందరనడే No one whose private life was not pure should be accepted as a leader అనే తీర్మానాన్ని కాంగ్రెస్‌పార్టీచేత చేయించారు. రాజకీయనాయకుల జీవితం కూడా పిశుద్ధంగా వుండాలట ? ఇప్పుడది విచిత్రమనిపిస్తుందికదూ ! అప్పటి నైతిక స్ఫురణ మరి అలాంటిది.

కేశవచంద్రసేన్ విషయముంది. మైనారిటీతీరిన యువతీయువకులుస్వతంత్రించి, తల్లిదండ్రుల ప్రసక్తిలేకుండా, భిన్న మతస్థులైనప్పటికీ రిజిస్ట్రేషన్‌ద్వారా పెండ్లి చేసుకోవచ్చునే Civil Marriages Act - 1872 చేయించినవాడు-బాల్యవివాహాలు కూడదన్నవాడు. కాగా తన పద్నాలుగేళ్ళ కుమార్తెకు వివాహం చేసినంత మాత్రాన

బ్రహ్మ సమాజం ఆ నాయకుణ్ణి ప్రక్కన పెట్టేసింది. గత శతాబ్దంమాటెందుకు ? నిన్న మొన్న రామస్వామినాయకర్ సంగతేమయింది? వృద్ధుడై యువతిని పెండ్లాడినందుకు అన్నాదొరై ఆ గురువునుండి చీలిపోయాడు. సాంఘిక సంస్కర్తలనుంచి ఆచరణ శుద్ధిని, నైతిక ప్రతిష్ఠను అనుచరవర్గం, సంఘం చాలగట్టిగా కోరుతుంది. మంగమ్మ వ్యవహారంలో టంగుటూరి నాళం వార్ల వైఖరి సందర్భంలో ఈ విశేషాంశాన్ని గమనించాలనుకొంటాను.

ఇంతకూ ఇన్ని అప్రియమైన సంగతులను కుప్పగాపేర్చియిచ్చి, ఫలితార్థంగా చెప్పదలిచిందేమిటి అన్న ప్రశ్న మిగిలిందికదా! ఈ గ్రంథం ముఖపత్రచిత్రమే ఆ ప్రశ్నకు సమాధానమని గుర్తించే వుండాలిమరి. వీరేశలింగంగారొక్కరుగారు - పంచ పురుషాత్మకులు, పంచముఖేశ్వరులు. అందుకే ఐదు తలకాయల చిత్రం, ఆ వెనకవారికి చరిత్రనేపథ్యం-రాజమండ్రీయులకు ప్రత్యేకంగా పథనిర్దేశంచేసిన మహనీయుడున్నాడు. ఆయనే హితసూచని కర్త సామినేని ముద్దు నరసింహంనాయుడు. వీరేశలింగంగారికి కుడి ఎడమల మొదటితలలు పైడా రామకృష్ణయ్య, ఆత్మూరి లక్ష్మీనరసింహంగార్లవి. ఎడమచివరతల బసవరాజుగారిది. కుడిలో ఖాళీతల ఏలూరి లక్ష్మీ నరసింహంగారిది. వారి ఫోటో దొరకక ఖాళీగా చూపాము. ఎవరైనా పుణ్యం కట్టుకుంటే మలిముద్రణలోనో, ఈ మధ్యలోనైనాగాని చిత్రాన్ని సవరించి పరిపూర్ణంచేస్తాం. వీరేశలింగంగారిని ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మగా కాకుండ ముద్దునరసింహనారాయణుని నాభీకమలో త్థితుడైన పంచముఖ బ్రహ్మగా చెప్పిచూపడం సత్యం - శివం - సుందరమని మా పరమోద్దేశం.

## మా కేంద్రం తలపెట్టిన పని :

ఇప్పుడీ వీరేశలింగంగారి కృషి - జీవిత పునర్విచారణతోపాటుగా గురజాడ, రఘుపతి, త్రిపురనేని, కట్టమంచివారి విషయమైకూడా శ్రీ దిగవల్లివారి పునస్సమీక్ష స్థూలంగా సాగనేసాగింది. ఇదే జరగవలసిన చర్చకు మంచిఆరంభంగా గ్రహించుదాం. వేమన వీరేశలింగాల మధ్యకాలంలోవెలుగుచూడనిసంస్కరణకృషినిజాతికిఅందించుదాం. వీరేశలింగానంతరులైన పైవారియొక్క ఇతరులయొక్క కృషిని జీవితాన్ని ప్రత్యేక ప్రత్యేకంగా పునర్విమర్శ చేయించి పునర్మూల్య నిర్ణయం జరిగించడమే తరువాయి కార్యక్రమం. హిత సూచని ముద్రణ - గురజాడ పునర్వీక్షణ, మా తక్షణ కర్తవ్యాలు. హితసూచని అచ్చుకిస్తున్నాం.

30-11-1984 — త్రిపురనేని వెంకటేశ్వరరావు

(విజయవాడ)

Tripuraneni Venkateswara Rao
VIJAYAWADA.

వివాహం చేస్తే బాగుంటుందని రాజ్యలక్ష్మమ్మగారంటారు. అతడు మాంసం తింటాడు, తాగుబోతు; తాగుబోతులో ఎన్నిమంచి గుణాలున్నా అవన్నీ త్వరలోనే నాశన మవుతాయి, వారి భోగభాగ్యాలు, సిరి సంపదలు క్షీణించిపోతాయి అని పంతులుగారంటారు. ఆయన దుర్వ్యసనాలను నేను మాన్పించ గలననే ధైర్యము వున్నదని విశాలాక్షి అంటుంది. ఇంతలో గోపాలయ్యంగారే బండి దిగుతారు. ఆయనకు పంతులుగారింటనే బస, భోజనము ఏర్పాటు చేస్తారు. విశాలాక్షి రాజ్యలక్ష్మమ్మగారికి వంటలో సహాయం చేయడానికి లోపలికి వెడుతుంది. మీనాక్షి అనే పనిమనిషి విశాలాక్షి మేనకోడలైన చంద్రికను దొడ్లో ఆడిస్తూ వుంటుంది. చంద్రిక ముచ్చటగా మాట్లాడుతుంది, పాడుతుంది. విశాలాక్షి భారతిగారి 'నందబాల' అనే అపూర్వ గేయం ఆలపిస్తుంది. గోపాలయ్యంగారికి వీరేశలింగముగారు విశాలాక్షి కథ చెప్పి వివాహం చేసుకోమని అంటారు. గోపాలయ్యరు పనిమనిషి మీద కన్నువేస్తాడు మొదట. ఆమెయే విశాలాక్షి అనుకుంటాడు. భోజనాల దగ్గర విశాలాక్షిని చూపించి ఆమె గుణగణాలను వర్ణించి ఆమె చేసిన రుచిగల వంటను మెచ్చుకుంటూ పంతులుగా రామెను వివాహం చేసికోమని అయ్యంగారిని కోరినా, అతడు విశాలాక్షిని ఎగాదిగా చూసి ఆమె అందమయినదే అయినా గుణవతియే యైనా ప్రొద్దున్న తాను చూసిన పని మనిషి మీదనే తనకు ప్రేమ కుదిరి యున్నదని, ఆమెనే పెండ్లి చేసికొంటానని అంటారు: అంతట సంభాషణ ఇలా సాగుతుంది.

పంతులుగారు : ప్రేమా! పిండాకూడ? పనిమనిషి యెక్కడ, పెళ్ళి యెక్కడ? జరిగేపనేనా యిది? మీరు పనిమనిషి నెట్లా పెండ్లాడుతారు? ప్రజలేమనుకుంటారు? మీకు చిత్తచాంచల్యము కలిగినదనుకోరు? మీగౌరవం తగ్గిపోదూ?

గోపాలయ్యంగారు : ఇతరులనుకునేదే అనుకుంటారు. నా వుద్యోగం పోదుకదా? ఒకజాతివారిం కొకజాతివారిని వివాహం చేసుకోకూడదని నిషేధం లేదుకదా?

పంతులుగారు : ఆసంగతి నాకు తెలుసుగాని మామిత్రులు, తోడి యుద్యోగులూ మిమ్మల్ని నీచంగా చూస్తారు. మీరు పనిమనిషిని వివాహమాడడం నాకిష్టంలేదు. జనుల అపవాదులు లెక్కచేయకుండా మన మనస్సాక్షికి తోచినట్లు నడవడము ధర్మమని నేనూ అంగీకరిస్తానుగాని ఈమె వివాహము యుక్తముకాదనడానికి

ఇంకా చాలా కారణాలున్నాయి. ఆ పనిమనిషికి కించిత్తుకూడా విద్యాగంధంలేదు. విద్యలేకపోవడమేగాక ఉత్తమకులజులైన కన్యకలకుండే సంప్రదాయము, నాగరికత, ఆచార వ్యవహారాలూ వీళ్ళకుండవు. వీటన్నింటినీ ఆలోచిస్తే ఆఅమ్మాయిని మీరుచేపట్టడం తగనిపనే అని తోస్తుంది.

అయ్యంగారు : నాతో ఒకసంవత్సరము కాపురము చేసేటప్పటికి అన్నీ చక్కబడతాయి. ప్రేమఅనేది ముఖ్యం.

పంతులుగారు : ఈమాటలు ప్రపంచజ్ఞానంలేని పదునాలుగేళ్ళ కుఱ్ఱవాడు చెప్పే మాటలు. ప్రేమఅనేది మూణ్ణాళ్ళముచ్చట. కొత్తదనంపోగానే ప్రేమ మాయమవుతుంది. ఉన్నతమైన విద్యాబుద్ధులచేత సచ్ఛీలంచేత దంపతులమధ్య ఏర్పడే అన్యోన్యానురాగమే చిరస్థాయిగా వుంటుంది.

అయ్యంగారికీ మాటలు తలకెక్కలేదు. అయ్యంగారికి పనిమనిషిమీద కలిగిన వ్యామోహాన్ని పోగొట్టడానికి పంతులుగారు సకల విధాలా ప్రయత్నించారు, గాని లాభంలేకపోయింది. అంతట పంతులుగారు అయ్యంగారి కోరిక చెల్లించడానికి అంగీకరిస్తారు.

అయ్యంగారు ఈ పనిమనిషి ఎక్కడిదని పంతులుగారిని అడగగా, వేంకటాచలం నాయుడుగారనే బ్రహ్మసమాజ మిత్రుడు పంపించాడని, ఆయనను కనుక్కుంటే ఈమెసంగతి పూర్తిగా తెలుస్తుందనీ అన్నారు. అంతట అయ్యంగారి ప్రార్థనపైన వీరేశలింగముగారు నాయుడుగారింటికి తీసుకొని వెళ్ళారు. ఈ పనిమనిషి యాదవకులానికి చెందినదని, పక్కవీధిలోనున్న సుబ్బసామికోనార్ కూతురని నాయుడుగారు చెప్పారు. అయ్యంగారి కోరిక నాయుడుగారికి చెప్పగా వీరందరూ కలిసి కోనార్‌తో మాట్లాడడానికి అతని ఇంటికి వెడతారు. తనపిల్లను బ్రాహ్మణునకిచ్చి పెండ్లిచేస్తే ఏమిపాపం వస్తుందోనని కోనారు సందేహిస్తాడు. అయితే, అయ్యంగారు డబ్బుకలవాడని, వీరు కావలసినంత సొమ్మిస్తారని చెప్పేసరికి అతడు మెత్తబడతాడు. అయ్యంగారతనికి మూడువేల రూపాయల నిస్తానంటాడు. కోనారు ఒప్పుకుంటాడు. మీనాక్షికూడా పెళ్ళికి అంగీకరిస్తుంది. ఆవారంలోనే వారిద్దరూ బ్రహ్మసమాజంలో చేరతారు. చెన్నపట్టణంలోని బ్రహ్మసమాజ మందిరంలో వీరికి వివాహం జరుగుతుంది. పంతులుగారు ఈ వివాహసందర్భంలో వారంరోజులు తీరుబడిలేకుండా వున్నందువల్ల విశాలాక్షి పెళ్ళిసంగతి ఆలోచించడానికి అవకాశంలేదు.

ఈ కథా సంవిధానంలో కొన్ని అసందర్భము లున్నవి. త్రాగుబోతైన గోపాలయ్యంగారూ వీరేశలింగంగారూ స్నేహం చేశారనే సంగతి వారి నెరిగున్న వారెవ్వరూ నమ్మరు. వారి స్నేహంసంగతి వారూఅయ్యంగారూచేసిన సంభాషణలో చాలావిచిత్రంగా నడిచింది. పంతులుగారు నాయుడుగారింటికి కోనారు ఇంటికి వెళ్ళి మాట్లాడడముకూడా చాలా ఆశ్చర్యకరమైన సంగతి. కోనారుతో మాట్లాడి పెళ్ళిబేరము కుదర్చడము డబ్బు ఇప్పించడము పంతులుగారు స్వీయచరిత్రలో, ప్రహసనములలో, ఉపన్యాసాలలో వ్రాసిన సిద్ధాంతాలకు, బోధించిన నీతిధర్మాలకు విరుద్ధమైన సంగతి.

భారతిగారు ఇలాంటి వ్యంగ్య చిత్రణము నెందుకు చేశారు? దీనికేమైనా పూర్వరంగమున్నదా? అని విమర్శకులు పరిశోధన చేయవలసివున్నది. 1973 సంవత్సరములో 'చంద్రికకథ'ను ప్రకటించిన శ్రీ బంగోరెగారు, దానిలో ఉపోద్ఘాతములు వ్రాసిన శ్రీ కె. వి. రమణారెడ్డిగారు, శ్రీచల్లా రాధాకృష్ణశర్మగారు ఈ విషయమును పరిశీలించినట్లులేదనుకొన్నాను. కాని వారసలు దానిని పంతులుగారిపై వ్యంగ్యరచనగా గ్రహించనేలేదు.

బంగోరెగారు నాకీ పుస్తకము పంపించి దీనిని గూర్చి నా అభిప్రాయ మిమ్మని కోరారు. అందులో నాకు తెలిసిన సంగతులను బట్టి ఈ కథను భారతిగారు రాయడంలో వీరేశలింగంగారిని గూర్చి వారికి అంతమంచి అభిప్రాయంలేదని దానికి కొన్ని కారణాలు చెప్పాను. ఈ కథలోని వివాహం కక్కుర్తి వివాహం కదా! అలాగే ఇందులోని ఉపాఖ్యానం కూడా ఒక కక్కుర్తి వివాహమే. వీటిని పంతులుగారు జరిపించడము కక్కుర్తి పనికదా!

## విశాలాక్షి

వీరేశలింగము పంతులుగారు అయ్యంగారికీ పనిమనిషికీ వివాహం జరిపించే సందర్భంలో వారంరోజులపాటు ఊపిరి తిరగకుండా వుంటారు. అటు తరువాత నీ వివాహం సంగతి ఆలోచిస్తామని రాజ్యలక్ష్మమ్మగారు చెప్పగా విశాలక్షి చెన్నపట్నంలో వారి బంధువు లింటికి వెళ్ళింది. ఇంటి యజమాని ఆమెను చెరచడానికి ప్రయత్నించి విఫలుడవుతాడు. ఆమె ఇంకొక బంధువు ఇంటికి వెడుతుంది. ఆ ఇంటి యజమాని మిఠాయి వ్యాపారి. ఆయనకు వేదాంతం అంటే ఇష్టం. అక్కడికి ఒక బాల సన్యాసి వస్తాడు. అతడు మంచి రూపసి. చాలా తెలివైనవాడు. అతడు జీవన్ముక్తి అనే విషయాన్ని గూర్చి ఉపన్యసిస్తాడు. విశాలాక్షి వింటుంది. అతడి కామెను వివాహమాడవలెనని కోరిక కలుగుతుంది. ఆమె కూడా అంగీక

రిస్తుంది. అతడు తన కాషాయాంబరాలను తీసివేసి చలువబట్టలు ధరిస్తాడు. విశ్వనాథ శర్మ అనే పూర్వాశ్రమం పేరు వహిస్తాడు. వారుభయులూ చంద్రిక సహితంగా వీరేశలింగము పంతులుగారి ఇంటికి వెళ్ళి జరిగిన సంగతి అంతా చెప్పి తమకు వివాహం చేయమని కోరతారు. ఆ దీనజనోద్ధారకులైన దంపతులకు అపరమితానంద మైనది. అంతా దైవ సంకల్పం, మన మొకటి తలుస్తే దేవుడు మన మంచికే వేరొకటి తలుస్తాడు అని నిండు మనస్సుతో పంతులుగారు భగవంతుణ్ణి స్మరిస్తారు. తరువాత పంతులుగారే విశ్వనాథశర్మను విశాలాక్షిని బ్రహ్మ సమాజంలో చేర్పిస్తారు. గోపాలయ్యంగారి వివాహమైన రెండు వారాలకే మద్రాసు బ్రహ్మసమాజాలయంలోనే సమాజ విధుల ప్రకారం విశాలాక్షి విశ్వనాథశర్మల వివాహం వైభవంగా జరుగుతుంది. వారు చంద్రికతో కలిసి కొంత కాలం సుఖంగా జీవిస్తారు తరువాత శర్మకు మతిభ్రమ కలుగుతుంది. భారతిగారు ఈ జబ్బును గూర్చి, వైద్యుల చర్యలను గూర్చి చిత్రంగా వర్ణిస్తారు. ఇంతలో భారతిగారా కథను అసంపూర్ణంగా వదలిపోతారు.

భారతిగారు వీరేశలింగముగారి వితంతు వివాహ ఉద్యమం, సంఘ సంస్కార ఉద్యమాన్ని గురించి మెచ్చుకునే వుద్దేశంతో ఈ ఘట్టాలను చిత్రించారా లేక హేళన చేయడానికి చిత్రించారా అనేది గొప్ప సమస్య. దీని వెనుక ఒక పూర్వరంగ మున్నది.

# వందేమాతరం : భారతి - వీరేశలింగం

భారతిగారి సిద్ధాంతాలకు వీరేశలింగముగారి సిద్ధాంతాలకూ హస్తిమశకాంతర తారతమ్యం వున్నది. అసలు వారి దృక్పథాలే వేరు. వారి చిత్తవృత్తులు వేరు. భారతిగారు తీవ్ర జాతీయవాది. వీరేశలింగముగారు బ్రిటిషు ప్రభు భక్తుడు. భారతి గారు వందేమాతరం ఉద్యమంలో మునిగి తేలి ప్రభుత్వం వారి ఆగ్రహానికిగురియై, 1908 సంవత్సరము నుండి పాండుచేరిలో కాలక్షేపం చేస్తున్నారు. వీరేశలింగము గారు ప్రభుత్వంవారి మెప్పుకోసం వందేమాతరం ఉద్యమాన్ని తీవ్రంగా ఖండించి ప్రభుత్వమును ధిక్కరించిన వారిని ప్రత్యక్షంగాను పరోక్షంగానూ గర్హించారు వారికి 1893 నాటికే "రావుబహదూర్" బిరుదు వచ్చినది. వంగ రాష్ట్ర విభజన సంవత్సరంలో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమంలో బ్రిటిష్ వస్తు బహిష్కారము స్వదేశీ (వస్తూపయోగ) వ్రతము ముఖ్య ప్రణాళికయైనది. ఈ ఉద్యమం 1905 సంవత్సరము నాటికి దేశవ్యాప్తమైన జాతీయోద్యమమైనది. దీనిని అణచడానికి ప్రభుత్వం అనేక చర్యలు జరపసాగినది.

ఈ ఉద్యమం విద్యాధికులలో, విద్యార్థులలో సంచలనం కలిగించినది. ఆ సమయంలో చెన్నపట్టణంలో ఎం. ఎ. చదువుతున్న గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు, ఎఫ్. ఎల్. చదువుతున్న కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారు, బి.ఎల్. చదువుతున్న అయ్యదేవర కాళేశ్వరరావుగారు చెన్నపట్టణం తిరువళిక్కేణి బీచిలో ఒక మహాసభ జరపడానికి పూనుకొన్నారు. అప్పుడు "స్వదేశ మిత్రన్" అనే తమిళ పత్రికాధిపతి, ప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడైన జి. సుబ్రహ్మణ్యం అయ్యరుగారిని ఆ సభకు అధ్యక్షత వహించమని కోరడానికి వెళ్ళారు. అప్పుడా పత్రికకు సహాయ సంపాదకుడైన సుబ్రహ్మణ్య భారతిగారు వారి నాదరించి అయ్యరుగారికి సిఫారసు చేయగా, ఆయన అధ్యక్షత వహించారు. సభ జయప్రదంగా జరిగింది. ఈ సంగతి కాళేశ్వరరావుగారి జీవితచరిత్రలో వ్రాశారు.

"వందేమాతరం" ఉద్యమం క్రమక్రమంగా తీవ్రరూపం తాల్చినది. దానిని అణచడానికి ప్రభుత్వంవారు వంగరాష్ట్రంలో తీవ్రతర నిర్బంధ శాసనాలను ప్రయోగించారు. 1907 సం॥ ఏప్రిల్‌లో పూర్వం బ్రహ్మసమాజం నాయకుడుగా నుండిన

బిపిన చంద్రపాలుగారు వందేమాతరం ఉద్యమ ప్రచారం చేయడానికి ఆంధ్రదేశంలో పర్యటించడానికి వచ్చి రాజమండ్రి, కాకినాడ, బెజవాడ, బందరు మొదలైన పట్టణాలకు వెళ్ళి తీవ్రమైన ఉపన్యాసాలను చేశారు. అంతట దేశంలో ఆ ఉద్యమం అగ్నిహోత్రంలాగ వ్యాపించినది.

రాజమహేంద్రవరంలోని ఆర్ట్సు కాలేజికి, ట్రైనింగు కాలేజికి మార్కు హంటరు అనే దొర ప్రిన్సిపాలుగా ఉన్నారు. అతడు విద్యార్థుల నీ యుద్యమములో పాల్గొన వద్దని శాసించాడు. విద్యార్థులాయనను ధిక్కరించారు. అంతట ఆయన విద్యార్థి నాయకులను, విద్యార్థులను వెళ్ళగొట్టి శిక్షించాడు. అందులో ట్రైనింగు కాలేజి విద్యార్థిమైన గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారొకరు. వీరేశలింగముగారికి శిష్యులుగా నుండి బ్రహ్మ సమాజంలో పని చేస్తూ వున్న కామరాజు హనుమంతరావుగారు, మరి ఇద్దరు యువకులు కూడా వున్నారు. వీరికి ప్రభుత్వోద్యోగా లివ్వ కూడదని ప్రభుత్వ ఉత్తరువులు వచ్చాయి.

వీరేశలింగముగారు బ్రిటీషు ప్రభుత్వ భక్తుడు. వందేమాతరం వుద్యమానికి వ్యతిరేకి. దానిని చాలా తీవ్రంగా విమర్శించారు. తమ శిష్యుడైన హనుమంతరావుగారు ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆయనకు నిశ్చయమైన వివాహాన్ని ఆపివేసి శిక్షించారు. తమ "స్వీయ చరిత్ర"లో వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న వారిని దూషించారు. ముఖ్యంగా గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని, బోడి నారాయణరావు గారిని తూలనాడినారు.

ఈ స్థితిలో హరిసర్వోత్తమరావుగారు బెజవాడలో ప్రకటిస్తూ వున్న "స్వరాజ్య" అనే పత్రికలో దక్షిణ దేశంలో దేశభక్తుడైన చిదంబరం పిళ్లెగారిని పట్టుకున్న సందర్భంలో జరిగిన అల్లరి సందర్భంలో దొరల ఘాతుక చర్యలను విమర్శిస్తూ వ్రాసినందుకు ప్రభుత్వము వారాయనపైన, బోడి నారాయణరావుగారిపైన 'రాజద్రోహ' నేరానికి కేసు దాఖలు చేశారు. ఇంగ్లీషు వారు ముగ్గురు భారతీయులను కాల్చి చంపిన ఆ విషయాన్ని విమర్శిస్తూ వ్రాసిన వ్యాసం తీవ్ర రాజద్రోహ పూరితమైనదని కేసు బనాయించారు. అందులో వీరేశలింగముగారు ప్రభుత్వం తరపున సాక్ష్య మిచ్చిరి. దాని పైన హరిసర్వోత్తమరావు గారికి, నారాయణరావుగారికి శిక్షపడింది. Leonard: Veeresalingam. P. 345. Govt of India. Telegra

4)

mme from Chief Secretary to the Govt of Madras G.O. Home Department – 13 Nov. 1908. Home (Political) Proceedings No: 109 - May 1909. India office Library. సెషన్సుజడ్జి కెర్షాస్ప (పార్శీవాడు) హరిసర్వోత్తమరావుగారికి ఆరునెలలు విపి ఖైదు, బోడి నారాయణరావుగారికి తొమ్మిదినెలలు కఠిన శిక్ష విధించారు. ప్రభుత్వంవారు అప్పీలు చేయగా హైకోర్టు హరిసర్వోత్తమరావుగారి శిక్షమూడు సంవత్సరములకు పెంపు చేశారు. ఆకాలంలో రాజకీయ ఖైదీలను జైలులో చాలా బాధలు పెట్టేవారు. ఆయన ఆ బాధలన్నీ పడ్డారు. సర్వోత్తమరావుగారికి "స్వరాజ్య" పత్రిక నిర్వహణ విషయంలో పింగళి లక్ష్మీనారాయణగారువ్రాసిన వుత్తరాలు పోలీసువారికి దొరికినవి. ఆయన పాండుచేరికి పరారీఅయి జార్జిచక్రవర్తి పట్టాభిషేక సందర్భాన ప్రకటించిన amnesty క్రింద మరల 1912 సంవత్సరములో తిరిగి వచ్చారు. పాండిచేరిలో ప్రవాసంలో వున్న గాడిచర్లవారివల్ల అక్కడే ప్రవాసం గడపిన భారతిగారు వీరేశలింగంగారి సంగతులన్నీ వినియుంటారు.

వీరేశలింగం పంతులుగారు గాడిచర్ల వారిపై తెల్లదొరతనం తెచ్చిన రాజద్రోహనేరవిచారణ సంగతిని– ఆ విచారణలో పంతులుగారికి మంచి స్నేహితుడుగా తమ సంస్కరణోద్యమమునకు ద్రవ్య సహాయము కూడాచేస్తూ వచ్చిన సమర్థి రంగయ్యసెట్టిగారు ♦ మద్రాసు నుండి బందరు వచ్చి సాక్ష్యము చెప్పి తిరిగి వెళ్ళుచుండగా జరిగిన రైలు ప్రమాదములో చనిపోయినట్టి సంగతిని వ్రాశారు గాని, రంగయ్య సెట్టిగారి వలెనే తామున్నూ ఆ కేసులో సాక్ష్యమిచ్చిన చారిత్రాత్మకమైన సంగతిని మాత్రం స్వీయ చరిత్రలో వ్రాయకుండా దాచివేశారు.

---

♦ చెన్నపురి క్రైస్తవ కళాశాలలో గణిత శాస్త్రోపన్యాసకులు, దేశ భాషా పర్యవేక్షకులు.

# వీరేశలింగంగారి స్వభావం

వీరేశలింగం పంతులుగారు చాలా తెలివైనవారు. తాము తెలివైన వారమనే అహంభావం కలవారు. అయితే, పైకి మాత్రం చాలా అసమానమైన నమ్రత చూపించేవారు. తనతో పనిచేసిన వారి లోపాలు సహించేవారుకారు. వారు సరిగా పని చేయకపోతే చాలా కోపగించేవారు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు 1906 వ సంవత్సరంలో ఆయనతో కలిసి పనిచేద్దామని రాజమండ్రి సకుటుంబముగా వెళ్ళి, ఆయనతో సరిపడక, తిరిగి గుంటూరు వెళ్ళిపోయారు. (లియోనార్డు "వీరేశలింగం") ఆయనతో పని చేసే వారిని పంతులుగారు చాలా చులకనగా చూసేవారు. ఎవరి పనీ వారికి నచ్చేది కాదు. పంతులుగారు ఇతరులను గూర్చి చాలా చులకనగా మాట్లాడేవారు. "స్వీయ చరిత్ర" లో చాలా మందిని గూర్చి హేళనగా, వెటకారంగా కూడా వ్రాశారు. (ఉదా: ఏలూరి లక్ష్మీనరసింహముగారు.)

వీరేశలింగముగారు కార్యసాధన కోసం మాయోపాయాలుగాని దౌర్జన్యాలుగాని చేయించడానికి వెనుదీసేవారు కారు. ఆయన గొప్ప లౌక్యుడు.

వీరేశలింగముగారు మంచి విద్వాంసుడు. మంచి జ్ఞాపకశక్తి గలవాడు. మంచి రచయిత. ఆయన తన తోడి వారందరిలోకి గొప్పవాడ ననిపించుకోవాలనే తపన, ప్రబలమైన కీర్తి కాంక్ష కలవారు. ఎవరైనా ఏదైనాచేస్తే దానిని వారికన్న బాగాచేసి చూపించాలనే భావం (ambition) కలవాడు. ఆయనలో ఉపజ్ఞత (orginality) కొరవడినా ఎవరైనా ఒక కొత్త సాహిత్య ప్రక్రియ, ఒక సంస్కార ప్రయత్నము ఆరంభించుట చూడగానే తాను దానిని అనుకరించి వాని కన్న బాగా చేసి చూపి వారిని మరపించి ఆకీర్తినివారే పొందేవారు. ఈ గుణము ఆయనలో మొదటి నుండి చివరదాకా వుండేది. ఆయన ఒకరి మాట వినేవాడు కాడు. తన మాటకు ఎదురు చెప్పినవారిని సహించేవాడు కాడు.

ఆయన చాలా పట్టుదల గలవాడు. ఏదైనా కార్యం తలపెట్టితే దానినిసాధించ డానికి తన ధనమును శక్తిని పూర్తిగా వినియోగించడానికి వెనుదీసేవాడు కాడు. మంచి ధైర్య సాహసాలతో కార్యసాధన చేసేవాడు. అందుకు సామ దాన భేద

దండోపాయాలను అన్నింటిని ఉపయోగించేవాడు. ఆయన "స్వీయ చరిత్ర"లో ఆయన ప్రతిపక్షాలను సాధించిన పద్ధతులు చక్కగా కనబడతాయి. తానెంతో నీతి పరుడనని, సత్యవ్రతుడనని, పాపభీతి కలవాడనని పైకి చెప్పినా, కార్యసాధన కోసం ఏదైనా చేసేవాడని తెలుస్తుంది.

"స్వీయ చరిత్ర" మొదటి భాగం పీఠికలో "పనిచేసి చూపవలయు నన్న చింతయే కాని నన్నుగూర్చి నేను చెప్పుకోవలయు నన్న యభిలాష మొదటి నుండియు నాకంతగా లేకుండెను. తన్ను గూర్చి తాను వ్రాసికొనునప్పు డీశ్వర ముఖము జూచి సత్యమునే చెప్ప జూచినను సమకాలపు వారది యాత్మస్తుతిగానో పరనిందగానో చేకొని యన్యధా భావింప వచ్చును" అని వ్రాశారు గాని పంతులుగారు, పలుసందర్భాలలో కక్కుర్తి పనులు చేసేవారు.

## లియోనార్డు మదింపులో

లియోనార్డును చదవగా పంతులుగారి "స్వీయ చరిత్ర" లోను, వారిని గూర్చి ఇంత వరకు రచింపబడిన గ్రంథాలలోను అనేక అంశాలు అతిశయోక్తుల తోను, అసత్యములతోను నిండియున్నవని స్పష్టపడుతున్నది. తమ స్వీయ చరిత్రలో తమ జీవిత వృత్తాంతాన్ని 'వీరేశలింగంగారు తమ స్వంత దృక్పథం'లో గ్రంథస్థం చేశారు.

ఆయన తమ మహదాశయాలు పూర్తిగా సఫలత చెందని ఒక మహాపురుషునిగా తమ్ము తాము చిత్రించుకొన్నారు. (పుట 370) సంఘ సంస్కరణలో ఇతర సంస్కర్తలతోను తమ ప్రత్యర్థులతోను తమకు గల సంబంధాలను గురించి, తాము చేసిన కార్యసాధనను గూర్చి వివరించారు. స్త్రీ పునర్వివాహ యుద్యమ మంతా కేవలము తమ స్వంత దివ్యావేశము (Inspiration) వల్లనే ఆరంభమై తమ మార్గ దర్శకత్వము క్రిందనే కొనసాగినదని, విద్యాభివృద్ధి కృషి, మత-సంఘ సంస్కరణ కృషి, ప్రత్యేక సంస్థల స్థాపనము- అన్నీ తమకు తాముగా ప్రారంభించినామని, కొనసాగించినామని, ఇదంతా కేవలము దైవసంకల్పముతోనే జరిగించినామని 'స్వీయ చరిత్ర'లో వ్రాసుకొన్నారు. (పుట 270) తాము స్వశక్తి వల్ల, స్వయం కృషి వల్లనే పైకి వచ్చినామని, తమ గొప్పతనమును, నాయకత్వమును ఇతరులు వెంటనే గ్రహింపలేక పోయినా మొదటి నుండి ప్రదర్శితమవుతూనే వున్నదని, మదభిమానమును, మూఢత్వమును ప్రతిఘటించిన తమ విశిష్ట వ్యక్తిత్వమును

గూర్చి వీరేశలింగముగారు పేర్కొన్నారు. తమ వ్యక్తిగతమైన కృషిని గూర్చి పంతులుగారు మాటిమాటికి నొక్కి చెప్పుతారు. ఇతరులు తమకు తోడ్పడక పోవటం అలా వుండగా తమ పనికి అడ్డుగా వుండేవారని వ్రాయడమే అహం భావ ఫలితం. (పుటలు 367-372)

వీరేశలింగముగారు తమ స్నేహితులను గురించి, తమ తోడి కార్యకర్తలను గురించి చాలా తేలికగా వ్రాస్తారు. బసవరాజు గవర్రాజుగారివలె తమకు దాసానుదాసులైన వారిని గూర్చి తప్ప ఇతరులను గూర్చి ఏ విధంగానూ ప్రశంసింపరు వారి పనిపాటులు నిరసిస్తారు. స్నేహితులను విరోధులను గూర్చి ఆయన చేసే చిత్రణము అతి విచిత్రంగా వుంటుంది.

'స్వీయ చరిత్ర' రెండవ భాగములో ఆశాభంగం చెందిన మహా వీరపురుషునిగా తమ్ము తాము చిత్రించుకున్నారు. అందులో అసంతృప్తి, బాధ, ఒక విధమైన విచారము కనబడుతుంది. తన భవిష్యత్తును గూర్చి ఇతరులే విధంగా భావిస్తారో అనే ఆందోళన కనబడుతుంది. (పుటలు 367-372)

వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమము నాయకత్వమూ విడిగా ప్రత్యేకంగా సాగినదైనప్పటికి, నేనొక్కడనే వ్యక్తిగతంగా సంఘ సంస్కారములను సాధించినానని ఆయన 'స్వీయ చరిత్ర'లో ఉద్ఘాటించినప్పటికీ నిజానికి రాజమహేంద్రవరంలో అనేక సంస్థల యొక్క, వ్యక్తుల యొక్క కృషి మీదనే అక్కడి సంఘ సంస్కరణ మాధారపడి నడచినది. ఉదాహరణానికి ప్రభుత్వ కాలేజీ, మిషనరీ పాఠశాలలు, మునిసిపల్ కౌన్సిలు- రాజకీయాలు- ఇవన్నీ కూడా ఇందులో పాత్ర వహించినవి. శ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు, శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, వారి వంటి ఇతర పెద్ద మనుష్యులు చేసిన కృషి సామాన్యమైనది కాదు. వీరేశలింగంగారి జీవిత చరిత్రలు రచించినవారు ఆయననొక మహాపురుషునిగా చిత్రించడం ఒకఅలవాటు అయిపోయినది (పుట 400).

విశాల దృక్పథంలో స్థానిక, ప్రాంతీయ, జాతీయ పరిస్థితుల, సంస్థల, వ్యక్తుల పాత్రల పరస్పర ప్రభావము (Inter Play) మొదలైన విషయాలను దృష్టిలోవుంచుకున్నప్పటికి సంఘసంస్కర్తగాను, నాయకుడుగాను పంతులుగారిలో లోటుపాటులున్నా, ఆయనకు అపజయాలు కలిగినా ఆయన సాధించిన కార్యములు మొత్తముమీద గణనీయములే.

ఆనాటి స్థానిక రాజకీయాలలో సంఘ జీవితములోని తికమకలు ఆయన జీవితచరిత్రలో ఆసక్తికరముగా ప్రతిఫలిస్తూ వున్నవి. సంఘ సంస్కర్తగా, విద్వాంసుడైన రచయితగా ఆయనచేసిన కృషి ఇప్పటికినీ వాగ్వాదములకు, చర్చలకు దోహదకారిగానే వున్నది.

వీరేశలింగంగారి జీవితమునుగూర్చి, వారి చరిత్రను గూర్చివ్రాసినవారు ఆయన "స్వీయచరిత్ర"లో ఆయనవ్రాసిన సంగతులను, అంశాలను ఎట్టి పరిశీలనా లేకుండా ఆనాటి పత్రికల, ప్రభుత్వ మిషనరీల రికార్డులు మొదలైనవాటిలోని సంగతులతో పోల్చి అందలి నిజానిజములు నిర్ణయించకుండా స్వీకరిస్తారు. ఆయనకృషిలో ఆయనకు కలిగిన ఆటంకాల నెలా నిగ్రహించినదీ వ్రాయరు. ఆయనకు ఎవరుసహాయంచేసినదీ పరిశీలింపరు.

అన్నిటికన్న ముఖ్యముగా ఆయన తాను సాధించినట్లు వర్ణిస్తూచేసిన ఉద్ఘాటనలకును సాక్షాత్తుగా సాధింపబడిన కార్యములకును గల తారతమ్యము గమనింపరు." అని లియోనార్డు వ్రాశాడు. (ప్రకరణము 1, పుటలు 13-15)

(ఈవ్యాసం 1-1-1981 తేదీన రాజమహేంద్రవరం "సమాలోచన" పత్రికలో యీరచయిత ప్రకటించారు.)

## పంతులుగారిలో మార్పు

"ఏదైన వింతసంగతిని విన్నచో శోధించి, దాని నిజమును కనుగొనవలెననియు, విన్నదానినెల్ల విశ్వసింపకూడదనియు, విశ్వసించినదాని ననుసరించి ప్రవర్తింపవలెననియు నాకు మొదటినుండియు నైసర్గికాభిరతియై యుండెనుగాని యాలోచనలేక మొదలుచెప్పునట్లెల్లను నడచుస్వభావము యెప్పుడును లేదు. అందుచేత నేను కొన్నిసమయములయందు అహంభావమును, స్వచ్ఛంద చారిత్వమును గలవాడనయి యితరుల యభిప్రాయములయందు గౌరవముంచకుండెడివాడను" (స్వీయచరిత్ర" రెండవభాగం 53 వ పుట)

శ్రీపంతులుగారు వ్రాసిన వాక్యములివి. వారు చిన్నప్పుడు పురాణములు చదువు పిచ్చి అంతకంతకు ముదిరి అందులో విశ్వామిత్రుడు, అగస్త్యుడు, కపిలుడు మొదలైన ఋషులకు తపస్సువలన కలిగిన మహిమలను చదివినప్పుడు చిత్తోద్రేకము కలిగి "నేనిప్పుడు తపస్సునకు పూని మహిమలను పొందుదునాయని తహతహలు వడెడివాడ"నని పంతులుగారు తమ "స్వీయచరిత్ర" ప్రారంభము

లోనే వ్రాశారు. (పుట 23). వారికి భగవద్భక్తి, విగ్రహారాధనము, దేవాలయము లకువెళ్ళి దేవుని (శివకేశవులను) దర్శించుట సరిపాటిగావుండేది. ఉపవాసవ్రతములు భగవత్ప్రీతికరములనియేవారు నమ్మిరి బలహీనతవల్ల ఉపవాసములు చేయలేక పోయినా రాత్రివరకువుండి భుజించడము ఏకాదశినాడు చేసిరి. శివరాత్రికి కోటిలింగాలకుపోయి గోదావరిలో స్నానముచేసి రాత్రి జాగారముకూడా చేసినారు. ("స్వీయచరిత్ర" పుట 51). త్రికాలసంధ్యావందనము, సహస్రగాయత్రి చేసేవారు మంత్రముల ప్రభావమందు విశ్వాసముగలవారై ఆంజనేయ రామమంత్రములను బహువారములు పునశ్చరణ చేశారు. భూతవైద్యులుచేసే మంత్రతంత్రములు భేషజముచూడగా వారికికొంత అపనమ్మకముకలిగినది. పంతులుగారికివారుభూతము లను చూపించలేకపోయారు. దయ్యములను చూడవలెనని రాత్రిళ్ళు శ్మశానమునకు కూడా వెళ్ళేవారు. అవి కనబడనందువల్ల వారికి అపనమ్మకము హెచ్చినది. మంత్ర వేత్తలభేషజము, మాయోపాయములనుచూచినందువల్ల భూతావేశమునందునమ్మకము నశించినది. జ్యోతిష్యములో జాతక, ముహూర్తములయందు, శకునములయందు విశ్వాసముచెడినది." అనివ్రాశారు. ఇట్లు దయ్యములను మంత్రములనుగూర్చిన మూఢవిశ్వాసములు, 1868 సరికే స్వానుభవముచేతనే సడలినట్లుగా చెప్పు కొన్నారు. కాని వారిపై అమేయప్రభావం చూపి, యీ విశ్వాసమును భయములను నిరాధారములని నిరూపించిన గ్రంథమొకటి రాజమండ్రి ప్రముఖులే పంతులుగారు పద్నాలుగేండ్లప్రాయంలో వుండగా 1862 లోనే వెలుపరించియున్నారని మాత్రము గుర్తుంచుకొనవలసియుంటుంది.

ఆ తర్వాత ఈ స్థితిలో కేశవచంద్రసేన్‌గారి ఉపన్యాసములు పంతులుగారు చదివానంటారు. కేశవచంద్రసేనుగారు వంగదేశములో బ్రహ్మసమాజ నాయకులలో అగ్రగణ్యులు. వారిపైన క్రైస్తవ భావముల ప్రభావము పడినందువల్ల ఆకాలములో వారు హిందూమతాచారముల యందు, హిందూ మత ధర్మముల యందు గౌరవము లేక వాటిని తీవ్రముగా విమర్శించినారు.

బ్రాహ్మసమాజకులు ఏ మత గ్రంథమును అపౌరుషేయమని, పరమ పవిత్రమని అంగీకరించరు. అవతారముల నమ్మరు. బహుదైవతారాధనమును, విగ్రహారాధనమును నిరసింతురు. వర్ణాశ్రమ ధర్మములను, కులభేదములను గర్హింతురు. కర్మమును పునర్జన్మమును నమ్మిన నమ్మ వచ్చును. నమ్మకపోయి నందువల్ల నష్టము లేదు. పై విషయముల గూర్చి కేశవచంద్రసేనుగారు చేసిన

చర్చలలో వారు చూపిన కారణములు వారు చేసిన విమర్శలు వీరేశలింగముగారికి నచ్చినవి. అంత వరకు వారు నిజమని నమ్మిన మత విషయములు కొన్నింటిని గూర్చి వారికి సందేహము కలిగినది. (స్వీ. చ. పుట. 54) అని వ్రాసుకొన్నారు.

ఇంతలో, బందరులో చర్చిమిషను స్కూలులో ఉపాధ్యాయులుగా నుండిన ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు రాజమహేంద్రవరములోని మండల పాఠశాలలో సహాయోపాధ్యాయులుగా (1868-70) వచ్చారు. వారు బ్రహ్మ సమాజకులుగా నున్నారు. వారు ఆ సిద్ధాంతములను వీరేశలింగముగారు మొదలైన విద్యార్థులకు బోధించ నారంభించారు. అంతట ప్రతివారము మత విషయములు మొదలైన వాటిని గూర్చి వారి ఇంటిలోగాని, వీరేశలింగముగారి ఇంటిలోగాని చర్చించుట ప్రారంభించారు. ఈ సంగతులు 1868-69 సంవత్సరముల మధ్య తటస్థించి నందువల్ల వీరేశలింగము గారి భావములలో కొంత మార్పు జరిగినది. ఈ సంగతిని వారు "నా పూర్వ విశ్వాసములలో కొన్ని యభిప్రాయములు మారుట కారంభించుట సంభవించెను" అని (స్వీ. చ. పు. 54) వ్రాశారు.

పాఠశాలకు పోయి చదివి, పాఠశాలకు పోకుండ చదివి పరీక్షకు కూర్చుండి, కూర్చుండక మెట్రిక్యులేషను చదువు పూర్తిచేయుటకు 1867 నుండి 1870 వరకు నాలుగేళ్ళపాటు ప్రయాసపడిన ఈ దశలో దయ్యములను చూప మంటే భూతవైద్యులు చూపలేక పోయినారని వ్రాసుకొన్నప్పటికీ, కేశవచంద్రసేను రచనలను చదివినప్పటికీ, ఆత్మూరి వారి బోధలకు గురిఅయినప్పటికీ, వానిచే తమ విశ్వాసములు మారుటకు ఆరంభించినవని వ్రాసుకొన్నప్పటికీ, సంప్రదాయ సిద్ధమైన బహుదేవతారాధనము క్రిందనే యుండి, నైషధ కావ్యమును, రసిక జనమనోరంజన కావ్యమును, శివునకు విష్ణువునకు అంకితము చేసిన యథార్థాన్ని బట్టి వారప్పటికి మారలేదనే చెప్పవలసియుంటుంది. ఆ రెండు కావ్యములలో నైషధమును బారోదొరగారి 'గోదావరీ విద్యా ప్రబోధిని' యందు 1870లోను, రసిక జనమనో రంజనమును పురుషార్థ ప్రధాయని యందు 1872 లోను ప్రకటించి యున్నారు. కాని ప్రొవిన్షియల్ స్కూలు ప్రధానోపాధ్యాయుడైన బారోదొరగారికి తాను తెలుగునేర్పి, బారోదొరగారి నుండి హిందూ మతముపైన, హిందూ సాంఘికాచారముల పైన, విశ్వాసములపైన ఖండన విమర్శలను ప్రత్యక్షముగా వినిపుంటూరనుకొనుట ంతైనా సంభావ్యము. లోగడ కేశవ చంద్రసేను, ఆత్మూరి వారల ప్రభావము ప్పటికి పాకమున బడినది. అది 1871 వ సంవత్సరములో తాను చెప్పుకొన్న

అరటిగెల వృత్తాంతము, ఇంటిదూలమునకు పట్టిన తేనెతుట్టె వృత్తాంతములోను ప్రతిఫలించినది. కోరంగి పాఠశాలలో ఉపాధ్యాయుడుగా అమావాస్యనాడు ప్రవేశించుటతో రుజువయినది. ఏమైనప్పటికి బారోదొరగారితో పరిచయం పంతులుగారిలో మార్పును ఒకకొలికికి తెచ్చినదని వూహించవచ్చును. పరిశోధకులు ఆ ఆధారములను సేకరించవలసి యున్నది. బారోదొరగారి పత్రికవలననే పంతులుగారికి పత్రికారచనములో రుచికలిగిన దనుటకు సందేహములేదు. దానిలో వ్యాకరణ విషయమై వివాదంకూడా నడిచింది.

బారోదొరగారి పత్రిక మూతబడగానే అనతికాలంలో 1871 లో చెన్నపట్నములో శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు స్థాపించిన "ఆంధ్రభాషా సంజీవని"లో ప్రచురణకు పంతులుగారు తమ పద్య రచనలు పంపించారు. శుద్ధాంధ్ర సంగ్రహ భారతాన్ని అందులోనే ప్రకటించారు. 1872 జనవరి నుండి మచిలీబందరులో ప్రకటింపబడిన "పురుషార్థ ప్రదాయిని" పత్రికకు ప్రథమము నుండి పంతులుగారు చందాదారులై పాఠకులుగా ఉన్నారు. తమ రచనలుకూడా దానికి పంపసాగినారు. స్త్రీవిద్యా విషయమై పద్యములు దానిలో ప్రకటించారు. సొంతపత్రిక పెట్టేవరకు - 1874 వరకు ఇదొక్కటే వారి సంస్కరణ రచన. ఆపత్రికకు సంపాదకులైన చెరుకూరి ఉమారంగనాయకులు గారు ప్రతిభాశాలి. అందులో వ్యాసములు వ్రాసేవారు కూడా చాలా తెలివైనవారు, విద్యాధికులు. ఆ పత్రికలో అనేక నవీన భావాలు ప్రచురింపబడేవి. మన హిందూ మత ధర్మాలలోని లోపాలను గూర్చి చర్చలుండేవి. కులాచారముల గూర్చి, సంఘ సంస్కారమును గూర్చి, వితంతు వివాహములు శాస్త్ర సమ్మతములే అని, స్త్రీ విద్య ఆవశ్యకమని- ఇంకా కొన్ని గొప్ప విషయములగూర్చి, ప్రకృతి, పదార్థ విజ్ఞానశాస్త్రాంశములను గూర్చి వ్యాసములు ప్రకటింపబడేవి. ఆనాడు ఆంధ్రదేశములో చెన్నపట్నము తరువాత బందరే ముఖ్య పట్నముగా నుండేది. నోబుల్ అనే క్రైస్తవ మతబోధకుడు 1843లో స్థాపించిన పాఠశాల దినదినాభివృద్ధిని పొంది ఉన్నత పాఠశాలయైనది. హైస్కూలులో చదువుచున్న బ్రాహ్మణ విద్యార్థులు కొందరు క్రైస్తవ మతమును స్వీకరించారు. మత ధర్మాలను గూర్చిన చర్చలు తీవ్రముగా సాగినవి. దీనిని గూర్చి కూడా 'పురుషార్థ ప్రదాయిని'లో వార్తలు ప్రకటింపబడేవి. పైన చెప్పిన వీరేశలింగముగారు సహజంగా తెలివైన వారు, ఆలోచనా పరులు అయినందువల్ల ఆ పత్రికలోని నవ్య భావాలను అన్నిటిని అవగాహన చేసికొని క్రమక్రమముగా పరిణతి పొందారుగాని ఆ పత్రికలో ప్రధానంగా తమ ప్రబంధాలనే ప్రకటింపసాగినారు. అప్పటికి ఇంకా

వారికి స్త్రీ విద్యావిషయమునకు మించి ఇతరమైన సంఘ సంస్కార భావాలు కలుగలేదు. అటువంటి భావాలను ఆ పత్రికలో వ్రాసిన వ్యాసాలలోవారు ప్రకటించలేదు. ఆపత్రికా పతనము తర్వాతనే అవి క్రమ క్రమముగా పరిణతి చెందినవి. తరువాత వారు 1874 లో "వివేకవర్ధని" పత్రికను స్థాపించినప్పుడు "పురుషార్థ ప్రదాయిని" పరవడిలో దానిలోని విధవా పునర్వివాహ సమస్య ఒక్కటి మినహా తక్కిన ఆధునిక భావాలన్నింటిని అందరికన్నా మిన్నగా రూపుదిద్ది తమపత్రికలో వ్రాయ గలిగినారు.

## మార్పుకు మూలమైన హితసూచని

తమపైగల ప్రభావములలో ఒకటిగా తమ స్వీయచరిత్రలో ఎక్కడా పేర్కొనకుండా అతిజాగ్రత్తగా కప్పిపుచ్చిన ఉద్గ్రంథమొకటున్నది. అదే హిత సూచని. దానికర్త సామినేని ముద్దునరసింహంనాయుడుగారు. అందులోచెప్పని సంస్కరణలు పంతులుగారు క్రొత్తగా స్వంతముగా చేపట్టినవిలేవంటే అతిశయోక్తి ఎంతమాత్రమూకాదు. నాయుడుగారు ఇంగ్లీషువిద్యను అభ్యసించి జిల్లా ఫస్టుక్లాసు మునసబుగా పనిచేసి ఉపకార వేతనము నంది 1856 వ సంవత్సరములో స్వర్గస్థులైనారు. 'ఆ హితసూచని' గ్రంథమును రాజమహేంద్రవరములో వారికొమారుడు 1862 లో ప్రకటించిరి. వారు అనేకవిషయాలనుగూర్చి చర్చించిన వ్యాసముల సంపుటి "హితసూచని". అందులో 'విద్యాప్రమేయము' అనువ్యాసములో లోకవ్యవహార వైజ్ఞానిక విషయములగూర్చిన గ్రంథములు సులభముగా అర్థమగునట్లుండవలెనని, అవి పద్యములలోగాక వచనములలో వుండవలెనని, సామాన్య విజ్ఞానమును (General Knowledge) గ్రంథరూపమున అచ్చువేయించి బాలురకు చెప్పించవలెనని, స్త్రీలకుకూడా విద్య చెప్పించవలెనని నాయుడుగారువ్రాసినారు. ఇంగ్లీషులో ఇప్పుడు వాడుకలోనుండే జాగ్రఫి, జామెట్రీ, అర్థమేటిక్, అస్ట్రానమి, ఫిలాసఫి, యనాటమీ అనేశాస్త్రములు సంగ్రహముగా దేశభాషలో వ్రాయించి విద్యార్థులకు చెప్పించవలెనని, ఇంగ్లీషు సర్జరీని తెలుగుచేయవలెనని వ్రాశారు. దీనివల్ల ఆనాటి కాయనకుగల నవీనభావములు తెలియగలవు. ఈసలహాప్రకారము ఉమా రంగనాయకులు రంగాచార్యులుగారు మొదలుగాగల పలువురికివెనుకనే వీరేశలింగము గారు కొన్ని గ్రంథములు రచించినారనే సంగతి గమనించవలసిన విషయము.

"సువర్ణప్రమేయము" అను ప్రకరణములో నీచలోహములను బంగారముగా మార్చుట అసంభవములని నాయుడుగారు నిరూపించినారు.

'మనుష్యేతర జంతుపరిజ్ఞాన ప్రమేయము'లో జంతువులు మాట్లాడగలవని నమ్ముటను ఖండించినారు. 'రక్షఃప్రభృతి ప్రమేయము'లో దయ్యములు కలవని

నమ్మటకు ఆధారములులేవని చెప్పి కొంతచర్చ జరిపినారు. ఈవ్యాసమును వీరేశలింగము పంతులుగారు యధాతథముగా భాషను కొంతమార్చి "వివేకవర్ధని" పత్రికలో తమ వ్యాసముగా ముద్రించుటవల్ల ఈ "హితసూచని" గ్రంథమును ఆయన ఎంత జాగ్రత్తగా చదివిప్రభావితులైనారో, ఉపయోగించుకొన్నారో తెలియ గలదు. ఈహితసూచని పంతులుగారు ఎప్పుడుచదివినారో ఇప్పటికి తెలియుటలేదు. కాని 1866 లగాయతుగా దయ్యములనుగూర్చి జాతకములనుగూర్చి ఇతర మూఢ విశ్వాసములనుగూర్చి స్వానుభవముచేతనే నమ్మకము చెడినదని వ్రాసుకొనియున్న సంగతులు ఈగ్రంథప్రభావమును కప్పిపుచ్చుటకే స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారని తలంచుట అన్యాయముకాదు. ఎవరెవరి ప్రభావములకు తానులోనైనట్లు తెలుపుకొని యున్నను హితసూచనితో పరిచయము, దాని ప్రభావమునుమాత్రము ప్రత్యేకముగా దాచిపెట్టినారు. దయ్యములు, జాతకములు, ఇతర మూఢవిశ్వాసములనుగూర్చి అప్పటిలోచెప్పిన గ్రంథం ఒక్క హితసూచనియేయని గమనించవలెను.

'మంత్రప్రమేయము' అనే ప్రకరణములో మంత్రములకు శక్తిలేదని నాయుడుగారుచెప్పి, పరకాయప్రవేశాది విద్యలున్నవని నమ్మట మూఢత్వమని నిరసించినారు. మంత్రతంత్రములనుగూర్చి విమర్శిస్తూ పంతులుగారు "వివేక వర్ధని"లో అనేక వ్యాసములు వ్రాశారు. "సత్యరాజా పూర్వదేశయాత్రలు" గ్రంథంలోకూడా పంతులుగారు మంత్రములను, జ్యోతిషమును హేళనచేశారు. నాయుడుగారు 'పరోక్షవిజ్ఞానప్రమేయము' అను ప్రకరణంలో మనుష్యులకు దివ్య దృష్టి కలదనుట తప్పుఅని జాతకములను నమ్మరాదని విమర్శించారు. ఈవిషయ ములనే పంతులుగారు "వివేకవర్ధని" పత్రికావ్యాసములో చక్కగా వ్రాశారు.

'వివాహప్రమేయము' అను ప్రకరణములో నాయుడుగారు కన్యాశుల్కమును నిర్బంధవైధవ్యమును నిరసించి, చిన్నది రజస్వలయైన తరువాత కన్యకు పిల్లవానికి పరస్పరేచ్ఛ కనిపెట్టి వివాహమును చేయవలెనని సూచించారు. స్త్రీవిద్య, స్త్రీపునర్వి వాహములను చెప్పియున్నారు. పెండ్లివేడుకలు, అమితవ్యయము తగ్గించవలసినదని నాయుడుగారు వ్రాశారు. వీరేశలింగము పంతులుగారును "వివేకవర్ధని"లో అదే సూచిస్తూ వ్యాసాలు వ్రాశారు.

'వైద్యప్రమేయము' అను ప్రకరణములో నాయుడుగారు గృహవైద్యమును గూర్చి వివరించారు.

ముద్దునరసింహం నాయుడుగారు రాజమహేంద్రవర కాపురస్థులు. వారి కుమారులు శ్రీరంగప్రసాదు నాయుడుగారు 1862 జూలై నెలలో రాజమహేంద్ర వరం జిల్లాకోర్టులో గవర్నమెంటుప్లీడరుగా వున్నారు. ఆయన తమతండ్రిగారు రచించిన 'హితసూచని' చెన్నపట్నములో 1862 లో ముద్రించి ప్రకటించినారు.

ఆగ్రంథముయొక్కప్రతి వీరేశలింగముగారి స్వంతగ్రంథముల సంచయములో నుండి పంతులుగారి ఇతరగ్రంథములతోపాటు రాజమహేంద్రవరము గౌతమీగ్రంథాలయములో భద్రపరుపబడి పంతులుగారి భావచౌర్యమును అసందిగ్ధముగా చాటుచున్నది.

పంతులుగారికి కలిగిన ఆధునిక భావములకు "హితసూచని" లోని చర్చలే మూలకారణములనుట నిస్సందేహము. పంతులుగారు 1874 అక్టోబరు లోస్థాపించిన "వివేకవర్ధని"లో 'హితసూచని' లోని అనేకవిషయముల నుపయోగించినారు. పంతులుగారి రచనలలోకూడా అనేక విషయములను అందులోనుంచి గ్రహించి విపులీకరించినారు.

# పంతులుగారి ఉద్యోగాన్వేషణ- ప్రజాసేవ

వీరేశలింగంగారు రాజమహేంద్రవర ప్రభుత్వ పాఠశాలలో నెలకు పాతిక రూపాయిల జీతంపైన ద్వితీయాంధ్రోపాధ్యాయులుగావుంటూ, వివేకవర్ధని పత్రికా సంపాదకులుగా ప్రజాసేవ ప్రారంభించి, సంఘ సంస్కర్తగా పేరుప్రతిష్టల నార్జించారనే విషయం అందరు ఎరిగినదే. ఉపాధ్యాయవృత్తిలో స్వేచ్ఛవుందని, అందుకే ఆవృత్తిని ఎన్నుకొన్నట్టును, అందులోకూడా స్వదేశీయుల యాజమాన్యంక్రింద ఆస్వేచ్ఛ వుండదని, ప్రభుత్వపాఠశాల పదవే స్వేచ్ఛకు స్థానమని స్వీయచరిత్రలో వ్రాశారు. కాని పంతులుగారి ఉద్యోగాన్వేషణ సుమారొక దశాబ్దం పాటు విస్తరించినట్టిదనీ, ఉపాధ్యాయవృత్తి వారి అభిమానవృత్తి కాదని, వారావృత్తిలో చేరి కాలం వెళ్ళబుచ్చుతున్నప్పటికి వారిదృష్టి యత్నం అంతా న్యాయవాది వృత్తిమీదేవుండేదని, యింకా వివిధోద్యోగాలనుగూర్చికూడా ఆలోచించే వారని, అవేమీ లభింపలేదని, నలభైనాలుగురూపాయిల ప్రధానోపాధ్యాయ పదవి వదిలేసి పదిమాసాలు ఉద్యోగంలేకుండా వివేకవర్ధనిని నడుపుతూవుండి ప్రభుత్వ పాఠశాలలో పాతికరూపాయిలకు రెండవ తెలుగు ఉపాధ్యాయుడుగా మొదట చేరడానికి ఇష్టపడక, తర్వాతవెళ్ళి చేరి అందులో స్థిరపడ్డారని చాలామందికి తెలియదు. ఈవిషయంగా స్వీయచరిత్ర ప్రథమభాగంలో చిత్రణకు, రెండోభాగంలో వెల్లడవుతున్న యథార్థానికి వ్యత్యాసంవుంది. తక్కువజీతపు ఉద్యోగంలో చేరటమేమిటా యని లియెనార్డు ప్రశ్నించుకొని పంతులుగారు మెట్రిక్‌పరీక్షలో కృతార్థుడనైనట్లు వ్రాసుకొన్న దెంతవరకు నిజమో చూడాలనుకొన్నాడు. గజెట్‌లు పరిశీలించి పంతులుగారు ఆవుద్యోగంలో చేరేనాటికి మెట్రిక్ ప్యాసుకాలేదని తేల్చాడు. ఇంత వింతవిషయాలకు అవకాశమిచ్చిన పంతులుగారు ఆ ఉద్యోగంలో చేరేదాక ఏఘట్టాలు నడచినవో, ప్రజాసేవలో వారెట్లు ప్రవేశించారో వివరంగా చూడవలసి వుంది.

పంతులుగారు స్కూలులో చాలాతెలివితేటలుగల విద్యార్థిగా పరిగణింపబడినారు. మెట్రిక్యులేషన్ ముందుతరగతులలో మొదటివారుగా ఉత్తీర్ణులయినారు. ఆయనకు మంచిజ్ఞాపకశక్తి వుండేది. ఇతరులు చదువుచుండగా వింటేచాలు, వేరే తాను చదవకుండానే పాఠాలు గుర్తులోవుండేవి. ఆయన తెలుగుసంస్కృతం ఇంట్లో అభ్యసించారు. ఇంగ్లీషు రాజమండ్రి ప్రభుత్వపాఠశాలలో మెట్రిక్‌వరకు చదివారు. అప్పట్లో అక్కడంతవరకే వుండేది. అదికూడా అనగా ఇంగ్లీషు చదువుకూడా రాజమండ్రిలో

పంతులుగారికిముందు ఏర్పడలేదు. అసలదిఆరంభముకాకపోయినందుచేత, పంతులుగారు వీధిబడిలో చదువు ముగిసినతర్వాత రెండేళ్ళపాటుగా చదువు ముగిసినట్లై తాలూకా కచేరి నౌఖరీ నిమిత్తమై ఒకపెద్ద గుమాస్తావద్దకనిపెట్టుకొని అప్రెంటీసుగా కూడా పనిచేయవలసి వచ్చినది. అంతలో ప్రభుత్వం ఇంగ్లీషుపాఠశాలను 1860లో తెరచారు. పంతులుగారికి ఇంగ్లీషు విద్యాయోగం కలిగింది.

1866 లో 4 వ తరగతి చదువుతున్నారు. అది నేటి నాలుగవ ఫారమునకు సమానమనవచ్చు. నేటి నాన్‌గజెటెడ్ గుమాస్తాగ్రేడుకు సమానమైన Uncovenanted civil service లో సర్కారు ఉద్యోగానికి కావలసినట్టి జనరల్‌టెస్టు ప్యాసుకావలెననే కుతూహలం కలిగింది. అందుకు 18 ఏళ్ళు నిండియుండాలనే నిబంధనవున్నందుచేత, తనకా పరీక్షకు దరఖాస్తు చేసేనాటికి 18ఏళ్ళు సమంగా యింకా నిండకపోవుటచేత, తనకు 19 వ ఏడు జరుగుచున్నట్లు అబద్దముగా దరఖాస్తుచేసి పరీక్షకు వెళ్ళారు. దానిని తెలుగు ఇంగ్లీషు ఉభయభాషలలోను వ్రాసి ఉత్తర సర్కార్లలో రెండోవారుగా గెలుపొందారు.

ఆరోజుల్లో అనగా, 1858 నుండీ మెట్రిక్ ప్యాసు కాకపోయినప్పటికీ జనరల్‌టెస్టులో నెగ్గితే 25 రూ॥ల నెలజీతం తెచ్చే సర్కారు ఉద్యోగం వచ్చేది. మాతండ్రి దిగవల్లి వెంకటరత్నంగారు కూడా ఆపరీక్ష పాసైనారు. ఆ పరీక్ష ప్యాస్ కాకుండా స్పెషల్ టెస్టులకు కూర్చుండుటకు వీలులేదు. సర్కారు ఉద్యోగానికి అది కనీస పరీక్ష- ఆరంభ పరీక్ష అన్నమాట. ఆ పరీక్ష 1880తో రద్దయింది.

వయసెక్కువవేసి, 4 వ తరగతిలో వుండగానే మెట్రిక్‌కు తుల్యమైన జనరల్ టెస్టు యిచ్చి విశిష్టస్థానంలో ఉత్తీర్ణులైన పంతులుగారు మెట్రిక్ కొరకు నాలుగేళ్ళు ప్రయత్నించి నారంటే ఆశ్చర్యకరమే. మెట్రిక్ వరకు గల ఐదుతరగతులకు పంతులుగారి కొక దశాబ్దం పట్టింది. దీర్ఘమైన అనారోగ్యంచేసి మూడవతరగతి పరీక్షకు వెళ్ళుట మూడో సంవత్సరానికిగాని వీలుకాలేదు. వ్యాధిగ్రస్తులైన పెదతండ్రి గారికి సేవజేసి, తన ధనంతో విద్యచెప్పించి సంరక్షణ చేస్తున్న ఆ పెదతండ్రి మరణించగా మెట్రిక్ మొదటి సంవత్సరం తరగతులు హాజరుకాలేక పోయి పరీక్షకే వెళ్ళలేదు. మరు సంవత్సరం స్కూలులో చదివి పరీక్ష వ్రాశారు. కాని తప్పారు. పెదతండ్రిగారి వితంతు భార్య తన భర్త ఆస్తిని ఎలాగో విక్రయించి పుట్టింటికి చేరుకోగా భవిష్యత్తులో వితంతు స్త్రీ జనోద్ధారకుడుకాగల వీరేశలింగంగారు ఇరవై ఏళ్ళ ప్రాయంలో వితంతు ఆస్తికి అనంతర కర్తయై తాముండగా అక్రయం చెల్లదని పెదతల్లి మీద వ్యాజ్యంచేసి కోర్టుల వెంట పడ్డారు. అది తప్పనే స్ఫురణ ఆ సంస్కర్తకు స్వీయ చరిత్రనాటికైనా లేకుండా వ్రాశాడు. పైగా, ఓడిపోయిన

తర్వాత కూడా యింకా గెల్చుకొనే అవకాశం వుందని, గెలుపు దీర్ఘకాలం మీద గాని సాధ్యంకాదని వదిలేశానని, అదొక గొప్ప క్రింద వ్రాసుకొన్నాడు. మూడవ సంవత్సరం బడికివెళ్ళలేదు. పరీక్షకూ వెళ్ళలేదు. కోర్టు వ్యాజ్యం మాత్రం ఓడిపోయి ఎదుటి కర్చులు కూడా యిచ్చుకోవలసి వచ్చారు. కేసు కర్చులకుగాను భార్య మెడలో వున్న నగ కట్టుకాస్తా నాలుగైదు వందలకు అమ్మివేసి కట్టారు. అది చాలా దుర్దశగా అగుపించును.

చేసేదిలేక బడిచదువు చాలించుకొని ఇంగ్లీషురాని గవర్నమెంటు ప్లీడరు వద్ద ఇంగ్లీషుక్లార్కుగా పాతికరూపాయలకు చేరారు. ప్లీడరు వృత్తిలో గల రుచి తెలిసింది లిటిగేషన్ మర్మాలు వంటబట్టినై. తనకది స్వాధీనమయ్యేదిగా తోచింది. భవిష్యత్తులో తనవల్ల ఆత్మహత్య చేసుకోవలసి వున్న ఆ ప్లీడరుగారి కొలువు బాగా వుందికాని ఆయనగారుంచుకొన్న వేశ్య ఆఫీసుకే వచ్చి సరస గోష్ఠి నడుపుట నచ్చక నెలజీతం తీసుకొని విరమించారు. ఉద్యోగం నిమిత్తం రాజమండ్రిలో అధికారులుగా వున్న ఇంగ్లీషు దొరలను ఆశ్రయించారు. ప్రభుత్వోద్యోగం యివ్వజాలని వారు తమకు తెలుగు నేర్పమన్నారు. రెండు తెలుగు ట్యూషన్లు సంపాదించుకొని నెలకు 35 రూపాయిలు తెచ్చుకోగలిగారు. ఉద్యోగం పంతులుగారి కెంత అవసరమైనదో ఇందువల్ల తెలియుచున్నది.

పంతులుగారి పూర్వీకులు దేశపాండ్యాలైనా, తాతగారొక దివానై అంత పెద్ద భవంతి కట్టించినా, తండ్రులనాటికి స్థితి క్షీణించి, పంతులుగారు ఒక గుమస్తా కుమారుడుగా జన్మించారు. నాలుగేళ్ళప్పుడు తండ్రిగారినీ, చదువొకకొలికికి రాక ముందే పెదతండ్రినీ కోల్పోయిన పంతులుగారు బాల్య యౌవనదశలలో చాలా ఒడిదుడుకులకు గురి అయినారు. ఎంతో చిన్నతనం నుంచీ జీవికచూచుకోవలసిన అవసరం వెన్నాడింది.

అసలా ముందటిదే పంతులుగారు ఉద్యోగపర్వం నడిపి వున్నారు. పెద్ద తండ్రిగారు పోయిన వెంటనే వెనక స్కూలులో తనకు బహుమతి యిచ్చి వున్న న్యాయాధిపతి మారిస్ దొరకు కనిపించుకొని తన గృహవిపత్తు చెప్పుకొని కోర్టు విలేఖరి కొలువు ఇప్పించమని ప్రార్థించారు ఆ దొర వాగ్దానంచేశాడు. కాని దొర వద్ద సిరస్తాదారునిగా వున్న తన బంధువు వేరే లంచం తిని, ఆ ఉద్యోగంలో మరొకరిని వేయించాడు. ఆ గుమస్తా ప్రవర్తన చూచి కోర్టుక్లార్కు వుద్యోగానికే వెళ్ళరాదని శపథం చేసుకొన్నారట. తర్వాత ప్లీడరు గుమస్తా అయ్యారు. ప్లీడరు వృత్తి పట్ల ఆకర్షితులయ్యారే గాని విముఖులుగాలేదు.

ఇంగ్లీషు దొరలకు ట్యూషన్లు చెప్పుకొనుచు మెట్రిక్ నాలుగోయేట ప్రైవేటుగా పరీక్షగా కూర్చుండినారు. ఆ సంవత్సరం అనగా 1870లో మెట్రిక్‌లో ఉత్తీ

న్నైరునానని వ్రాశారు. కాని ఉత్తీర్ణుల జాబితాలో పేరులేదని లియోనార్డువ్రాశారు. పంతులుగారి కథనాలంటే అపనమ్మకం కలిగి గజెట్లు వెదికాడన్నమాట. ధవళేశ్వరంలో 44 రూ.ల నెలజీతం వదులుకొని రాజమండ్రిలో పాతికరూపాల సహాయకోపాధ్యాయుడుగా వెళ్ళటమేమిటాయని అనుమానం కలిగింది. గజెట్లో చూస్తే లియోనార్డుకు పంతులుగారి పేరుకానరాలేదు. 1873 గజెట్ దాకా వెతికాడు. కానరాలేదు. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారిని లేవగొట్టి మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీ ప్రధానాంధ్రోపాధ్యాయుడుగా 1898లో వెళ్ళి ఏమైనా మెట్రిక్ పూర్తిచేసిన ఫలితమా అని బంగోరె 1897 గజెట్ వెదికాడు. అందులో పేరుంది; కానిరావుసాహెబ్ పంతులు వెనకాముందులేవు. కావున మరెంకెవరికైనా ఆ పేరుతోవున్నారా అని నాకు వ్రాశాడు బంగోరె. నాకు తెలిసినంతలో చింతలపూడితాలూకా తెడ్లంలో ఆ పేరుగల మాబంధువొకరుండేవారు–వారు ఇంగ్లీషు చదువులజాడ పోలేదనివ్రాశాను. ఇంతలో 1870 గజెటునేమళ్ళీ జాగ్రత్తగా పరిశీస్తే K. Veresiaingam అనీ మూడోస్థానం తెచ్చుకున్న ముగ్గురు పేర్లలో చివరిపేరుగా స్పెల్లింగ్‌తప్పుతో కె. వెరేశలింగం అన్న పేరుంది. పాశ్చాత్యుడుకదా, అదిమరెవరిపేరో అనుకొని అలావ్రాశాడు.

దొరలకు ట్యూషన్లు చెప్పుతుండగా తర్వాత తాను చదివిన ప్రొవిన్షియల్ స్కూలులో సహోపాధ్యాయ పదవొకటి ఖాళీఏర్పడినది. పాతిక రూపాయల జీతం మీద అందులో సుమారొక సంవత్సరం పనిచేశారు, అందులో అర్హతగలవారిని నియమించగా అర్హతలేని పంతులుగారు విరమించాల్సివచ్చింది. తాత్కాలికోపాధ్యాయుడుగా పనిచేయుచుండగానే అనగా 1871 లోన ప్లీడరు పరీక్ష అయిన క్రిమినల్ హయ్యరు ప్యాసయ్యారు. ఆ సంవత్సరమే కూర్చున్నారో, మరుసంవత్సరమోగాని సివిల్ హయ్యరు ప్రయత్నించి పరిక్ష తప్పారు. ప్రొవిన్షియల్ స్కూలు తాత్కాలికోపాధ్యాయత్వము నిలిచిపోయిన అనతికాలంలోనే కోరంగిలో కమిటీ స్కూలులో హెడ్మాస్టరుపదవిలో ప్రవేశం దొరికింది. అక్కడ హెడ్మాస్టరుగా వుంటుండగానే 1872 ట్రాన్సులేషన్ టెస్టుప్యాసైనారు. కోరంగిలో 35 రూపాయల జీతంమీదవుండి 1874 లో ధవళేశ్వరం ఆంగ్లో వర్నాక్యులర్ ప్రైవేట్ స్కూలు ప్రధానోపాధ్యాయుడుగా 44 రూపాయల జీతంమీద రాజమండ్రి దగ్గరలోకి వచ్చిచేరుకున్నారు. ధవళేశ్వరంలో హెడ్మాస్టరుగా వుంటుండగా 1875లో ప్రెసిన్ రైటింగు టెస్టు ప్యాసైనారు. సబ్‌మాజిస్ట్రేటుపదవికి అర్హత సంపాదించినట్లని వ్రాసుకొన్నారు.

ఆకాలంలో రివెన్యూ హయ్యరు ప్యాసైతే డిప్యూటి కలెక్టరు ఉద్యోగం వచ్చేదని, అదితేలికగా ప్యాసైవుండే వాడినని, దాని యందిష్టములేదని, లోగడ ఒకసారి తప్పిన సివిల్ హయ్యరు టెస్టు ప్యాసైతే సబ్ జడ్జి ఉద్యోగం పొంద

వచ్చునని, షష్టగేడు ప్లీడరు వృత్తి చేసుకోవచ్చని, ప్లీడరు వృత్తిలో అబద్ధపు సాక్ష్యం సృష్టించ వలసి వస్తుందని మిత్రులు చెప్పగా విని ఆంగీకరించ వెళ్ళలేదని వ్రాసుకొన్నారు. సబ్- మాజిస్ట్రేటు పదవికి యోగ్యత సంపాదించుకొని ఫ్రండి, బ్ జడ్జి పదవికి యోగ్యత కొరకు సివిల్ హయ్యరు ప్యాసవుటకు ఎందుకు యత్నించ లేదో కారణము వ్రాయలేదు.

కాని జనరల్ టెస్టులో గెలుపొందిన పంతులుగారు 1875 దాకా ప్యాసైన స్పెషల్ టెస్టులను, వారు తప్పిన సివిల్ హయ్యరు, రెండేరెండు పుస్తకాలు చదివితే పాసైయుండేవాడినన్న రివెన్యూ పరీక్షలను పాసైకూడా మాతండ్రి వెంకటరత్నం గారు కాకినాడ కలెక్టరాఫీసులో గుమాస్తాగా చేరి సబ్ మాజిస్ట్రేటు మాత్రం కాగలిగి నారనే విషయం యీసందర్భముగా చెప్పటవాలు. అందుచేత ఉపాధ్యాయేతర ఉద్యోగముల నిమిత్తం పంతులుగారు అయిదేళ్ళపాటు చేసిన విశిష్టపరీక్షా కృషి అంతా గుమాస్తా ప్రారంభాన్ని తప్పించజాలినదికాదు. వారికి అది యిష్టములేదు వారి యిష్టవృత్తి న్యాయవాది వృత్తి. అందులో వారు రాణించలేరని మిత్రుల అభిప్రాయం. 1877 లో కూడా అనగా ప్రొవిన్షియల్ స్కూలు తెలుగుపంతులుగా చేరిపోయిన తర్వాతకూడా, మీరు ప్లీడరుగా రాణించజాలరని, ఆవృష్టి మార్చుకో వలసిందిగా చల్లపల్లి బాపయ్యగారు వ్రాశారు. వారు మొదట్లో వాగ్ధాటి లేనివారని, కాని 1883 నాటికి గొప్ప ఉపన్యాసకర్తలైనందుకు బాపయ్యగా రాశ్చర్యపోయారని చెప్పుటకు వారిలేఖను రెండోభాగంలో యిచ్చివున్నారు.

"The only defect I can find in you is that you are too mild and that your words are not at all as forcible as your writing and composition --- you cannot shine as a pleader"
4th October. 1877, Karempudi.

పంతులుగారిది పెద్దగొంతుకకాదు; ముక్కుతోమాట్లాడటం వారికి అలవాటు. మాట్లాడునప్పుడు తలవంచుకొని, అభినయంలేకుండా మాట్లాడుకుపోయేవారు. ఇవి ప్లీడరీకి పనికిరావనుకొన్నారు. అవన్నీ 1883 నరికి వదిలిపోయినవి. మంచి వాగ్ధోరణి ఏర్పడింది.

ఇటువంటి పరిస్థితులలో ఉపాధ్యాయపదవిలో ఎందునాలేని స్వేచ్ఛ, న్యాయాధిపతి పదవిలోకన్న స్వేచ్ఛయున్నదని ఆవృత్తి నెన్నుకొన్నట్లు వ్రాయుట, ఎన్నెన్నో అవకాశములను తానుగా త్యజించి బడిపంతులువృత్తి స్వీకరించినట్టు వ్రాసుకొన్నదంతా నిజముకాదు. ఆతెలుగుటీచరు పోస్టును మొదట నిరాకరించేశారు తర్వాత స్వయంగావెళ్ళి అడేకావాలని ప్రార్థించిపొందారు. అది వారేవ్రాశారు. ఆపదవి సంపాదించుటలో బసవరాజు గవర్రాజుగారి సహాయము,సలహా ఉన్నదని

లియోనార్డు తలచారు. గవర్రాజుగారు అప్పటికే ప్రొవిన్షియల్ స్కూలు కమిటీ సభ్యులు. మెట్కాఫ్‌గారికి పంతులుగారి పేరు సూచించి వుంటారని లియోనార్డు తలంపు. అంతేకావచ్చు.

పంతులుగారు ఉద్యోగాన్వేషణలో ఏడేళ్ళపాటుసుదీర్ఘమైన యాత్రచేశారు. చేసి చేసి బయలుదేరిన తావుకన్న దిగువ మెట్టుకో సరిమెట్టుకో వచ్చి చేరుకోవటమైనది. కాని ఈ యాత్ర మధ్యలో ప్రజాసేవ, సంస్కారక వృత్తి వారికెలా సంక్రమించినదో, ఆద్యంతాలలో సాగిన ఉపాధ్యాయవృత్తి నడుమవచ్చినప్రజాసేవా వృత్తికి ఎట్లు ఉపాంగముగా పర్యవసించి పనిచేసినదో కొంత చూడాలి. పంతులుగారు ఇంగ్లీషు విద్యనభ్యసించినప్పటికీ, దాని కనురూపమైన వృత్తి కొరకు వారెంతగా ఆరాటపడినప్పటికి అది వారికి లభించలేదు. ఇంట్లో చదువుకొన్న సంస్కృతాంధ్రాలే వారిపాలిటికి వృత్తి విద్య అయినది.

ప్రొవిన్షియలు స్కూలు ప్రధానోపాధ్యాయుడైన బారోదొరగారికి తెలుగు భాష నేర్పుటకుపోయి క్రైస్తవ పత్రికద్వారా పత్రికారచనాభిరుచి పెంచుకొనుటే కాక, ఇంగ్లీషు వ్యాకరణపద్ధతిలో తెలుగువ్యాకరణంచెప్పవలసివున్నందున దొర గారితో కలిగిన చర్చ మరొక ఫలితాన్ని యిచ్చినది. చిన్నయసూరి వ్యాకరణ పద్ధతికి భిన్నముగా ఇంగ్లీషు వ్యాకరణ రీతిలో సంగ్రహాంధ్ర వ్యాకరణాన్ని కోరంగిలో వుండగానే వ్రాసి ముద్రించారు. ఉత్తర సర్కార్ల విద్యాధికారిగావున్న బ్రాష్డా దొరదృష్టి నాకర్షించి ఆ సులభవ్యాకరణం స్కూళ్ళలో పాఠ్యపుస్తకమై డబ్బు సంపాదించి పెట్టింది. పాత నీతి శతకాలకుమారుగా ఆధునిక కాలానికి అనుగుణమైన నీతులను సులభ శైలిలో గీత పద్యాలలో నీతిదీపిక నొకదానిని రచించగా అప్పుడే అది పాఠ్య గ్రంథమై మరికొన్ని వందల రూపాయలు తెచ్చిపెట్టింది. బారో దొరగారికి తెలుగు నేర్పే సన్నివేశం పాఠ్యాంశాల విషయం, పాఠ విధానాలు ఎలా వుండాలో పంతులుగారు తెలుసుకొనుటకు కూడా తోడ్పడి వుందనాలి. అంతేగాక, యింగ్లీషు అధికారులతో ఎలా మెలగాలో, వారి ఆశ్రయం ఎలా పొందాలో అనే దానిలో కూడా మంచి అనుభవాన్ని కలిగించి ఉత్తరోత్తరా వారి కెంతో వుపకరించిండి. వ్రాసిన పుస్తకాలను మెట్కాఫ్, మాక్డొనాల్డు మొదలైన దొరలకు అంకితం చేస్తూ వాచకాల కుపకరించే రచనలు చేసి ఆర్జించే మార్గం దొరికించుకొన్నారు.

పురుషార్థ ప్రదాయిని మొదటి సంచిక నుంచి చందాదారుగా చేరి ఆ పత్రిక తొక్కుతున్న కొత్తదారులను శ్రద్ధగా కనిపెట్టుతున్నారు. ఆ పత్రిక ఆ పత్రికాధిపతీ మంచి ప్రచారం పొంది, గొప్ప ప్రతిష్ట కెక్కటం బాగా గమనించారు. పత్రిక చూపుతున్న సంస్కరణలు నూతన విద్యాధికులను ఆకర్షించుటను అవగాహన చేసుకొన్నారు. ధవళేశ్వరం హెడ్మాష్టరైన మూడు నెలలకే ఆ చిన్న పట్నంలో గల

పెద్దలను ఆకర్షించి బాలికా పాఠశాల పెట్టించారు. వూరి పిన్న పెద్దలను చేర్చి ఒక స్థిర సమాజం ఏర్పరచి ఆదివార ప్రసంగాలు చేస్తూ నీతిమత విషయాలను, దేశ క్షేమంకరములైన విషయాలను సంస్కరణ దృష్టితో చెప్పసాగారు. ప్రసంగంలో, ఆశువుగా పద్యాలు చెప్తూ, అవధానాలు చేసి చూపుతూ పండితుడు కవి సంస్కరణ భావశాలిగా పేరొందుతూ మరొక నెలకు వివేక వర్ధని పత్రికను ప్రారంభించారు. హెడ్మాష్టరుగా 44 రూ॥ల జీతముతోను, పాఠ్య పుస్తకాలు తెచ్చిన కొత్త ఆదాయం తోను పత్రికా స్థాపనకు పూనుకొన్నారు. అప్పట్లో పండితులెందరో ఇలాగే పత్రికలు స్థాపించేవారు. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారితో జరిగిన వివాదంవల్ల తమచేతిలో ఒకపత్రిక వుండాలనుకొన్నారు. పురుషార్థప్రదాయిని వొరవడిలో దానిని మించిమరపించవలెననే పోటీ బుద్ధితో పత్రికా స్థాపనచేశారు. మరుసంవత్సరమే నీతి చంద్రికలో భాగమైన విగ్రహతంత్రాన్ని తెనిగించి ముద్రించగా అది పండితుల దృష్టిని గొప్పగా ఆకర్షించి పెద్ద పేరుతెచ్చి, వెంటనే పాఠ్యమై ఒక్కసారిగా వెయ్యి రూపాయిలు కళ్ళ జూపింది. "అన్ని రూపాయ లొక్కసారిగా కన్నుల బడగానే ఉద్యోగమున కంటె గ్రంథ కర్తృత్వము వలననే ఎక్కువ సంపాదింప గలుగుదు నన్న ధైర్యమును, సేవక వృత్తిని విడిచి స్వతంత్ర జీవనము చేయవలెనన్న అభి లాషమును నా మనస్సు నందంకురించెను" అని వ్రాసుకొన్నారు. ధైర్యము మాట నిజమేగాని స్వతంత్ర జీవనం కోరి ఉద్యోగం వద్దను కోలేదని మాత్రం చెప్ప వచ్చును. ఆ సొమ్ము ముట్టిన తర్వాతనే Precis writing Testకు పంతులుగారు కూర్చున్నారు. చివరకు మరు సంవత్సరం రెండవ తెలుగు టీచరుగా చేరారు.

వివేకవర్ధని పత్రికనుపెట్టి, పుస్తకంపై ఇంతపెద్ద మొత్తాన్ని కళ్ళజూచిన తర్వాత వెంటనే పత్రికకొరకు ముద్రణాలయం పెట్టాలని తలచారు. చల్లపల్లి బాపయ్య గారి సాయంతో 2100 రూ. ల వాటాధనం సేకరించి, (అందులో 350 రూ॥ లు తనపెట్టుబడితో) ప్రెస్సుపెట్టి, దానిని నడిపినందుకు ఆదాయములో ఎనిమిదోవంతు జీతముగా పుచ్చుకొనేవారు. ప్రెస్సుపెట్టిన కొత్తలో నష్టమువచ్చేది. అదిచూచి వాటా దార్లు ప్రెస్సువిషయం వదిలేశారు. అనతికాలంలో ప్రెస్సు లాభాలుయిచ్చింది కాని అప్పటికే అది తనకు దాఖలుపడిపోయింది. అప్పట్లోపంతులుగారిని ఎవ్వరూ అడగ లేదు. స్త్రీపునర్వివాహోద్యమం చేపట్టినతర్వాత, ప్రతికక్షులు ప్రెస్సులో వాటాదార్లను రెచ్చగొట్టి వ్యాజ్యెంచేయించగా 1200 రూపాయలిచ్చి పరిష్కరించుకొన్నారు అందాకా వారికాసొమ్ము యివ్వాలనే బుద్ధి కలగలేదు. 1876 జులైనెలకే వివేకవర్ధని పక్షపత్రికగా ఎదిగింది. ఇంగ్లీషు అనుబంధంతోను హాస్యానుబంధంతో కూడా వెలువడసాగింది. 1876 జనవరిలో ధవళేశ్వరం కమిటీ సభ్యులతో సరిపడక హెడ్మాష్టరు పదవికి రాజీనామాచేసి రాజమండ్రి చేరుకొని ప్రెస్సును పత్రికను అభి వృద్ధిపరచుకొన్నారు. ప్రెస్సుపంతులుగారి ఆస్తిగామారినది. అయినప్పటికి బంధు మిత్రుల హితబోధచొప్పున ప్రభుత్వపాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరారు.

కమిటీస్కూలులోకంటె ప్రభుత్వపాఠశాలలో స్వేచ్ఛ ఎక్కువ. వీరేశలింగం గారివంటి హిందూమతాచారవిమర్శకునికి సంస్కర్తకు తెల్లదొరతనపు స్కూలులో మరింత ఎక్కువ. వారి ఉపాధ్యాయత్వం ఎలాసాగిందో వల్లూరు సూర్యనారాయణ రావుగారి వ్రాతలవల్ల తెలుస్తున్నది. పాతప్రబంధాలమీద, పూర్వాచారాలమీద అవ హేళనలు విమర్శలతోనే సరిపోయేదిగాని పాఠాలు సరిగా చెప్పేవారుకాదట. సంస్క రణ, విప్లవతత్వంకల ఉపాధ్యాయులు తరగతులనే తమ భావప్రచారవేదికగా మార్చ డంఇప్పటికీ కనిపిస్తున్న సత్యమే. వీరేశలింగంగారూ అంతే. ఉపాధ్యాయవృత్తి, విద్యార్థులనుంచి తనసంస్కరణాభిమానులను సంస్కరణ సైన్యాన్ని తయారుచేసు కొనుటకు మంచి సమీకరణ స్థానంగా వుపకరించింది. పాఠ్యపుస్తకాలుగా వుపక రించే రచనలు చేయటానికి, వానిని అలా ఎన్నికచేయించుకొనుటకు అవకాశాలు ఏర్పడుటకు, తద్వారా ధనార్జనకు ఉపాధ్యాయపదవి మంచిసాధనమైనది. పాఠ్యమైన గ్రంథాలు వాచకాలవల్లనేమి, సంస్కార ప్రచారకమైన సాహిత్యసృష్టివల్లనేమి పంతులుగారెంతో ధనమార్జించారు. అప్పటికీ యిప్పటికీ ఆంధ్రరచయితలలో ఎవ్వరూకూడా రచనావ్యాసంగంమీద పంతులుగారార్జించినంత ఆర్జించినవారులేరు. రచనలమీద పంతులుగారు ధనవంతులయ్యారు. మద్రాసు, బెంగుళూరు, రాజమహేంద్రవరంలోను సొంతబవంతులు కట్టుకొన్నారు. ప్రజోపయోగములైన బవంతులు నాలుగైదింటిని కట్టించి సంఘములకిచ్చారు. తన ఆర్జనను సంస్కరణల కొరకు తన పేరుకొరకు పట్టుదలకొరకు లెక్కలేకుండా కర్చుపెట్టాడు. డబ్బును వడ్డి లకు తిప్పేవారంటే ఆశ్చర్యం కలుగవచ్చు. పంతులుగారి డైరీలే అందుకు సాక్షిభూత మవుతున్నవి. వారి నెరిగియున్న రాజమండ్రిపౌరులెందరికో ఆసంగతి తెలును. ఎలా ఆర్జించారో అలా కర్చుచేసేవారు. సంతానంలేనందుకు ఆత్యాగబుద్ధి నిరంత రాయంగా సాగింది. ఆఆర్జన ఆత్యాగము లేకపోతే వీరేశలింగంగారు సంస్కర్తగా నిలదొక్కుకొనేవారే కాదనవచ్చు.

## వివేకవర్ధని తొలిసంవత్సరాలు :

పంతులుగారు తమ వివేకవర్ధని తొలిసంవత్సరాలలో ఈక్రింది విషయాలకు ప్రాధాన్యమిచ్చారు. 1874 అక్టోబరు: ప్రథమసంచిక ఆస్తిక్యము. నవంబరు సత్యము. డిసెంబరు : అహింస. 1875 జనవరి : చదువుపేరు, సద్గుణముపేరు. ఫిబ్రవరి : స్త్రీవిద్య. మార్చి: దయ్యములు మే : వైద్యులు. జూన్ : వైద్యులు జులై : ఐక్యమత్యము సెప్టెంబరు : దయ్యములు అక్టోబరు : ప్రయాణవిచారము, యథార్థజ్ఞానము. డిసెంబరు : ఆత్మ. 1876 మార్చి. ఏప్రిల్, మే : భగవద్గుణము. జూన్ : బ్రాహ్మణులు, వారివృత్తులు. సెప్టెంబరు : దయ్యములు. డిసెంబరు : సుగుణదుర్గుణములు. 1876 వ సంవత్సరాంతమువరకు ఇటువంటి అంశాలను గూర్చి వ్రాసిన వివేకవర్ధనిని, దానికి ముందుకాలాన వెలువడి, సుమారిరవై ఏళ్ళ

నడచి పంతులుగారికి నవ్యదృక్పథమును కలిగించి వారిఉద్యమములకు దారిచూపించి, వారి పత్రికకు మాతృక మూలవిరాట్టు అయివున్న పురుషార్థ ప్రదాయిని యొక్క ప్రథమ సంవత్సర సంచికలలోగల విషయాలతో తులనాత్మక పరిశీలన చేసి ఏపత్రిక ఎంతగా ఆంధ్రజాతి ఆధునికీకరణకు కృషిచేసినదో నిర్ణయించుట మంచిది.

## "పురుషార్థ ప్రదాయిని" 1872 సంచికలు

1872 జనవరి నుండి పంతులుగారు దీనికి చందాదార్లు.

జనవరి సంచిక : లంచమిచ్చే ప్రయత్నం చేశాడని శిరస్తాదారు తన క్రింది యుద్యోగిపైన ఫిర్యాదు చేశాడు. పాము కాటుకు చికిత్స, నీతి ధర్మ బోధ శ్లోకాలు వున్నాయి.

ఫిబ్రవరి : బెంగాలులో పోలీసు వారి దౌర్జన్యము. జాత్యంతర వివాహము. విధవా పునర్వివాహము. మహమ్మదీయ మతము పుచ్చుకొని వివాహ మాడుట వ్యభిచార జీవనమున కన్న మంచిది. సృష్టి-స్థితి- లయ నిరూపణము. మత విషయములు. దేహారోగ్య విషయము. వైద్య విద్యా మంజరి. సామెతలు. సమస్యలు. వింతలు. వినోదములు.

మార్చి : వార్తా పత్రికల స్థితి. మద్రాసు, బొంబాయి నగరాలలో చాలా పత్రిక లున్నవి. పత్రికా ప్రకటన వలన లాభములు- మన ఈ పత్రిక- దేశస్థులు. మచిలీబందరు గొప్ప పట్నము. విద్యావంతులు, ధనవంతు లున్నారు; వర్తకులున్నారు- ఒక పత్రికను పోషించలేరా? లంచములు : గోదావరి నది పైన ప్రయాణము.

ఏప్రిలు : శిరస్తాదారు లంచము కేసు అబద్ధము, అసత్యము- ఆయనను సస్పెండు చేసిరి. హిందూ మతము. బ్రాహ్మణులలో ఐకమత్యము లేదు. కుల భేదముల విభజన.

మే నెల : మత విషయము- ఆర్ష మత సంగ్రహము- శ్రీపరవస్తు వెంకట రంగాచార్యులుగారు- మొహరం వేషాలు. పీర్ల పండుగ. గుండము త్రొక్కుట. స్త్రీ విద్య- దేశాభివృద్ధి.

జూన్ : జాన పదుల కంటె నాగరికులు వివేకులు. వీరేశలింగముగారు తమ వ్యాసమును విమర్శించిన పరవస్తు వెంకట రంగాచార్యులు గారికి జవాబు లేఖ. "తప్పు లెన్ను వారు తమ తప్పు లెరుగరయా" అను వేమన పద్యము. Article on Astronomy సూర్య సిద్ధాంతము. మత ప్రశంస. అడ్డ బొట్లు నిలువు బొట్లు సెటైర్ ( Satire) "ఉమా పుత్రుడు"

జులై : ఆంధ్రము నందుండ వలసిన ఆవశ్యక విషయము. సైను శాస్త్ర విషయములు. చరిత్ర యితర విషయములను గూర్చి వచన రచనలు అవసరము. 'ఆంధ్ర భాషా సంజీవని' ప్రశంస. కొక్కొండ వెంకట రత్నముగారి 'నీతి చంద్రిక' 'శ్రీ రంగరాజు చరిత్ర' నవల సమీక్ష. వర్ణ భేదము-కులములు వ్యాసము-సంపాదకుని అభిప్రాయము. వీరేశలింగము గారి 'శుద్ధాంధ్రోత్తర రామాయణ' భాగము. కూచిమంచివారి 'రసిక జన మనో రంజనము' న్యాయ కథ.

ఆగష్టు : ధర్మ పురుషార్థము, అర్థ పురుషార్థము. కులాచారములు- శాస్త్ర మొక విధము, వాని ప్రవర్తన యింకొక విధముగా కనిపించుచున్నది. కామ పురుషార్థము- వేశ్యావృత్తి. గుంటూరుభోగము వాండ్రు *Querry-profession of Harlots* విమర్శ వ్యాసము. *Administration of local funds-wastage in P.W.D state of education* ఇంగ్లీషు పరిపాలన. అధికారుల డాబు దర్పములు. తాశీల్దారులు. *Dancing girls.* బుట్టయ్యపేట రాడీలు.

సెప్టెంబరు : అర్థపురుషార్థము, కామపురుషార్థము. జన్మసంగ్రహము. సంభావన. 'శుద్ధాంధ్రోత్తర రామాయణము' (కం. వీ.) *Curioos widow marriage* సంపాదకునికి లేఖ -శూద్రులనగా ఎవరు? ఇందులో చాలాజాతులున్నవి. సంపాదకుడు క్షుద్రజాతుల వారు మాత్రమే శూద్రులని 'పరాశర మాధవీయము'లో నున్నదని, అయితే, ఇప్పుడు పై మూడు వర్ణముల వారు అందరినీ శూద్రులని అంటున్నారని జవాబు వ్రాశారు.

అక్టోబరు: ధర్మ సంగ్రహము- పరవస్తు వేంకటరంగాచార్యులుగారు' విధవా వివాహము శాస్త్ర సమ్మతమనుట. Pages 7-16. good article refers to the book of Eswara chandra Vidya Sagar quotes శాస్త్రములు మహాభారతము.P .16. వేదము. చతుర్వర్గ సముదాయము. page 18-22 భాషోత్పత్తి (origin of languages etc) శుద్ధాంధ్రోత్తరరామాయణము భాగము. Lunar Hallow in chicago, rains taidai waves destruction and relief. Page 31-32 Correspondence, Missionarie & Conversiones tec. P. 33 about Hindu widows Remarrying

*Notiee*: వివేకసంగ్రహము *useful for Children* -గర్జెల రామానుజులు నాయుడుగారు

నవంబరు: పురుషార్థము, దేవ నాగర లిపిని గూర్చి Some more journals to be Started P. 12. Question of Widow remrriage in India refer to the book of Vidyasagar by నం. రి. దీ. (దీక్షితులు) Editors Note. It says the Controversy & discussionis dersirable. It will publish written in December Criticising the view that the widow marriage is desirable

P. 19-22 Article in favour of female education it Criticises the view in Andhra Bhasha sangivani N:B. The opinion of the editor the female education should compraise subjucts like domestic economy etc. P. 22-27 వీరేశలింగంగారి వ్యాకరణాన్ని విమర్శించిన రంగాచార్యులగారి జవాబు. P. 27. Text Books criticized. P.33. municipal administration P.34-37. Cristianity- preaching paraiahs being converted. paraiah crisitan and Brahmin cristian P.40. Enghish letter to the editor about the Journal at Masilipatnam The Madrassee arrogancee. Letter of Veeresalingam Dated 28-11-1872 from Korangi. Rejoinder toరంగాచార్యులు. letter of appreciation of the journal in Telugu.

డిశంబరు : శరీరారోగ్యము. కామ పురుషార్థము. విధవా వివాహము ధరత శాస్త్ర విరుద్ధంబు- Telugu article Page 5-15, 26. 11. 1872 నియోగి.

P. 15-23 విధవా వివాహభంగము ·Against widow marrage చె. శి. శా. Religious trinity, అగష్టు నెల కొరత. Girls school at masilipatnam- 7-12-1872 Missionary school

పురుషార్థ ప్రదాయిని తొలి సంవత్సరమే చేసిన కృషికి ఆ తర్వాత రెండున్నరేళ్ళ పిదప పుట్టి రెండేళ్ళ వ్యవధిలో వివేక వర్ధని చేసిన కృషికీ తారతమ్య మెంత వున్నదో పాఠకుల కిప్పటికి అర్థమైవుంటుంది. స్థానిక ప్రభుత్వోద్యోగుల లంచగొండితనముపై దండెత్తుట, వేశ్యావృత్తి, భోగము మేళములను నిరసించి మాన్పించుట అన్నవి పంతులుగారు ఉద్యమములుగా నడిపి యున్నారు. వారికి ముందే ఉమా రంగనాయకులు నాయుడుగారు పురుషార్థ ప్రదాయిని ద్వారా ఆపని చేసియున్నారు. ఇంగ్లీషు వారి పరిపాలనను విమర్శించుట పంతులుగారు ఏ మాత్రము చెయ్యజాలని పని. అట్టి పనిని పురుషార్థ ప్రదాయిని, నాయుడుగారు చేశారు. నాయుడుగారు పత్రికా నిర్వహణలో ఆర్థిక యిబ్బందులు పడ్డారు. విధవా వివాహము హిందూ ధర్మశాస్త్ర సమ్మతమని చెప్పి నిరూపించిన విద్యాసాగరుల వాదం అందులో వెలువరించారు. పంతులుగారదంతా చదివి వున్నారని తెలియుచున్నది. దానిని తాముచూడ లేదని వ్రాశారు. పురషార్థప్రదాయిని ఒక చర్చావేదికగా నడచుకొని ఒక

సత్సంప్రదాయమును నెలకొల్పినది- పంతులుగారి పత్రిక ఏకపక్షవాదము చేసిన పత్రిక. విజ్ఞాన శాస్త్ర విషయములకు పురుషార్థ ప్రదాయిని ఎప్పుడో ప్రాధాన్యమిచ్చినది. వచనరచన కావాలని చెప్పింది.

"Chiefly intended to be a concise Telugu Record of Science, Art, Antiquities, Agri- Horti- Flori Culture, Folklore, Literature, e ligion, Natural Theology, Medicine, Morality, Mythology Merchandise, Manufactures, Handicrafts, Natural History, Biogr. aphy, Law, History' Curiositier, Rarities, Recreations & C" అని పురుషార్థ ప్రదాయిని తొలి సంచికలో తన ప్రచురణప్రణాళికను వివరించినది. అట్లే అది నడచినది.

పంతులుగారి పత్రికకు సమకాలికముగా స్థాపింపబడి గూడూరి వెంకట్రావు గారిచే ప్రకాశితమగుచుండే సకల విద్యాభివర్ధని పత్రిక కూడా ఇట్టి అంశాలను గూర్చే సంస్కార విషయాలను గూర్చే వ్రాస్తుండేది.

## వివేకవర్ధని - బ్రాహ్మణ విమర్శ

'వివేకవర్ధని' 1876 జూన్ 5 సంచికలో పంతులుగారు, బ్రాహ్మణులు- వారి వృత్తులు అనేవ్యాసం వ్రాశారు. దాని సారాంశం ఈదిగువ నిస్తున్నాను.

పూర్వకాలములో బ్రాహ్మణులు తమ విధ్యుక్త ధర్మములను చేసుకొంటూ ఇతరులిచ్చిన దానములను స్వీకరించేవారు. ఇటీవల బ్రాహ్మణులు తమ విధ్యుక్త ధర్మములను జరుపకుండా యాచననే వృత్తిగా పెట్టుకొని జీవిస్తున్నారు.

ఈయాచన లనేకవిధములుగా చేస్తున్నారు. అన్నవస్త్రాలను, ధనమును ఇలాగ సంపాదిస్తారు. అనేక వేషాలువేసి తమ జీవనం గడుపుకొంటూనే తమకు అన్నంలేదు, కట్టుబట్టలులేవని, త్రాగడానికి చెంబులేదని నటిస్తూ అనేక విధాలుగా సంపాదిస్తున్నారు. బ్రాహ్మణపురోహితులు మొదలైనవారు కర్మలపేరుతో తమకు కావలసిన వస్తుసంబారములను, వస్త్రఖండములను తీసుకుంటారు. దక్షిణలనేపేరుతో డబ్బు పుచ్చుకుంటారు.

వివాహాలలో, అపరకర్మలలో యజమానిని పీల్చిపిప్పిచేస్తారు. యజ్ఞాలు చేస్తామని చందాలు పోగుచేస్తారు. గుళ్ళు కట్టిస్తున్నామని చందాలు పోగుచేస్తారు. ఇలా అనేకవిధాలుగా ధర్మకార్యాలకని సొమ్ము పోగుచేస్తారు. దానిని స్వప్రయోజనాలకు వినియోగించుకుంటారు మద్యపాన దుకాణాల లెక్కలుచూస్తే అందులో త్రాగేవారిలో బ్రాహ్మణులే అధిక సంఖ్యాకులుగా కనబడతారు.

ఇక పీఠాధిపతులు, ఆచార్య పురుషులు చేసే దుర్మార్గాలకు మితిలేదు. వేద శాస్త్రాలు గాని, మత గ్రంథాలుగాని వీరు చదవరు, ఇతరులకు బోధించరు. వెండి కంచాలలో భోజనము చేస్తారు. ఏనుగులు, గుర్రాలు, పల్లకీలు, పరివారముతో భోగ విలాసాలు అనుభవిస్తారు.

వీరేశలింగముగారు "రాజశేఖర చరిత్ర"ను "వివేకవర్ధని"లో ప్రకటించారు. అందులో బ్రాహ్మణులు చేసే దుర్మార్గాలు వర్ణించారు.

బ్రాహ్మణులను దూషించడం ఆ రోజులలో క్రైస్తవ మిషనరీలకు పరిపాటిగా వుండేది. బ్రహ్మసమాజ నాయకులైన కేశవ చంద్రసేను గారు కూడా బ్రాహ్మణులను విమర్శించారు. మద్రాసు సంఘ సంస్కార నాయకుల కిది ఇష్టం లేదు. Letter from J. Harrison to Secretary, Madras Corresponding C. M. S. January 22-1862 Bezwada - CMS (Leonard)

## బ్రాహ్మణులు వారి వృత్తులు

Published 5-6-1876 issue of Vivekavardhani is the 1st sustained attack on Brahmins Condemning for adopting profession of beggars. Although in ancient times the acquisition of property by begging was acceptable, under catastrophic conditions (ఆపద్ధర్మం), in modern times this was prohibited according to the sayings of Madhava. "Some Brahmins put on costumes and do sacrifices and then collect money for their own pleasures" He attacked Brahmins both in the ancient and in the present. Veerasalingam continued listing many deceptions practiced by brahmins on an unwary society.

(వీరేశలింగ కవికృతులు Vol. viii-428-438)

He ended by saying that the Gurus were even more degraded than the ordinary Brahmins.

Some of them without attending to their duties, go around the villages, with elephants, horses, followers. When villagers accompany them the Gurus say they will recite incantations (Mantras). But devotees must give donations and presents themselves. The Gurus speak lies and terrify these people saying that they will outcaste rich and poor alike unless money is offered.

Attack on Brahmins was a common feature of Christian missionaries. preaching. Such attacks were also made by Brahmo samaj faction that followed Kesava Chandra Sen. (Sen criticised Brahmins for wearing sacred thread.) —Leonard P.84

ఇది వీరేశలింగంగారి ప్రత్యేకత. బ్రాహ్మణుల మీద దాడికి వారే నాంది పలికారు. బ్రాహ్మణేతరుల కిందులో పంతులుగారు అగ్రతాంబూలం దక్కనివ్వలేదు. మిషనరీల మెప్పును కోరి చేసిన పని ఇది. పంతులుగారి యీ ధోరణే వారంటే స్టి పార్టీకో అభిమానాన్ని సంపాదించి పెట్టిన ఒక కారణం అనవచ్చు.

## ప్రార్థన సమాజం

వీరేశలింగంగారి జీవితంలో 1878 చాలా ముఖ్యమైన సంవత్సరం. ఆయన యొక్క ప్రజాసేవకు, పేరు ప్రతిష్ఠలకు కారణములైన అనేక సంఘటనలు జరిగినవి. వీరేశలింగంగారి జీవితం "వివేకవర్ధని" స్థాపనతో ప్రారంభమైనది.

ప్రార్థనా సమాజ స్థాపన చాలా ముఖ్యమైన విషయం. రాజమహేంద్రవరంలో కలకత్తా, బొంబాయి మొదలైన పట్నాలలో వలే ప్రతివారము దైవ ప్రార్థన చేసే సమాజమది వరకులేదు. వీరేశలింగంగారి మిత్రులైన బుర్రా రాజలింగంగారు మన ఊరిలో కూడా ఒక ప్రార్థనా సమాజం స్థాపించాలని ప్రతిపాదించగా పంతులుగారు తమ మిత్రులతో కలసి 1878లో తమ గృహంలోనే ప్రార్థన సమాజం స్థాపించి ప్రతి ఆదివారము ప్రాతఃకాలమున దైవ ప్రార్థన చేసుకోవడం ప్రారంభించి ఇతరులు పరిహసిస్తారని తలుపులు వేసుకొని ప్రార్థనలు జరిపించేవారు. 1879లో సమాజమును బహిరంగముగా విజయనగరం మహారాజావారి బాలికా పాఠశాలకు మార్చినారు. వందలకొలది ప్రజలు పాల్గొన సాగారు.

ప్రార్థన సమాజంలో పంతులుగారు, బుర్రా రాజలింగంగారు, బసవరాజు గవర్రాజుగారు, ఏలూరి లక్ష్మీనరసింహంగారు, వారి సన్నిహితులైన బయ్యపునేని వెంకట జోగయ్యగారు, కన్నమశెట్టి పార్థసారధినాయుడుగారు మొదటి సభ్యులు. పార్థసారధి నాయుడుగారు కీర్తనలు చదివేవారట. పంతులుగారు ధర్మోపన్యాసములు వ్రాసి చదివేవారట ఇవి "వివేక వర్ధని"లో ప్రకటింపబడేవి. ఈ ప్రార్థన సమాజ విధానము కలకత్తా బ్రహ్మ సమాజమువారు కేశవ చంద్రసేనుగారి నాయకత్వము క్రింద జరిగే బ్రహ్మోపాసన మాదిరిగా నుండేది. అందులో లిటరరీ క్రైస్తవ చర్చివారి విధానా లుండేవి.

1880–82 మధ్య ఏలూరి లక్ష్మీనరసింహంగారు ప్రార్థన సమాజములో చాలా పలుకుబడిగల సభ్యులుగా వున్నారు. విద్యార్థులు ఆయన చెప్పు చేతులలో వున్నారు. 1881 సెప్టెంబరులో Theistic school స్థాపించారు. మరికొన్ని పాఠశాలలు స్థాపించారు. ప్రార్థనా సమాజము ప్రబలమగు చుండుట, విధవా వివాహ సమాజ కృషిని చూచి విజయనగర మహారాజావారి బాలికా పాఠశాల నియ్యక పోయారు. దానితో ప్రార్థనా సమాజ సభలు ఏలూరివారి ఆస్తిక పాఠశాలలోనేజరిపించే

వారు. శివనాథశాస్త్రిగారికి అందే బస ఏర్పాటు చేసిరి. ప్రార్థనా సమాజము తరపున విద్యార్థులు విజృంభించి పేదల పేటలలో రాత్రి పాఠశాలలు పెట్టి పేదలకు విద్యా దానము చేసిరి. ప్రార్థనా సమాజము పక్షమున పేదల కన్నదానములు చేసెడివారు. ఆస్తిక పాఠశాలా నిర్వహణలో ఏలూరి వారికి పంతులుగారికి త్రోవలు విభేదించినవి. మనస్పర్థలు కలిగినవి. ప్రార్థనా సమాజము కూడ కొలది కాలములో చీలిపోయినది. పంతులుగారు ప్రార్థనా సమాజమునకు భవనం నిర్మించారు.

## వివేక వర్థని ద్వారా ప్రచారము

పంతులుగారు ఆస్తిక్యము సత్యము అహింసవంటి సాధు బోధతో సాత్వికనీతి ప్రబోధముతో పత్రికను ప్రారంభించి స్థానికముగా మొదట నడిపిన ప్రచారోద్యమము వేశ్యాసమస్య. తాముప్లీడరు గుమస్తాగిరి మానుకొనుటకు కారణమైన సమస్యమీదేవారు దండెత్తారు. అప్పటి రాజమండ్రిలో న్యాయవ్యవస్థ మొత్తము – న్యాయాధిపతులు, న్యాయవాదులు, స్థితిపరులైన వ్యాజ్యకర్తలు– వేశ్యావ్యవస్థతో పెనవేసుకొని పోయి వున్నది. ఎక్కడెక్కడ వేశ్యలు రాజమండ్రికే చేరుకొన్నారట. న్యాయవాదుల పేరను, మోతుబరులపేరను బోగము మేళాలు సమాజములు ఏర్పడివున్నవి. బోగము మేళాలు చేయించి సాని ఆటకత్తెలకు బహుమానాలు చదివించుట గొప్పగా భావించ బడుతున్నది. సానిపిల్లలకు కన్నెరికముపెట్టుట గొప్ప. కోర్టులో న్యాయము వేశ్యామణి సిఫారసులకు లోబడియున్నదట. 1875 జూన్‌నెల లగాయతు ఈ వేశ్యా వ్యతిరేకో ద్యమము ఎత్తుకొన్నారు. అదివారికి చాల వ్యతిరేకతను తెచ్చిపెట్టింది. వేశ్యల మేళా లలో కానుక లియ్యరాదని శపథపత్రాలు మీద సంతకాలు చేయించారు. ఈ వేశ్యా వ్యతిరేక ఉద్యమము చాయలేవో ధవళేశ్వరం ఆంగ్లోవర్నాక్యులర్ స్కూలు కమిటీ సభ్యులమీద ప్రసరించి పంతులుగారికి కొంత బాధ కలిగించి, అక్కడ వారు మాను కొన్న కారణాలలో ఒకటిగా వున్నదనిపిస్తున్నది. ఇదే వుద్యమం ప్రచారం 1878 దాకా సాగినది.

వివేక వర్ధని జీవితములో 1878 సంవత్సరం ఆద్యంతమూ రాజమండ్రి కోర్టు న్యాయాధికారులపై దండయాత్రా సంవత్సరముగా పాటించిన దనవచ్చును. రాజమండ్రి సబ్ మాజిస్ట్రేటు ఒకరు చీటికీమాటికీ బోగము మేళాలు పెట్టించి ఆట కత్తెలైన వేశ్యలకు కానుకలిప్పించే ఒసగుల పదతి పెట్టి వేశ్యలకు ఆకానుకలలో కొద్దిభాగమిచ్చి, మిగత పెద్దమొత్తమును తాను పొందుచుండగా, ఒసుగుల నివ్వ రాదని వేశ్యా వృత్తిని పోత్సహించరాదని వ్యాసములు వ్రాసి ఒసగులు మాన్పించు కట్టడ జేసి మేజిస్ట్రేటు దుష్టార్జనకు అడ్డుపడి సఫలీకృతులయ్యారు వేశ్యాపాఠశాలలు మూతపడ్డాయి.

ఆ పిమ్మట వెంటనే జిల్లా మునసబుగా వచ్చిన పోలూరి శ్రీ రాములుగారి మీద చైత్ర మాస పత్రికలో ఆయన లంచములు పుచ్చుకొనుట సూచనచేశారు. 'మద్రాసు న్యూస్ పేపర్' అనే పత్రిక మే నెల సంచికలో రాజమండ్రి జిల్లా మునసబు పోలూరి శ్రీ రాములుగారు రెండు కేసు లొకేసారి ఒకటి తాను, ఇంకొకటి తన గుమస్తా విచారిస్తున్నాడని 'వివేకవర్ధని' చేసిన విమర్శను ఉల్లేఖించినది.

రాజమండ్రిలోని కొందరు న్యాయవాదులు శ్రీరాములు గారిని గూర్చి జిల్లా జడ్జి వాలెస్ గారికి కంప్లెయింటు చేశారు. వీరేశలింగంగారికి స్టేటుమెంటు వ్రాసి యిచ్చారు. శ్రీరాములుగారు తన వియ్యంకుడైన వకీలు చిత్రపు కామరాజుగారి ద్వారా లంచాలు పుచ్చుకుంటున్నాడని ఫిర్యాదు చేశారు. ఆ ఫిర్యాదులో బసవరాజు గవర్రాజుగారు కూడా వున్నారు. గవర్రాజుగారు కామరాజుగారి తోడల్లుడు. శ్రీరాములు గారు కామరాజుగారి చేత తీర్పులు వ్రాయించుకుంటాడని కూడా ఫిర్యాదు. కామరాజు గారి దస్తూరిలో నున్న చింపివేసిన కాగితం ముక్కల తీర్పు లోనివి. జిల్లా జడ్జికి సమర్పించగా, వాటిని శిరస్తాదారు ఆఫీసులో మార్చివేశాడు. దీనిని గూర్చి విచారణ జరిగింది. "మద్రాసు స్టాండర్డు" పత్రిక 1878 అక్టోబరు 30 వ తేదీన దీనిని గూర్చిన వివరాలు ఇచ్చింది. ఈ వ్యవహారంలో వీరేశలింగంగారు ప్రముఖ పాత్ర వహించారు. తీర్పు ముక్కలు అంటించిన మరియొక తీర్పు కాగితమును జడ్జి కివ్వగా నేరం ఋజువైనది. చిత్రపు కామరాజుగారు విషం పుచ్చుకొని చనిపోయిరి. శ్రీరాములుగారు ఆకస్మికంగా చనిపోయిరి. శిరస్తాదారైన రొజారియాదొర, రికార్డు కీపరు పొల్లా ప్రగడ వెంకన్న ఉద్యోగములు కోల్పోయిరి. జిల్లా మునసబు, గవర్నమెంటు వకీలు చచ్చిపోగా, అప్పటి కోర్టు ఉద్యోగులంతా నాశనమైనట్లయింది. పంతులుగారికి ఇదెంతో అద్భుతమైన విజయం. అఖండమైన విజయం. శత్రువు లాయనంటే వణికిపోయారు. వివేకవర్ధని అధికారులకు గర్భనిర్భేదకమైపోయింది. పంతులుగారికి తిరుగు లేక పోయింది.

1878 డిశంబరు 'వివేక వర్ధని'లో జిల్లా జడ్జి వాలెస్‌గారు పరీక్షలో కృతార్థులు కాని వారికి తమ శిరస్తాదారు గుమస్తాలు సిఫారసును బట్టి పట్టాలివ్వడ మును గూర్చి విమర్శించిరి. 1879లో విచారణ జరిపించి హైకోర్టువారు ఆ పట్టాలు రద్దు చేశారు. (ఎం. ఎన్. ఎన్. ఆర్. జనవరి1879.) 1879 ఫిబ్రవరి 29 వ తేదీన 'మద్రాసు స్టాండర్డు' దీనిని గూర్చి వ్రాసినది. కృష్ణాజిల్లా జడ్జి కెల్సాల్ విచారణ చేశారు. ప్లీడరుపట్టాల రద్దు ఎంతో సంచలనంకలిగించింది. రాజమండ్రి కోర్టువ్యవస్థ పంతులుగారికి తలవంచింది.

పైవిధంగా 'వివేక వర్ధని' ద్వారా వివేశలింగముగారు జర్నలిస్టు హోదాలో ప్రజాసేవ చేశారు. (లియోనార్డు) వీరేశలింగంగారికి గొప్ప కీర్తి వచ్చినది.

## సంస్కరణ సమాజం :

కోర్టు వ్యవస్థపై దాడి నడుపుతూనే వేరొక ప్రక్క 1878 సెప్టెంబరు 8న సంఘ సంస్కార సమాజమును స్థాపించి తొలి యుపన్యాస మిచ్చారు 22-9-78న రెండవ ఉపన్యాసము నాటికి తల్లి మరణించారు. సంస్కరణ సమాజముచిన్న చిన్న పనులెత్తుకొన్నది. పెండ్లి సమయాలలో గృహ యజమాని ప్రత్యక్షముగ బంధుమిత్రుల ఇళ్ళకు వెళ్ళి భోజనమునకు ఆహ్వానము ప్రత్యేకముగా చేయవలసి యుండేది. అయితే శుభలేఖలను పంపించితే చాలని ప్రయాస తీసుకొని స్వయంగా పిలిచే ఆచారాన్ని మాన్పటానికి సభలు చేశారు. ఆ మార్పు తెచ్చారు. చనిపోయిన వారి శవాలను మోసి తీసుకు వెళ్ళే పద్ధతి మృతులకు గౌరవదాయకముగా లేదని శవ వాహక వృత్తి నవలంబించే వారిచే మోయించుట కూడ బాగులేదని, వారడిగే రుసుము చిన్న కుటుంబాలు భరించలేనివిగా వున్నవని, సభలు చేశారు. శవము వెంట శ్మశానమునకు వైదికులు, నియోగులు అందరును కలిసి వెళ్ళవలెనని నచ్చ జెప్పారు. శవపేటికల నుపయోగించటాన్ని ప్రవేశపెట్టారు. తామే శవాలను మోయ బూనుకొని రుసుములు పడగొట్టారు. ఇట్టి చిట్టి చిట్టి సంస్కరణలతో ప్రారంభించిన సమాజం, ప్రార్థనా సమాజం ద్వారా వేరొక ప్రక్క పలుకుబడిని పెంచుకొంటూ వచ్చినది. అంతట చల్లపలి బాపయ్యగారు వితంతు వివాహాలకు సమాజము పూను కోవాలని పదే పదే ప్రతిపాదింప జొచ్చారు. బాపయ్యగారు సంస్కృతంవచ్చినవారు శాస్త్ర సంగతులు తెలిసినవారు. వితంతు వివాహం గూర్చి పంతులుగారి ఉపన్యాస రచనలకు బాగా తోడ్పడిన వారని స్వీయ చరిత్రలో వ్రాశారు. వారు పట్టుబట్టగా పంతులుగారు వితంతు వివాహ ఉద్యమాన్ని తలపెట్టవలసి వచ్చినది.

## స్త్రీ పునర్వివాహ ఉద్యమము

వీరేశలింగం పంతులుగారు స్త్రీ పునర్వివాహ ఉద్యమమునకు 1879లోనే అంకురారోపణ జరిగిందని "స్వీయ చరిత్రము" లోను రాజమహేంద్రవర స్త్రీ పున ర్వివాహ సమాజ చరిత్రలోను వ్రాసి యున్నారు.

ఈ ఉద్యమారంభమును గూర్చి వ్రాస్తూ మొదట చిన్న చిన్న సంస్కరణలు చేస్తూ తరువాత పెద్ద సంస్కరణలు చేద్దామనితామాలోచించినామని, కానిచల్లపల్లిబాప య్యగారును, బసవరాజు గవర్రాజుగారును చిన్నతనంలో వితంతువులైన స్త్రీలకు పునర్వివాహము చేయు సంస్కరణలు చేద్దామని ప్రోత్సహించినారని, అందులోని చిక్కులన్ను వారికి చెప్పి దానికి వారు సంసిద్ధులైతేనే అది ప్రారంభించాలని తాము, తమ మిత్రులు స్త్రీ పునర్వివాహ సమాజమునేర్పచితి మని, అందులో 16 మంది సభ్యులని, అందరు ఉత్సాహపరులని ఏలూరి లక్ష్మీనరసింహంగారు చాలా ఉత్సా హం చూపిరని వ్రాసిరి.

తాము 1879 జులై ఏడవ తేదీ సభలో మొట్టమొదట స్త్రీ పునర్వివాహమును గూర్చి చేసిన ఉపన్యాస సందర్భము వివరించిరి. అయితే, లియోనార్డు వీరు "స్వీయ చరిత్ర"లో వ్రాసిన అంశములను విమర్శించి 1879లో ఉపన్యాసాలు జరిగినవేగాని తర్వాత రెండున్నర ఏళ్ళ వరకు అనగా 1881 ఏప్రిల్ వరకుకూడా అది కార్యాచరణ రూపం దాల్చలేదని విమర్శించాడు. వితంతు వివాహ సమస్యను ఈశ్వర చంద్ర విద్యా సాగరుల 1855 జనవరిలో తీసుకొని 1856 జులై 16 నాటికల్లా రాజ శాసనం చేయించి, 1856 డిసెంబరు 7 వ తేదీ సరికి మొదటి వితంతు వివాహం చేయించియున్నారు. 1879 ఆగష్టు, సెప్టెంబరు నెలలలో రెండవమూడవ ఉపన్యాసాలు జరిగినవి. పంతులుగారు మొదటి యుపన్యాసములోనే వితంతు వివాహము శాస్త్ర సమ్మతమని నిరూపించినట్లు వ్రాసుకొన్నది నిజం కాదని మూడవ ఉపన్యాసములోనే శాస్త్ర చర్చ జరిగినదని లియోనార్డు వ్రాశాడు.

1879 ఆగస్టు 3 వ తేదీన రెండవ ఉపన్యాసము చేశారు.

## స్త్రీ పునర్వివాహ సభా నాటకము (అసంపూర్ణము)

పంతులుగారు వ్రాసిన "స్త్రీ పునర్వివాహ సభా నాటకము" (అసంపూర్ణము) 1879 ఆగష్టు నెల "వివేక వర్ధని"లో ప్రథమాంకము ప్రకటింపబడినది. "స్వీయ చరిత్ర"లో దీని ప్రశంస లేదు. తోలేటి సుబ్బారావుగారి "వీరేశలింగకవి చరిత్ర"లో దీనిని గూర్చిన కొన్ని వివరములు, అందలి కొన్ని పద్యములు ఉదహరింపబడినవి.

ఈ ప్రథమాంకములో చిన్నతన మందే భర్తృ విహీనలైన కాంతల దయనీయమైన స్థితి వివరింపబడినది. ఆసియా ఖండములోని పదహారు దేశములలోను హిందూ దేశమునందే స్త్రీ పునర్వివాహము లేదని, దానివల్ల అనర్థములు కలుగుచున్నవని స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమనియు, విజ్ఞులు పూనుకొని స్త్రీల దుస్థితి బాపవలెనని నాటకమున ప్రబోధించినారు. (రమాపతి రావుగారి "వీరేశ లింగం పరిశీలన" పుటలు : 94-95.)

1879 సెప్టెంబరులో మూడవ ఉపన్యాసము జరిగినది.

రాజమహేంద్ర వరములోని సనాతన ధర్మవాదులైన పండితులు పంతులుగారిని ప్రతిఘటించిరి. అల్లరి చేయుటకు ప్రయత్నించిరి.

## "వివేక దీపిక" (అసంపూర్ణ నాటకము)

పంతులుగారు 1880 సంవత్సరములో వ్రాసిన నాటకము "వివేక దీపిక" మూడంకములు మాత్రమే రచింపబడి ప్రకటింపబడినది. చిన్నప్పుడే విగత భర్తృకలైన స్త్రీల బాధలు వర్ణించిరి. స్త్రీ పునర్వివాహముల ఆవశ్యకత నిరూపించును. ఈ నాటకములో రెండు, మూడు అంకములలో స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమా కాదా అను చర్చలున్నవి. కథయేమీ లేదు.

సీతారామయ్య సుభద్రమ్మగార్ల అయిదుగురు కుమార్తెలలో ముగ్గురు చిన్నతనమందే వితంతువులై పుట్టింట చేరిరి. తల్లిదండ్రులు తండ్రి కూతుళ్లు, తల్లి కూతుళ్ళ సంభాషణలో వితంతువుల దుస్థితి వర్ణింపబడినది.

ఈ నాటకము ప్రదర్శన యోగ్యము కాదు. దీర్ఘములైన స్వగతములలో స్త్రీ పునర్వివాహోపన్యాసములు దాని కథా గమనము కాదు. పంతులుగారి అభిప్రాయములు పాత్రల నోట చెప్పిస్తారు. పాత్రలు తమ స్థాయికి మించిన విషయములను గూర్చిన స్వగతములలో శాస్త్ర విషయములు ప్రసంగించి ఉపన్యసింతురు. 13 సంవత్సరముల ప్రాయముగల శ్యామలాంబ స్త్రీ పునర్వివాహమును గూర్చి స్వగతములో శాస్త్ర విషయము ప్రసంగించును.

తృతీయాంక ప్రథమ రంగమున ప్రతిపక్షీములు న్యాయవాదులను జయించుటకై ఆలోచనలు చేయుట వర్ణింపబడినది. వీరరాఘవరావు అందలి న్యాయవాది. శ్రీరామ పండితుడు ప్రతిపక్షవాది. వీరరాఘవరావుగారి ప్రసంగము ఆరు పుటలున్నది. తృతీయాంకమున శాస్త్ర చర్చ జరుగును. నాటకము నిలిచిపోయినది.

వ్యభిచారము, భ్రూణ హత్యలు, లేచిపోవుటలు, అశ్లీలములైన ప్రసంగములు, జుగుప్సాకరములైన సన్నివేశములు నాటకము నిండా యున్నవి. ప్రతి చిన్న విషయములోను భరించలేనంత అసహ్యంగా చిత్రించినారు. (రమాపతిరావు "వీరేశలింగం పరిశీలన" పుట : 103) వితంతూద్వాహ సమస్యపై పంతులుగారు వ్రాసిన నాటకాలు అసంపూర్ణాలుగానే మిగిలిపోయాయి. ఒక్కటీ పూర్తికాలేదు.

## మధ్యలో దృష్టి మళ్ళింది

1880 సంవత్సరములో పంతులుగారు తమ దృష్టిని వితంతు వివాహ సంస్కరణ నుండి ఇతర సంస్కరణలవైపునకు మరలించారు. వితంతు వివాహ ప్రచారమునకు 1880 సంవత్సరము సెలవు సంవత్సరమన వచ్చును. (ఆయన "వివేక వర్ధని"లో హిందువుల సంఘ దురాచారాలను గూర్చి వ్రాయడం ప్రారంభించారు. జంతు బలిని గూర్చి, మద్యపానమును గూర్చి, యాచనను గూర్చి, మనుష్యులు కాలమును నిరుపయోగ పరచుటను గూర్చి వ్యాసాలు వ్రాశారు. స్త్రీల విద్యను గూర్చి, కన్యాశుల్క దురాచార నివారణను గూర్చి వ్రాశారు. సంఘ దురాచారాలు నిర్మూలించడానికి విద్యను నీతిని ప్రబోధించాలని వ్రాశారు. 1880లో వీరేశలింగంగారు రాజమహేంద్రవరం పురపారిశుధ్య పరిశీలనను గూర్చి వ్రాశారు. అయితే, పూర్వం వలె వ్యక్తులను పురస్కరించుకొనిగాక స్థితిగతులను, ఆచారములను గూర్చి వ్రాశారు. రాజమహేంద్రవరములోని ఆంగ్లేయ ఉద్యోగుల, విద్యావంతుల మెప్పుకోరి అలా వ్రాశారని లియోనార్డు వ్రాశాడు.

1880 వ సవంత్సరంలో వీరేశలింగంగారు ప్రార్థన సమాజంలో హిందూ మతమును గూర్చి రెండు ఉపన్యాసా లిచ్చారు. ఆది శంకరాచార్యుల అద్వైతము నిరీశ్వర వాదమునకు దగ్గరగా యున్నదని విమర్శించారు. హిందువుల కులములను గూర్చి ఉపన్యసిస్తూ పాశ్చాత్యులు విమర్శించే రీతిగానే అది (Primitive)అనాగరిక మన్నారు. జనసామాన్యము తమ ఎదుట ఒక అస్పృశ్యుడు పడిపోయినా రక్షింపరని విమర్శించారు. ("స్వీయచరిత్ర" లో ఒకఅస్పృశ్యుని తమ భార్య రక్షించిన సంగతి వ్రాశారు.) మళ్ళీ దృష్టి పెట్టారు-దీక్షవహించారు. 1881 జనవరిలో పంతులుగారు కాకినాడకు వెళ్ళి వింతతు వివాహముపైన ఉపన్యసించారు.

1881 మార్చినెలలో వితంతు వివాహములను అంగీకరించవలసినదని వీరేశలింగంగారొక అర్జీని తయారు చేసి శంకరాచార్యులవారికి అందజేశారు. వారి తరఫున ఆద్దేపల్లి కృష్ణశాస్త్రి అత్యధిక సంఖ్యాకులు కావాలంటే అంగీకరిస్తారని జవాబు చెప్పి తప్పు కొన్నారు.

## పండిత శివనాథ శాస్త్రిగారిరాక

1881 ఏప్రియల్ లో స్త్రీ పునర్వివాహ ఆంతరంగిక సమాజాన్ని స్థాపించి కార్యాచరణకు ప్రయత్నించారు. సాధారణ బ్రహ్మసమాజ ప్రధాన ప్రచారకులైన పండిత శివనాథ శాస్త్రిగారు రాజమండ్రివచ్చి యిచ్చిన ఉత్తేజముతో విద్యార్థులు రాత్రి పాఠశాలలు పెట్టి కార్యశూరులైనట్లే, 1879లో మొదలు పెట్టిన విధవా వివాహ ప్రచారము కార్యరూపము ధరింపనట్లు యత్నించవలెనన్న దృఢ దీక్షకూడా స్త్రీ పునర్వివాహ సమాజములో కలిగినది.

1881 ఏప్రిల్ నెలలో వంగదేశ బ్రహ్మసమాజ నాయకుడైన పండిత శివనాథ శాస్త్రిగారు రాజమహేంద్రవరం వచ్చి ఉపన్యాసాలిచ్చారు. అప్పుడు ప్రార్థనా సమాజనాయకులే ఇక్కడి బ్రహ్మసమాజ నాయకులు అందులో ప్రముఖులు వీరేశలింగంగారు, ఏలూరి లక్ష్మీనరసింహంగారు, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు. ఆత్మూరివారు ఏప్రిల్ లోనే జిల్లామునసబు హోదాలో మళ్ళీ రాజమండ్రికి చేరుకున్నారు. ఆయన బందరు వైశ్యుడు. గ్రాడ్యుయేటు, లా చదివారు. ప్లీడరుగా ప్రాక్టీసుచేసి జిల్లా మునసబు పదవిపొందారు. ఆయనపైన కాకినాడలోని పైడా రామకృష్ణయ్యగారికి వైశ్యులైనందున చాలా అభిమానము సమ్మకము. శివనాథ శాస్త్రిగారి ఉపన్యాసాలు విద్యార్థులలో చాలా ఉత్సాహము ఆవేశము కలిగించినవి. శివనాథ శాస్త్రిగారు కులభేదాలు కులాచారాలు పాటింపరు. ఈ వూరిలోని ముగ్గురు నాయకులు వాటిని పాటించడం చూచి ఆశ్చర్యపడ్డారు. ఆయనను లూథరన్ మిషనరీ స్కూలువారు విందు కాహ్వానించగా ఆయన వెళ్ళారు. పట్టణంలో బ్రహ్మ

సమాజ ఉద్యమం దెబ్బతింటుందని ముగ్గురు నాయకులు ఆయనను వారించారేగాని తమ యిళ్ళవద్ద బసఏర్పరచలేకపోయారు. భోజనం పెట్టలేకపోయారు. ఆయనకు విజయనగరం మహారాజావారి బాలికా పాఠశాలలో బసఏర్పరచి భోజనం పంపేవారు. ఈసంగతులు శివనాథశాస్త్రిగారు వ్రాశారు.

1881 ఏప్రిలులో స్త్రీ పునర్వివాహ ఆంతరంగిక సమాజం ఏర్పరచారు. అందులో ఆత్మూరి లక్ష్మినరసింహంగారు, వీరేశలింగంగారు, బసవరాజు గవర్రాజుగారు, కొమ్మురామలింగశాస్త్రి, న్యాపతి సుబ్బారావుగారు సభ్యులు. ఏలూరి లక్ష్మినరసింహంగారిని చేర్చలేదు. అప్పటికి వారితో బైటికవిరోధించలేదు. 1879లో వారెంతో ఉత్సాహం చూపినట్లు వ్రాశారు. శివనాథశాస్త్రిగారి దృష్టిలో ఏలూరివారు కూడా స్థానిక బ్రహ్మసమాజ నాయకుడుగా ప్రాధాన్యం వహించియున్నకాలమేమరి. ఇది ఆలోచించాల్సిన సంగతి.

ఈ రహస్యసంఘము ఏర్పాటైన తరువాత పెండ్లికూతుళ్ళకోసం అన్వేషణ ప్రారంభించారు. ఆత్మూరి లక్ష్మినరసింహంగారు తమ కోర్టు ఉద్యోగిని పంపించారు. సోమంచి భీమశంకరంగారనే కాలేజి విద్యార్థి తిరువూరునుంచిపెండ్లికూతుర్ని తెచ్చారు. వరునికోసం అన్వేషించారు. ఇదివరకు వితంతువులను పెండ్లాడుతామన్న ముప్పదిమంది విద్యార్థులు వెనుకకుతగ్గారు. అంతలో వీరేశలింగం పంతులుగారు లోగడ తమ ఇంటిలోవుండి తమ ప్రెస్సులో పనిచేసివున్న గోగులపాటి శ్రీరాములుగారి మొదటి వివాహం 1881 డిశంబరు 11వ తేదీన జరిపించారు.

# తొలి వితంతు వివాహాలు - వాని రూపురేఖలు

తొలి వితంతు వివాహపు వధూవరులు కృష్ణామండలంవారే. వరుడు గోగులపాటి శ్రీరాములు. స్వగ్రామం బందరువగ్గర మల్లవోలు. చిన్నతనంలోనే ఇల్లువిడిచిపెట్టాడు. రాజమండ్రికి చేరుకొని పంతులుగారింట్లో ప్రవేశం సంపాదించాడు. 1876లో మెట్రిక్ ప్యాసయ్యాడు. వివేకవర్ధని ప్రెస్సులో ఆరురూపాయిల జీతం మీద పనిచేసేవాడు. పంతులుగారి తల్లికి ప్రేమపాత్రుడయ్యాడు. 1879 లో విశాఖ పట్నంలో పోలీసుడిపార్టుమెంటులో నెలకు 15 రూ.ల ఉద్యోగమయింది. వివాహం చేసుకొన్నాడు. 1881 నవంబరు 9వ తేదీన పదినెలల పిల్లవాణ్ణి దిగవిడిచి ఆమె మరణించింది.

1881 నవంబరు 25 తేదీకి తొలివితంతు వివాహపు వధువును తిరువూరు దగ్గర రేపూడినుంచి రహస్యంగా రాజమండ్రికి చేర్చారు. వితంతువివాహం మేము చేసుకొంటామంటే మేము చేసుకొంటామని ముందుకువచ్చి పేర్లిచ్చిన ముప్పది మంది విద్యార్థివీరుల్లో ఏవొక్కడూ తీరా నిలబడ్డాడుకాడు. అంతాజారుకొన్నారు. అప్పుడే మృతురాలికి అపరకర్మలు ముగించుకొని వున్న గోగులపాటి శ్రీరాములు పంతులుగారి మనసులో మెదిలాడు. చిన్నతమ్మునివంటి శ్రీరాములు పంతులుగారి మాట దక్కించడానికి సమయానికి దొరికాడు. అతణ్ణి ఒప్పించి, రాజమండ్రి రప్పించి, మొదటిభార్యా సంతానాన్ని సాకటానికి తాము పూచీపడి, తిరువూరు వితంతుకన్యనిచ్చి 1881 డిసెంబరు 11 వ తేదీన పెళ్ళిచేశారు. మగశిశువును రాజ్యలక్ష్మమ్మగారు పెంచసాగారు. శ్రీరాములు ఆపిల్లవానికి వీరేశలింగమని పేరుపెట్టాడు. (ఆ పిల్లవాడికి పంతులుగారే బి. ఏ. దాకా చెప్పించారు. విధవావిహం చేయాలని చూశారు కాని ఆచిన్న వీరేశలింగం తప్పుకొని సామాన్య వివాహం చేసుకొని వేరే స్థిరపడ్డాడు.)

వీరేశలింగముగారు మొట్టమొదటి వితంతు వివాహమును తమ ఇంట్లో మహా వైభవంగా జరిపించారు. వితంతు వివాహానికి వెనుకంజ వేసినా, వితంతు వివాహ రక్షణకు మాత్రం 500 మంది విద్యార్థులు లాఠీలతో ముందు పీఠీన నిలబడ్డారు. విద్యార్థులు, పోలీసులు పంతులుగారికి అంగరక్షకులు. పోలీసుశాఖ దొరగారు పంతులుగారికి అవసరమైన సహాయం పోలీసు వారు చేయవలసినదని, ఉత్తర్వు చేయగా, ఇంటిచుట్టూ మహమ్మదీయులు, క్రైస్తవమతస్థులు అయిన పోలీసులతో ప్రత్యేక బందోబస్తు ఏర్పరచారు. జిల్లా మునసబు ఆత్మూరి వారు వితంతువును తెచ్చి వివాహము జరిగే వరకూ సంగతి అతి రహస్యంగా వుంచి సహాయ పడ్డారు.

పంతులుగారింత వరకూ భోగము మేళములనెవ్వరూ పెట్ట గూడదని, భోగము మేళములను చూడగూడదని ప్రబోధించి తాము ప్రతిజ్ఞా పత్రము మీద సంతకము చేయుటేకాక తమ మిత్రులు కొందరిచేత సంతకములు చేయించిరి.

"ఈ స్థితిలో 11-12-1881 వ తేదీన జరిగిన మొదటి వితంతు వివాహ వ్యయమునకై పైడా రామకృష్ణయ్యగారు వెయ్యి రూపాయలు పంపిరి. మొదటిదైన ఈ వివాహము మహావైభవముగా జరుపవలెనని మా సంఘ సంస్కార పక్షమువారి అభిప్రాయము. భోగము మేళములేక వివాహమునకు శోభరాదని పైడా రామకృష్ణయ్యగారు మొదలైన వారందరును తలచి యుండిరి. నేనును గవర్రాజుగారును మాత్రము భిన్నాభిప్రాయులమై యుంటిమి. మా పక్షము వారిలో ఎక్కువ సంఖ్యగల వారి అభిప్రాయమును బట్టి భోగము మేళమును పెట్ట నిశ్చయింపబడి ముందుగా కొంత సొమ్ము బయానాగా ఈయబడినది. వివాహము జరుగవలసిన స్థలము మా యిల్లు. నృత్య గానములు సలుపుటకై వేశ్యాంగనలను మా ఇంటి లోపలి కడుగిడనియ్యనని నేను పట్టుబట్టితిని. అందువల్ల మా వారూరేగింపు సమయమున భోగము మేళమును పెండ్లి పల్లకీ ముందు పెట్టుటకు నిశ్చయించి అట్లుగావించిరి. ("స్వీయచరిత్ర" 1, పుటలు 172-74.)

"అల్లరి జరుగకుండ మాఇంటిచుట్టు 50 మంది పోలీసులుండిరి. జిల్లా సూపరింటెండెంటు ఆఫ్ పోలీసు స్వయముగ వచ్చి తగిన ఏర్పాటులు చేయుచుండెను. జాయింట్ మాజిస్ట్రేటు హాజరుగా నుండెను. మేము విచ్చలవిడిగా ధన వ్యయముచేసి ప్రతిపక్షుల క్రియలకు ప్రతిక్రియలు చేయుచుంటిమి.

ఊరిలోని మంగలివాండ్ర నందరిని బాజావాయించుటకు పిలిచితిమి. చాలా సొమ్మునిచ్చి వంటబ్రాహ్మణులను నీళ్ళ బ్రాహ్మణులను సంపాదించుకో గలిగినాము.

ఎంతోమంది యాజకులను ప్రతిపక్షులు బెదిరించి రానివ్వలేదు. నూరు రూపాయలిచ్చి మంత్రములు చెప్పుట కొకయాజకుని సంపాదించగలిగినాము. (174)

మావంట బ్రాహ్మణులలో నొకడు మరునాడు పారిపోగా పోలీసువారతనిని పట్టితెచ్చి పెండ్లి నాలుగు దినములలోను వంటయు భోజనములును కాగానే వారిని (వంట బ్రాహ్మణులను) తమ యధీనములో నుంచుకొని మాకెంతో తోడు పడిరి. (174.)

మొదటి వివాహము 11-12-1881 రాత్రి 11 గంటలకు నిర్విఘ్నముగా జరిగెను. అదియైన నాలుగవ దినముననే రెండవ వివాహము జరిగినది. మరునాడు దయము శుభవార్తలు తెలుపుతూ వార్తాపత్రికలకు, మిత్రులకు బహుస్థలములకు తంత్రివార్తలు పంపితిమి. (17..)

మొదటి వివాహమైన 4వదినమున 12 ఏళ్ళ బాలవితంతువును ఆమెతల్లి వెంటబెట్టుకొనివచ్చింది. వెంటనే మెట్రిక్‌పరీక్షకు వెళ్ళుతున్న విద్యార్థిని దారిలో నిలిపి, వితంతువివాహానికి ఒప్పించి వెంటనే పెళ్ళిచేయించారు. రెండుపెళ్ళిళ్ళ దంపతులను సంస్థానాధిపతుల వివాహములందుకూడ జరగనంత మహావైభవంగా జరిపించారు. యూరోపియన్లు, ఆ న్యాయాధికార్లు, అరవైమంది పోలీసు బందోబస్తుతో వేడుకచూడవచ్చిన జనసమూహాన్ని యూరపియన్ పోలీసు అధికారి అదుపు చేయింపుచు పల్లకులవెంట నడవగా ఊరేగింపు చేయించారు.

మూడవ వివాహము 1882 అక్టోబరు 22 వ తేదీన జరిగినది. పంతులుగారి కావలాలో బహిర్భూమి వంకచెప్పి చొక్కా తలపాగా ఉత్తరీయం పంతులుగారి వద్ద ఉంచి వరుడు బయటికిపోవ సెలవంది తప్పించుకొని పారిపోగా, మళ్ళీ పట్టితెచ్చి, పలాయనంకాకుండా పంతులువారీగా పెండ్లికాలముదాకా కావలాలు కాయించి పెళ్ళి జరిగించారు. అతని అప్పులుతీర్చినందున అతనిపై సంపూర్ణమైన అధికారములు వితంతువివాహ సంఘమువారికి సంక్రమించి, వరుణ్ణి సంఘం క్రయంపొందినట్లుగా ప్రవర్తించింది. ఈవివాహాల్లో వధూవరుల పరస్పరేచ్ఛ, అనుకూల్యమువంటి విషయాలేవీ చోటుచేసుకోలేదని చెప్పనక్కరలేదనుకొంటాను మాకు మొదటి వివాహము కంటె పదిరెట్లు ప్రయాసకలిగినది. మొదటిదానివలెనే ఇక్కడనురక్షకభటులు మాఇల్లు కావలికాయవలసివచ్చెను. మొదటి దానికంటెనుఅధికవ్యయము చేయవలసివచ్చినది. ఊరేగింపు సమయమునఆయుధపాణులయిన రక్షకభటులు పల్లకి చుట్టు నుండినను దుష్టులు రాళ్ళు విసిరిరి." భోగము మేళమును మాత్రం పంతులుగారు తీసి వేయించారు. ప్రథమవివాహ దాంపత్యంలో తొలిసంవత్సరంలోనే కలత లారంభమయ్యాయి. సర్దలేక హతమయ్యారు. కడపటికాదాంపత్యం భగ్నమయింది. శ్రీరాములుపాపం క్రైస్తవుల్లో కలిసిపోయాడు. అసలది చేయదగిన మనువుకాదు.

వితంతు వివాహ ప్రయాసదశలో పంతులుగారు విచిత్రమైన పద్ధతులుఅవలంబించేవారు. వితంతువులను వారిబంధువులేయిండ్లనుండి రప్పించడానికి అతిరహస్య విధానములు, మాయోపాయములు అవలంబించేవారు. వివాహమయ్యేవరకు వారి బంధువుల కెవ్వరికీ తెలియనివ్వరు. వివాహం జరిగేటప్పుడు శాంతిభద్రతలు కాపాడడానికి లాఠీకర్రలతో విద్యార్థులూ పోలీసులూ కాపలాకాసేవారు. పోలీసులలోకూడ మహమ్మదీయ పోలీసులనే రప్పించేవారు. పెండ్లి ఒక్కంటికి వెయ్యిరూపాయలు వ్యయించేవారు. అనగా ఆరోజుల్లో పదిపన్నెండు ఎకరాలఖరీదుపెట్టి నగలు చేయించి బట్టలుపెట్టి, అయిదురోజుల పెళ్ళిళ్ళు చేయించేవారు. అలా అంతవ్యయముతో మొదటి పన్నెండు పెళ్ళిళ్ళు జరిపించారు. తర్వాత పంతులుగారొక్కరే ధనం సమకూర్చవలసినవారై వివాహవ్యయాన్ని నూరురూపాయలకు తెచ్చారు. క్రమంగా పాతికరూపాయిలకు మిగలకుండా చేస్తూవచ్చారు. ధనసహాయం అవసరం

పోగొట్టారు 1904 నాటికి విధవాపునర్వివాహాలు అందరకు జరిగినట్లు పంతులుగారు లెక్కించారు.

ఒకటి రెండు సందర్భాలలో వితంతువుల బంధువులను కాళ్లు చేతులు పట్టుకొని ఈడ్చిన ఉదాహరణము (స్వీ. చ. II పు 91), వారి పట్ల దౌర్జన్యము చేసిన ఉదాహరణములు వున్నవి. పంతులుగారు తన కార్యసాధన కోసం మిషనరీ దొరలతో, ప్రభుత్వోద్యోగులైన దొరలతో, కాలేజి ప్రిన్సిపాలు మొదలైన దొరలతో, ఉద్యోగేతరులైన దొరలతో స్నేహము చేసేవారు. పై అధికారుల తోడ్పాటుతో, ప్రభుత్వశాఖలలోని ఉద్యోగులందరి సహాయమును, పోలీసువారి సహాయమును పొందేవారు.

## స్త్రీ పునర్వివాహ దంపతుల కథ

ఆదిభట్ల నారాయణదాసుగారు వీరేశలింగం పంతులు గారిని "విచిత్ర వివాహకర్త" అని తమ "స్వీయ చరిత్ర"లో వర్ణించారు. దీనికి కారణం లేకపోలేదు. పంతులుగారు స్త్రీ పునర్వివాహములు శాస్త్ర సమ్మతములని వాదిస్తూ, తాము జరిగించిన వివాహాలను శాస్త్రోక్తముగా యథావిధిగా బ్రాహ్మణ పురోహితుల చేత జరిగించేవారు. కర్మకాండలలో లోపం లేకుండా చూసేవారు. మంగళసూత్రధారణము, హోమాలు, సప్తపది అన్నీ అయిదురోజులపాటు జరిగించేవారు. వివాహవిధి వైదిక విధే. ఇవి సంఘ సంస్కార వివాహాలు కావు. మొదటి వివాహ దంపతులు ఉభయులూ నియోగి శాఖవారే. రెండవ వివాహమునకు శాఖాభేదం లేదుగాని గోత్రం చిక్కు వచ్చింది. వితంతువు మొదటి భర్త గోత్రము రెండవ భర్త గోత్రము ఒకటే అయినది. అంతట పంతులుగారు తమ గోత్రంతో కన్యనుధార పోశారు. ఈ సంగతి శంకరాచార్యులవారి కేసులో హైకోర్టువారు చెప్పి ఇది శాస్త్రీయం కాదన్నారు. I.L.R 6 Madras-319 పంతులుగారు తరువాత కొన్ని శాఖా భేద వివాహాలు చేశారుగాని వర్ణాంతర వివాహాలు చేయలేదు. వారందుకు విముఖులని భావించవచ్చు. విడాకులకు కూడా విముఖులనుకోవచ్చు. అందుకే శ్రీరాములు క్రైస్తవంలో చేరవలసి వచ్చింది.

పంతులుగారు జరిగించిన వితంతు వివాహ దంపతులు బ్రాహ్మణాచారాలనే పాటించేవారు. పంతులుగారిని వారి భార్యను శంకరాచార్యులవారు వెలివేసినా పంతులుగారు 1906 వ సంవత్సరము వరకు జందెము విసర్జించలేదు. దానికి కారణము తాము తలపెట్టిన స్త్రీ పునర్వివాహ ఉద్యమానికి దెబ్బతగులుతుందని మాత్రమేనని స్వీయచరిత్రలో వ్రాశారు.

ఈ వివాహ దంపతుల కుటుంబాలొక బ్రాహ్మణ సంఘముగా నుండేవారు. వ్రతాలు జరిపేవారు. బ్రాహ్మణాచారాలు పాటించేవారు. పాపము వీరిని ఊరిలోని

బ్రాహ్మణులు తక్కువగా చూసేవారు. వీరికి సామాన్య పురోహితులు శుభాశుభాలలో మంత్రం చెప్పేవారు కారు. ఎవరో డబ్బు కక్కుర్తి వాళ్లు వచ్చేవారు. వారు దేవాలయాలలోకి దేవుని అర్చించడానికి వెడితే అర్చకులు వీరిని బ్రాహ్మణులుగా పరిగణించక తారతమ్యం చూపేవారు. ఈ బాధలు పడలేక ఈ వివాహ దంపతులు కొందరు శంకరాచార్యులపైన, అర్చకులపైన కోర్టులో దావాలు దాఖలు చేశారు. శాస్త్ర మొప్పదు గనుక లాభ ముండదని పంతులుగారు చెప్పినా వినలేదట. 1888 ఏప్రిలు నెలలో గోదావరి జిల్లా జడ్జి కోర్టు వారు వారి కేసులు కొట్టివేశారు. "మద్రాసు మెయిల్" 22-5-1888. వారు హైకోర్టుకు అప్పీలుచేయగా ఆకోర్టువారు కేసులు పరిహరించారు.

ఈ దంపతులకు ప్రధమంలో జీవనాధారం నిమిత్తం స్త్రీ పునర్వివాహ సమాజంవారు పైడా రామకృష్ణయ్యగారి ఔదార్యం వల్ల ధన సహాయం చేసేవారు. 2,3 వందల రూపాయల బంగారు నగలు చేయించేవారు. వితంతువు తల్లిదండ్రులకుకూడా ధనసహాయం చేసేవారు మూడు వందల రూపాయల విలువగల ఇంటి నిచ్చేవారు. లూథరన్ మిషనరీలు వివాహం చేసుకొన్న వరులకు తమ పాఠశాలలో ఉద్యోగ మిచ్చేవారు. ఇంటిలో నౌఖరు నిచ్చేవారు. వైద్యపు ఖర్చు లిచ్చేవారు. పురోహితుని ఏర్పరచి జీతమిచ్చేవారు. వితంతువివాహంచేసుకొంటామన్న పూచీకత్తుతీసుకొనివారికి పెట్టుబడిపెట్టి చదువులు చెప్పించేవారు. వితంతువుల దృష్టిలోకూడా తమ పెళ్ళితమకు అవసరమైనంతకన్నా పంతులుగారికే ప్రాణావసరమైనట్టుగా కనిపించేది. త్వరగా తమకు పెళ్ళి చేయకపోతే, తాము వెళ్ళిపోతామని బెదరించితే పెళ్ళిచేసేసిన యోగ్యతాయోగ్యతలు విచారించకుండాచేయించేశారు. లాటరీలాగినట్లు జరిపించేశారు తొందరపెట్టి కష్టాలపాలయ్యామని తర్వాత వ్రాశారట. (స్వీ. చ. రెండో భాగం పుటలు 242) తొలివివాహ దంపతులు సమాజమిచ్చే డబ్బు చాలడం లేదనివాళ్ళు రామకృష్ణయ్యగారివల్ల ఇంకా కొంతసొమ్ము పుచ్చుకునేవారు. కొత్తవివాహాలు చేసి పేరుపొందాలనే ఉత్సాహమేగాని పంతులుగారు పాతదంపతులక్షేమాన్ని ఆలోచించడంలేదనే అసంతృప్తి వ్యాపించింది. వారుచేసే అల్లరినిగూర్చి పంతులుగారు "స్వీయచరిత్ర" లో వ్రాశారు.

పంతులుగారిపైన వితంతువివాహం చేసుకొన్నవారి అసంతృప్తి క్రమక్రమంగా వృద్ధియైనది. ఆయనపైన ఆత్మూరి లక్ష్మీనరసింహంగారికి, ఏలూరి లక్ష్మీనరసింహంగారికి చాడీలు చెప్పేవారు. ఈనాయకులలో స్పర్ధలు, విరోధాలు పెరిగినవి.

తుదకు 1893 వ సంవత్సరములో పంతులుగారికి కొత్త వివాహాలు చేసి పేరు సంపాదించే తృష్ణ తప్ప పాత దంపతుల గతి ఆలోచించరని నిందిస్తూ, వితంతు వివాహ సమాజ ధనములో నుంచి ముందుగా తమ క్షేమ లాభాల కోసం

ఖర్చు పెట్టాలని పంతులుగారి మీద ఆరోపణలతో ఒక పిటిషను పంపించారు. దానిని గూర్చి లియోనార్డు తన గ్రంథంలో వ్రాశాడు (పుట: 220.)

పైడా రామకృష్ణయ్యగారు సజీవులై వుండగానే 1885 మే నెలలో సమాజం వారు ఫండ్సుకోసం పత్రికలలో అపీలు ప్రకటించారు. అందులో వితంతు వివాహాలు జరిగించడానికి చాలా ధనం కావలసివస్తున్నదని, నిత్యకృత్యానికేగాక దంపతులకు ప్రతి నెలా సహాయం క్రింద, జీతాల క్రింద, వంట బ్రాహ్మణుల జీతాల క్రింద సొమ్ము కావాలని, కొత్త వివాహాలు చెయ్యాలంటే దంపతులకు నివసించడానికి ఇండ్లవసతి కల్పించాలని, ఏ విధమైన లంచము లిచ్చి వివాహాలు చేయడం తమ ఉద్దేశం కాదని, అయితే, దేశ పరిస్థితులను బట్టి దంపతులకు కొంత సహాయం చేస్తేనేగాని వివాహాలు కావనిన్నీ అందులో వ్రాశారు. ('మద్రాసు మెయిలు' 18-6-1885.)

1886 మార్చి 28 వ తేదీన వితంతు వివాహ మహారాజ పోషకులైన పైడా రామకృష్ణయ్యగారు చనిపోయారు. ఆయన వితంతు వివాహ సమాజానికి పదివేల రూపాయలు విరాళం యిస్తూ, దానికి ఆత్మూరి వారిని ట్రస్టీగా ఏర్పాటు చేస్తూ మరణ శాసనం వ్రాశారు. ఆ సొమ్ము వినియోగం విషయంలో పాత దంపతులకు ముందుగా సహాయం చెయ్యాలని ఆత్మూరి వారన్నారు. కొత్త వివాహాలను చేయించడానికి కర్చు పెట్టాలని పంతులుగారి అభిప్రాయం.

వీల్నామా వ్రాసేముందటి రోజుల్లో పైడా రామకృష్ణయ్యగారు పంతులు గారికి వ్రాసిన లేఖలను స్వీయచరిత్రలో యిచ్చారు. వానిని చూచినట్లయితే పైడావారి అభిప్రాయాన్నే ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు అమలుజరిపారని తోస్తుంది.

ఇలా గొప్ప ఆర్థికసహాయం చూపి విధవావివాహాలు చేయవలసిన పరిస్థితులు క్రమంగా తొలగినవి. అలాగైనా 1904 నాటికి ఆంధ్రదేశంలో జరిగినవి అరవై వివాహాలే. కాని వితంతువివాహమంటే వీలులేదనే నిషేధం తొలగిపోయింది. దేశందృష్టి మారిపోయింది. అదిచాలా గొప్పవిషయం. కాని ఆనాడు వేలకొౘదగని సంఖ్యలోవుండే వితంతుకన్యలు వితంతువులుగానే కాలంచేశారుగాని, వివాహజీవితం రుచిచూడలేకపోయారు.

బాల్యవివాహాలు క్రమంగా తగ్గిపోయి, యుక్తవయస్సు వచ్చినతర్వాత పెళ్ళి చేయడం హెచ్చినందుననే వితంతు కన్యా పునర్వివాహ సమస్య సమసిపోయిందని గుర్తించుట అవసరం. రజస్వలా వివాహప్రచారం, ఉద్యమం వ్యాపించి శారదా శాసనం ఏర్పడిన పరిస్థితే మన సంఘములో స్త్రీలసమస్యకు మంచి పరిష్కారమై వుంది.

వీరేశలింగంగారి వితంతు పునర్వివాహమంటే బాలవితంతువులకే (వితంతు కన్యలకే) గాని, కాపురంచేసి వితంతువులైనవారికి పునర్వివాహముకాదు. అప్పట్లో వారు అంతపని తలపెట్టలేదు. అది అసాధ్యం అనుకొన్నారు. వితంతు కన్యా పునర్వివాహోద్యమంగా తమ ఉద్యమాన్ని ప్రారంభించారు. వారి జీవితాంతమూ, అనగా మూడున్నర దశాబ్దాలుపైగా, దానికే కట్టుబడివున్నారు. సంతానం కలగక ముందే వితంతువులైన యువతులకుమాత్రం ఇప్పట్లో పునర్వివాహయోగం దాగానే కలిగింది. అయితే అందులో యువకులు ఆదర్శంకన్నా అర్థికలబ్ధికి ఆకర్షితులు కావటం హెచ్చుగావున్నది. పిల్లతల్లులైన వితంతుయువతులు పునర్వివాహానికి తలపడటంగాని, వారు తలపడితే వారిని పెండ్లాడేందుకు పురుషులు సిద్ధపడటంగాని చాలా అపురూపుగావుందిగాని అటువంటి సన్నివేశాన్ని సంఘం బహిష్కారదృష్టితో చూడటంలేదుగాని అంతగా హర్షణీయంగా చూడకున్నది.

## కామరాజు హనుమంతరావుగారి వివాహం

కామరాజు హనుమంతరావుగారు దేశిరాజు పెదబాపయ్యగారి సవతితల్లికి సోదరుడు. సుగుణసంపదగల యువకుడు. బందరులో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారియొద్ద చదువుకొని ఆయన సిద్ధాంతాలను ఒంటబట్టినవాడు. అనుష్ఠానిక బ్రాహ్మసమాజము సభ్యుడైనాడు. అతడు ప్రవేశపరీక్షలో కృతార్థుడై రాజమండ్రి బోధనాభ్యసన కళాశాలలో ట్రైనింగు అగుచుండెను. ఆయన బిపిన్‌చంద్రపాలు 1907లో రాజమండ్రిలో ఉపన్యసించినప్పుడు వందేమాతరం జాతీయోద్రేకంవల్ల చదువు మానివేశాడు. వీరేశలింగంగారికి బిడ్డలులేరు. అంతకుముందాతనిపైన చాలా దయగలిగి తమమిత్రులైన కనుపర్తి యోగానందంగారి కుమార్తె బాలాత్రిపుర సుందరమ్మ యను బాలవితంతువునిచ్చి అతనికి వివాహము చేయుటకు నిశ్చయించి యుండిరి. వివాహము బ్రాహ్మధర్మము ప్రకారము 1908 అక్టోబరు 18వతేదీన జరుపుటకు నిశ్చయించిరి. ప్రిన్సిపాలును ధిక్కరించినాడని పంతులుగారికి ఇతనిపైన కోపమువచ్చి ఆ వివాహమును ఆపివేసి కొన్నిషరతులు పెట్టిరి. హనుమంతరావుగారు సుందరమ్మగారి ఇష్టములేకుండా తమయింటి కేయతిథిని తీసుకురాకూడదు. వందేమాతరం ఉద్యమంలో జోక్యం కలగజేసికొనకూడదు. ఆమెయిష్టానుసారము సొమ్ముఖర్చు చేయవలెను. ఈషరతులు మాట చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు విని ఇది బాగాలేదని, ఇటువంటి షరతుల వివాహం చేసుకొనుటవల్ల సంసారం పొత్తుపడదని, మానుకొనుట మేలని అన్నారు. ఈ సంగతి వీరేశలింగంగారికి వినిపించగా ఆయనకు కోపము వచ్చి లక్ష్మీనరసింహముగారింటికి రావడము మాని వేసిరి. (చి. ల. స్వీ. చ. పు : 274-76.)

అదృష్టవశమువల్ల కొంతకాలానికి హనుమంతరావుగారు వందేమాతరం రాజకీయోద్యమంలో పాల్గొనడము విరమించి బందరులో సంఘ సంస్కార ఉద్యమములో పనిచేయసాగినాడు. తుదకు పంతులుగారు దయదలచి తమ పట్టు వదలి 25-7-1909 తేదీన వీరి వివాహము జరిగించిరి.

హనుమంతరావుగారు వీరేశలింగం స్మారకసంచికలో "మధురస్మృతులు" అనుశీర్షికతో పంతులుగారికి మారుమాట చెప్పినచో యెంతమాత్రము అంగీకరింపరని వారి యుత్తరువులు పాటింపనందుననే తాను తీవ్రమైన ఆగ్రహమునకు గురియైతినని, తనభార్య విషయమునగూడ నట్లే జరిగినదని, పంతులుగారు తమయిద్దరిని క్రమక్రమంగా దూరముచేయుచు తుదకు వదిలించుకొన జూచిరని, వారి యాహ్వానముపైన వారిదగ్గర పనిచేయుటకు వచ్చి విఫలమనోరథులై వెళ్ళిపోయిన పి. రామచంద్రరావుగారును వారి సతీమణి, ఉన్నవ లక్ష్మీనారాయణగారు వారి భార్యగారును పడిన యిబ్బందులు నాకర్థమైనవి" అని వ్రాసిరి (పుట, 164.)

## పంతులుగారి కథనం : హనుమంతరావుగారి ఖండన

కామరాజు హనుమంతరావుగారు 1938 ఆగస్టు 14 వ తేదీన ప్రచురించిన తమ "స్వీయచరిత్ర" సమీక్షలో పంతులుగారి చర్యనుగూర్చి కొంత వివరంగా వ్రాశారు.

"1908 సం॥ ఆగష్టుమాసంలో మావివాహము పరిశుద్ధాస్తిక విశ్వాసముల కనుగుణముగా జరుపుటకు పంతులుగారు నిశ్చయించిరి. అందులకై ఏర్పాటులు ప్రారంభించిరి. మంగళసూత్రమునకు తాళిచేయించవలెనని నాతోచెప్పిరి. అంతకు పూర్వము పరిశుద్ధాస్తిక ధర్మానుసారము ఆంధ్రదేశములో వివాహములు జరుగలేదు. మాదే ప్రథమవివాహము గాన ఆవివాహవిధానము వివరములు తెలిసికొనదలచి యుంటిని. కాన మంగళసూత్రము-తాళి-వీటి యుద్దేశమేమిటి అని వారిని అడిగితిని. అదితెలుపక, అవి వాడవలసి యుండుననిమాత్రము బదులుచెప్పిరి.

రెండురోజుల తరువాత వారు నావద్దకు మరలవచ్చి వివాహమున కాహ్వానింపవలసినవారి నామములను వ్రాసియిమ్మనికోరిరి. వ్రాసియిచ్చితిని. అందులో ఒకపేరుచూపి వారెవరిని నన్ను ప్రశ్నించిరి. నోబుల్‌కాలేజీలో చదువుకొన్న నాక్రైస్తవమిత్రులని చెప్పితిని. వారి నాహ్వానింప వద్దనిరి. అచటి మిత్రులతోపాటు ఆయననుకూడా పిలుచుట యవసరమని నేను చెప్పగానే కోపముతో నావద్దనుండి లేచిపోయిరి. అంతటితో నేను వారికి విధేయుడనై యుండువాడనుగానని వారికి తోచినది. సుందరమ్మద్వారా నాకాసంగతి తెలిసినది. వారు నాతో మాట్లాడుట మానివేసిరి. వెంటనే జరుగవలసిన వివాహము ఆగిపోయినది. రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు, వేమూరి రామకృష్ణారావుగారు మొదలైనవారందరు పంతులుగారికిని నాకును సమాధానము కుదుర్చుటకు ప్రయత్నించిరి. లాభములేకపోయినది. నేను పంతులుగారికి అంతకోపము వచ్చునట్లుగా నేమియు మాట్లాడియుండలేదు. అది

వారికెవరు నచ్చజెప్పలేదు. తమకుకలిగిన యభిప్రాయమును మార్చుకొనరైరి. నేను రాజమహేంద్రవరమువదలి కొంతకాలం కాకినాడలోనుండి, మచిలీపట్టణము చేరితిని. తరువాత నేను సుందరమ్మ అభిప్రాయమును తెలిసికొని ఆమె నిప్పటికిని వివాహము చేసికొనుటకు సిద్ధముగా నున్నానని పంతులుగారి కొక ఉత్తరమువ్రాసి ముట్నూరు కృష్ణారావుగారికీ, వేమూరి రామకృష్ణారావుగారికి చూపి పోస్టుద్వారా పంపితిని. దానికివారు 1908 మేనెల ఏడవతేదీన జవాబు వ్రాసిరి.

1909 జూలై 25 వ తేదీన మా వివాహము జరిపిరి. ముహూర్తమునకు వెంకటరత్నం నాయుడుగారు, వేమూరి రామకృష్ణారావుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, పిళ్ళారిశెట్టి సీతారామయ్యగారు మొదలైన సంస్కరణాభిమానులు వచ్చిరి.

వివాహానంతరము సుందరమ్మ శరణాలయము పనులను, నేను తోటపనులను నౌకరులద్వారా జాగ్రత్తగానే చేయించుచుంటిమి. హితకారిణి స్కూలులెక్కలను వ్రాయుట మొదలైన పనులను చేయుచుంటినిగాని పంతులుగారికి ఏదోఅనుమానము. పంతులుగారి తత్వమున కనుగుణముగా నడచుటకు మే ముభయులము ప్రయత్నించి, తుదకు 1910 సెప్టెంబరులో సెలవుపుచ్చుకొని వెళ్ళితిమి. సుందరమ్మ గర్భవతి. నాయుడుగారి సహాయముతో పిఠాపురం ఆసుపత్రిలో పురుడుపోసుకొన్నాము."

తరువాత హనుమంతరావుగారు కొతరం ఆంధ్రలక్ష్మి కార్యాలయంలో పని చేశారు. 1913 నుండి 1918 వరకు కాకినాడ బ్రహ్మసాధనాశ్రమములోను, బ్రహ్మసమాజము కార్యదర్శిగాను పనిచేశారు. "ధర్మసాధని" పక్షపత్రిక నడపసాగిరి.

"మా వివాహమైన ఆరుసంవత్సరములకు పంతులుగారు ప్రచురించిన "స్వీయచరిత్ర"లో మా వివాహమునుగూర్చి కొన్నివిషయములు విపరీతముగా వ్రాసిరి. అవి సత్యదూరములై యుండెను. కావున యథార్థాలు వెల్లడిచేయుటకు విమర్శనాపూర్వకముగా నొకవ్యాసము వ్రాసి ముట్నూరి కృష్ణారావుగారి "కృష్ణాపత్రిక"లోను, 1915 అక్టోబరు 15వతేదీన వెలువడిన "ధర్మసాధని"లోను ప్రకటించి సంచికలను పంతులుగారికి పంపితిని. వారుదానికి జవాబునిచ్చియుండలేదు." అని హనుమంతరావుగారు వ్రాసిరి. (స్వీ. చ. 112-126.)

* కామరాజు హనుమంతరావుగారు పెద్దమనిషి. వారి వివాహము విషయములో పంతులుగారుచేసిన విచిత్రచర్యలను, పెట్టిన షరతులను చెప్పలేదు. ఇందుఇచ్చిన షరతులు చిలకమర్తివారి స్వీయచరిత్రలోనివని గమనించవలెను.

# గ్రంథచౌర్యము

పంతులుగారు ప్రచారంచేసినట్టి భావాలుకాని, సాధింప తలపెట్టిన సంస్కరణలుకాని స్వకీయప్రతిభాజన్యాలుకావని, అయితేవారు అవన్నీ స్వోపజ్ఞములే అనుకొనునట్లుగా వ్రాశారని ఇంతకుముందే తెలిపియున్నాము. ముద్దు నరసింహంనాయుడుగారి 'హితసూచని' వ్యాససంపుటినుంచి వారు ఏమేమి ఎలా సంగ్రహించినదీ విపులంగా లోగడే చెప్పియున్నాము. 'పురుషార్థప్రదాయిని' పత్రిక వారి 'వివేకవర్ధని' పత్రికకు ఎలా మార్గదర్శకమైఉన్నదీ తెలియజేసి యున్నాము. పంతులుగారు తెలుగులో షడ్విధప్రాధమ్యము తమదేఅని చాటిచెప్పినది యథార్థముకావని చాల కాలముక్రిందటే నే చెప్పినదానినికూడ ఈగ్రంథారంభములోనే తెలిపియున్నాము. అంతకన్నా మరికొన్ని పూర్వరచనలనుండి ప్రత్యక్షముగా గ్రంథచౌర్యముచేసిన ఉదంతములను సవిస్తరముగా తెలుపవలసి యున్నది.

వితంతువివాహమును హిందూశాస్త్రసమ్మతమని తాము సొంతముగా, స్వోపజ్ఞముగా నిరూపిస్తూ, తొలి యుపన్యాసము చేసినట్టు సాక్షాత్తుగా చెప్పికొన్నారు. అంతకన్నా సాహసం ఏముంటుంది. 1879 ఆగష్టు మూడవతేదీన వితంతువివాహమునుగూర్చి మొదటి యుపన్యాస మిచ్చునప్పటికి పంతులుగారికి స్త్రీపునర్వివాహమునుగూర్చి ఏమిగ్రంథము లున్నవో తెలియదట. ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వారి గ్రంథమున్నట్లు తెలియునుగాని యది లభ్యముకాలేదట. మను, యాజ్ఞవల్క్య స్మృతులు తమవద్ద నున్నవట 'తత్త్వబోధిని' లో ప్రకటింపబడిన ఉపన్యాస మొకటియు, 'పురుషార్థప్రదాయిని'లో ప్రకటింపబడిన ఉపన్యాస మొకటియు లభ్యమైనవట. (స్వీ. చ. పు. 136)

## స్త్రీకళాకల్లోలిని :

గ్రంథకర్త శ్రీ జియ్యరుసూరి. వారు బెంగుళూరులోని సైనికపటాలం పాఠశాలలో ప్రధానఆంధ్రోపాధ్యాయులు. 1875 లో ఇది ప్రకటింపబడినది. ఇది స్త్రీవిద్యనుగూర్చిన గ్రంథము. అరవములో నుంచి తెలుగులోకి తర్జుమా చేయబడినది.

దీని సమీక్ష 1875 మేనెల "వివేకవర్ధని"లో ప్రకటిస్తూ, "ఇది అరవము నుండి తెలుగులో కొంత ద్విపదగాను కొంత వచనముగాను వ్రాయబడిన"దనివ్రాసి, మే మీపుస్తకము గొంతకొంత చదివి చూచితిమి. శైలి మిక్కిలి మధురముగాను.

విషయము సర్వజన శ్లాఘనీయముగాను కనబడుచున్నది. గ్రంథము స్త్రీలు చదువుటకు తగినంత సులభముగానే వ్రాయబడినది" అని పంతులుగారు వ్రాసిరి. (అక్కిరాజు రమాపతిరావుగారి 'వీరేశలింగముగారి సమగ్రపరిశీలన' పుట 387.)

రమాపతిరావుగారు ఈ గ్రంథమునుగూర్చిన వివరములు 238-9 పుటలలో వ్రాశారు. ఇందులో 69వ్యాసములున్నవని, ఈవ్యాసములన్నియు స్త్రీవిద్యాభివృద్ధికిని, విజ్ఞానమునకును సంబంధించినవని వ్రాసిరి. స్త్రీలు చదివిరేని పురుషులకు సహాయము 63-64. బిడ్డలకు సహాయము 65-67. పాతివ్రత్యంబునకు రక్షణ 104-105.

వీరేశలింగముగారు 'సతీహితబోధిని' లో స్త్రీవిద్యనుగూర్చి వ్రాసినదానిలో ఈవ్యాసముల ననుసరించిరి. పురుషుడు స్త్రీని ప్రవర్తింప చేయవలసినప్రకారము 224-31, స్త్రీధనము 231-34, వితంతు నిర్భాగ్యము 234-42 అనువ్యాసములలోని భావములనుసంగ్రహించిరి.

పంతులుగారు ప్రకటించిన భర్తకు భార్యా విషయమై నడవవలసిన ధర్మములు 1881 సెప్టెంబరు 'వివేకవర్ధని', కన్యాశుల్కము 1880 మేనెల 'వివేకవర్ధని' అతి బాల్యవివాహములు నిర్బంధవైధవ్యము 1884 సెప్టెంబరు, 1885 నవంబరు, 1886 అక్టోబరు 'వివేకవర్ధని'లో పూర్తిగా సంగ్రహించి ప్రకటించిరి. పంతులుగారు జియ్యరు సూరిగారినిగాని, వారి గ్రంథమునుగాని పేర్కొనలేదని రమాపతిరావుగారు వ్రాయకపోవడం పంతులుగారిపట్ల పక్షపాతము గౌరవము వల్లనే!

1875లో జియ్యరుసూరిగారు ప్రచురించిన స్త్రీకళాకల్లోలినిపై వివేకవర్ధనిలో పంతులుగారు సమీక్షవ్రాశారు అనేసంగతిని పైనే చూపియున్నాము.

## పంతులుగారి అక్రమచర్యలు - ప్రజ్ఞాప్రభాకరము

"కవులచరిత్ర" పునర్ముద్రణ సందర్భంలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పంతులుగారికి ఎంతోసహాయముచేయగా, ఆయన చాలాతేలికగా వ్రాశారని, కృతజ్ఞత అనేది చూపలేదని మానవల్లి రామకృష్ణకవిగారినిగూర్చి అసహ్యంగా వ్రాశారని వ్రాశారు. దీని పూర్తిపాఠము వేరే పుస్తకములో నున్నది.

ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు పదే పదే సందు దొరకినప్పుడెల్ల వెళ్లుచు అక్కడి గ్రంథములు, అముద్రితములు పరిశీలించుచు, లోకల్ రికార్డుల నెల్ల చదువుచు, అపూర్వాంశముల గుర్తించుచు, గుర్తించిన వానిని మిత్రుల ఉత్తరముల

ద్వారా తెలుపుచు, తన్మయుడనై విద్యావ్యాసంగము చేయు చుంటిని. ప్రాచ్యలిఖిత పుస్తకశాలాధ్యక్షులు ఒక తూరి లైబ్రరీకి వచ్చి లైబ్రేరియన్ ద్వారా నా విషయములు తెలుసుకొనిరి. తెలుగు పుస్తకములకు కేటలాగు వ్రాయుచున్న గుమాస్తా సెలవు పెట్టగా తోడ్తోనాస్థానమున నన్ను నియోగించిరి.

ఆనాళ్లలో పావులూరి మల్లన కవిని గూర్చి నాముూలమున చర్చరేగెను. శ్రీ వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రలో వ్రాసిన తీరుసరికాదని, పావులూరి మల్లన్న నన్నయ నాటి మల్లన మనుమడని నేను లైబ్రరీలోని వ్రాత పుస్తకముల పరిశీలించి పత్రికల ద్వారా నిరూపింప యత్నించితిని. వీరేశలింగము పంతులుగారి తరపున నిలిచి అనేకులు నాపై చెలరేగిరి. వీరావేశముతో చిలుకూరి వీరభద్రరావు గారు లైబ్రరీ పుస్తకములను నేను పసి కుంకను జెరిసుర్బుద్ధితో మార్చివేయుచుంటి నని, నేను వ్రాసినట్లు వ్రాత ప్రతులలో లేదని, గవర్నమెంటువారు నన్నక్కడ నుంచరాదని బాహాటముగా వ్యాసములు వ్రాయసాగిరి. ఇంకెందరెందరో అటు తిరిగి నన్ను కటువుగా మందలింపసాగిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారి పేరు ప్రతిష్ఠలట్టివి కనుక, వారి యాంధ్రసాహిత్య సేవ యంత మహనీయమయినది గనుక వారెల్లరు నట్లుద్రిక్తులయిరి. వారందరు సత్యమేదియని పరిశీలింపక వ్రాసినవారే. ఒక్క వీరభద్రరావుగారే సత్యము స్పష్టముగా గుర్తింప దగియున్నను, లైబ్రరీ పుస్తకములు నేనేమి తార్మారు చేయకున్నను స్పర్ధా బుద్ధితో సత్య దూరముగా వ్రాత సాగించిరి.

ఆనాళ్ళలో ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో మహావీరాచార్యుని గణితసార సంగ్రహమును ప్రొఫెసరు రంగాచార్యులుగారు ముద్రించుచుండిరి. మల్లనగణితము దానికి దెలుగగుట నేను గుర్తించి, రంగాచార్యులుగారి కెరిగించితిని. అప్పుడు వీరభద్రరావుగారి వ్రాతలనుగూడ వారికి దెలిపితిని. అప్పుడు మా వివాదమును హైకోర్టుకేసు రికార్డులను పరిశీలించినట్టు పరిశీలించి వేపా రామేశముగారు నావాదము సత్యమయినదని, ప్రతివాదము శ్రుతిమించి సత్యదూరముగా నున్నదని గుర్తించిరి. నా నౌకరీకి కీడుచేజూచుచున్నవారి దుష్ప్రదేశమునకు రోసి శ్రీబ. న. శర్మగారితో ముచ్చటించిరి. నాకభయము చెప్పిరి. నామీదనిందను దొంతనమువారికి తెలుపునంతటి స్థితికివచ్చినది.

ఇంతజరిగిన తరువాత దొక్కచెదరి యందాక నాకు ప్రతికూలముగా నున్న వారొకరు లైబ్రరీ వ్రాతప్రతులు పాఠములనెల్ల శశిలేఖ పత్రికలో ప్రకటించిరి అవి నాప్రకటించినతీరునే నిరూపించెను. కాకినాడలో కర్చెర్ల శ్రీనివాసరావుగారను వారు పావులూరి గణితపు తాలూకుప్రతులు సంపాదించి యందలి పాఠములను శ్రీ పోలవరం రాజాగారు, దురిశేటి శేషగిరిరావుగారు వగైరాల సంతకములతో ప్రకటించిరి. అదియెల్లనేజెప్పినట్లే యుండెను. అంతతో నావివాద మణగారెను.

శ్రీ వీరేశలింగముగారు పరమపూజ్యులు. మహనీయులు నయ్యునహమిక మమకారము నధికముగాగలవారని తర్వాత తెలుపనయ్యెను.

శ్రీలక్ష్మణరావుగారు వీరేశలింగము పంతులుగారి నొకనాడు ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు గొనివచ్చి-వారప్పుడు కవులచరిత్రను సంస్కరించి ప్రకటింప బూనియున్నారుగాన వారి కస్మదాదుల సహాయము లభింపజేయుటకై ఐతనము సాగించుటలో నన్నె౦ుకపలచిరి. పావులూరి మల్లనచరిత్ర విషయములు వీరేశలింగముగారి దగ్గఱ, నాదగ్గఱ చర్చించి తత్త్వము నిర్ణయింప నభిలషించిరి. అన్ని వ్రాతప్రతులను జూపి నావాదమెరింగించితిని. వీరేశలింగముగారికి వేఱువిధముగా, పూర్వము తామువ్రాసినతీరుగా సమర్థింపనయితిగాదయ్యెను. లక్ష్మణరావుగారు జాగ్రత్తగా నెల్లవిషయము మరల ననువదించి వివరించి "మీరికనిట్లు మార్చుకోవల సినదే. మీరు తొలుతవ్రాసినదియు, మిమ్ము సమర్థింపబూని ఇతరులు వ్రాసినదియు సరికాదని స్పష్టపడినది! అనిరి. పంతులుగారు నాదగ్గఱ వ్రాతప్రతియేదో ఉండుట బట్టియే యట్లు వ్రాయుటయ్యెను. రాజమహేంద్రవరము వెళ్ళి నాదగ్గఱి గ్రంథము లనుబట్టి మరల పర్యాలోచించి నిర్ణయింతును" అనిరి. లక్ష్మణరావుగారు "ఇన్ని ప్రతులలో నున్నదానికి విరుద్ధముగా మీవ్రాతప్రతియుండదు. ఉండినచో సనిగా సమర్థముగా మీవివాదము నిర్వహించుకోవలసియుండును: అనిరి. పంతులుగారి పట్టుదలను పరిభావించుచో వీరేశలింగముగారికి మనమందఱము సహాయము చేయు దము. వారిచేతనే కవుల చరిత్రసంస్కరణము జరపింతము. అని లక్ష్మణరావుగారు చెప్పిరి. నాచేతనయినంత తోడ్పాటు జరుపుదునంటిని. వారిర్వురు నింటికి వెళ్ళిరి.

ఆట నుండి వీరేశలింగము పంతులుగారు బెంగుళూరు కొలది దినములకే వెళ్లిరి. కవుల చరిత్ర ప్రథమ భాగమున మాత్రము చేయవలసిన సంస్కరణములు నేనెఱిగి నంత వరకు బెంగుళూరుకి వ్రాసి పంపితిని. అదియొక పెద్దకట్ట. పంతులు గారు వాని నుపయోగించుకొనిరి. కాని వాని నాయా పట్టులందు పేర్కొననే లేదు సరికదా! గ్రంథ పీఠికలో శాస్త్రిగారును తమ గ్రంథాలయములో నున్న పుస్తక భాగములను పద్యములను నేను కోరిన వానిని వ్రాసి నాకెంతో తోడుపడిరి. అని వ్రాసిరి. వారికే యే విషయములు కావలసి యుండునో వానిని నేనే తెలిపి, లిస్టు వ్రాసి, సంస్కరింపవలసిన చేర్చవలసిన విధానములు, పద్యములు వ్రాసి పంపగా ఆ విషయము నిట్లా స్మరించుట? ఈ సంస్కరణమున ఫలాని ఫలాని పద్యములను, గ్రంథములను వ్రాసి పంపవలసినదిగా వారుకోరగా నస్మదాదులము వ్రాసి పంపినట్లు లర్థమగును. ఇంతేకాక తమకు చిరమిత్రులయిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిని గూడ జెనకిరి. ప్రబంధ రత్నావళిని గూర్చి అకారణముగ వారి కవుల చరిత్ర పీఠికలో మరల నన్నును చెనకిరి. వాని నెల్ల వివరించుట రోత. నేను జాబులు వ్రాయగా జాలి జాలిగా వానికి బదుళ్లు

వ్రాసిరి. ఆ జాబుల నిటీవల నేను చించివేయబోగా తాము జాగ్రత్తగా నుంచుకొందు మని నా మిత్రులు గయికొనిరి. (వే. ప్ర. శాస్త్రి)

పంతులుగారి "కవులచరిత్ర" పునర్ముద్రణ పీఠికలో మానవల్లి శ్రీ రామకృష్ణ కవిగారినిగూర్చి వ్యంగ్యంగా (సెటైర్) వ్రాసి, ప్రభాకరశాస్త్రిగారు తాముకోరిన భాగాలు పంపించినట్లు వ్రాశారు.

పంతులుగారు బెంగుళూరునుంచి వంగూరి సుబ్బారావుగారికి 1-5-1913 తేదీనవ్రాసినలేఖలో "ప్రభాకరశాస్త్రిగారు, మానవల్లి రామకృష్ణయ్యగారు నాకు ఇంకను సహాయముచేయలేదు. చేయుదురోలేదో తెలియదు. ఎవరుచేయకపోయినను నా చేతనైనంతవరకు పుస్తకమును సవరించి ముద్రింపించెదను" అనివ్రాసిరి.

'ప్రభాకరశాస్త్రిగారును, మానవల్లి రామకృష్ణయ్యగారును నాకింకను సాయ మేమియు చేయలేదు. చేయుదురో చేయరో తెలియదు' 1-5-1917

మానవల్లి రామకృష్ణయ్యగారుగాని, ప్రభాకరశాస్త్రిలుగారుగాని, యేమియు సాయముచేయునట్లు కనపడదు. వారు నేనడిగిన యంశములను తెలుపకపోవుటయే గాక నాయుత్తరములకు ప్రత్యుత్తర మిచ్చుటసైతము మానినారు. తమకుతెలిసినది ఇతరులమూలమున లోకమునకు తెలియుట వారి కిష్టములేదుకాబోలు." అని వంగూరి సుబ్బారావుగారికి 30-6-1917) వ్రాశారు.

వంగూరి సుబ్బారావుగారికి మొత్తం 16 వుత్తరాలు వ్రాశారు. మొదటవారు చేస్తూవున్న సహాయానికి కృతజ్ఞత తెలిపారు. తుదకు 24-12-1917 తేదీవుత్తరంలో వారిని నిందిస్తూ (సెటైర్) వ్రాశారు. ఆయనకు ఎందువల్ల కోపంవచ్చిందో తెలియదు. (వీ. లిం లేఖలు : 142_43)

"ముద్రణము నిమిత్తమై కాగితములను గొనుటకయి కావలసినంత సొమ్ము అయాచితముగా సమకూరినను నా నిమిత్తమున మీరు లోకోపకారకమయిన మీ పుస్తకము ముద్రణము మానుకొంటిరని ప్రకటింపబడుటను చూచినపుడు నాకెంతో చింత కలిగినది. మీ పుస్తకమును శీఘ్రముగా ప్రకటించి యాంధ్ర లోకమునకు వలె నాకునుదానివలన లాభముకలిగెడు భాగ్యమును కలిగింపుడు.మీరు చేసెడు సాహాయ్య లేశమునకు సహితము కృతజ్ఞుడనయి యుందును." 24-12-1917.

పంతులుగారు కవుల చరిత్రను సవరించుతూ చాలా మంది కవుల విషయమై వంగూరికి వ్రాసి సమాచారమును పొంది పొంది, యింకా యింకా అడుగుతూ పోతుండగా ఇక తాము వ్రాసి ప్రకటించుటకు మిగిలేదే ముంటుందనుకొని, పంతులు గారి రచన వెలువడిన తరువాతే వెలువరించవలెననుకొని ఆగిపోయినట్లున్నారు.

## ఆదిభట్లవారి ఈసపు నీతికథలు

శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు 1955లో "ఆంధ్రపత్రిక"లో ప్రకటించిన "స్వీయచరిత్ర" ప్రకారం దాసుగారు 1893 సంవత్సరంలో రాజమహేంద్రవరములో న్యాపతి సుబ్బారావు పంతులుగారికి అతిధి. దాసుగారు ఈసబు నీతికథలను పద్యరూపమున రచించారు. ప్రతికథకు చివరను దానినీతినిగూర్చిన పద్యము వ్రాసి వీరేశలింగముగారి ముద్రాక్షరశాలలో అచ్చుకిచ్చారు. దానిని వారు ముద్రింపక అవ్రాతపతి యెక్కడనో గైర్‌విలియా అయినదని పంతులుగారు చెప్పారట. అయితే, వీరేశలింగముగారాసమయముననే 1893_94 లో ఈసబు నీతికథలను వచనములో రచించి ప్రతికథ చివరఒక నీతిపద్యము వ్రాసి ప్రకటించారు. అది రెండుభాగములుగా "నీతికథామంజరి" అనేపేరుతో ముద్రింపబడినది. దాసుగారు రాజమహేంద్రవరములో న్యాపతి సుబ్బారావు పంతులుగారి అతిథిగానుండగా వీరేశలింగముగారాయనతో "అతడు వేశ్యాలంపటుడు" అతనితో మీకు స్నేహమేమిటి? అని అన్నారట. కాని సుబ్బారావుపంతులుగారు దాసుగారి స్నేహమువదలలేదు. పంతులుగారును అటువంటివారిని శిష్యులుగా చెప్పుకొంటూ సహాయము స్వీకరింపకా పూనలేదు.

## రంగరాజచరిత్ర : రాజశేఖరచరిత్ర

పంతులుగారి "రాజశేఖర చరిత్ర" వివేకవర్ధనిలో 1878 లో భాగములుగా (సీరియల్) ప్రకటించి 1880 లో గ్రంథరూపముగా ప్రకటించారు. అంతకుపూర్వము 1872లో ముద్రింపబడిన "శ్రీరంగరాజ చరిత్ర" అనే నవలలో ఒకసన్నివేశమును పంతులుగారు యధాతథంగా "రాజశేఖరచరిత్ర"లో వ్రాశారు. 1872 సం॥ జులై నెల పురుషార్థ ప్రదాయిని సంచికలో నరహరిసెట్టి గోపాలకృష్ణమసెట్టి వ్రాసిన ఈశ్రీరంగరాజచరిత్ర నవలపై సమీక్ష వున్నది. వీరేశలింగంగారు అదిచూచి దానిని తెప్పించి చదివారనేమాట నిస్సందేహం. ఆగ్రంథము వారి స్వీయగ్రంథాలయ గ్రంథ సంపుటములో నున్నది. పంతులుగారు దానిని Acknowledge చేయలేదు. (కొత్తపల్లి వీరభద్రరావుగారి (Influence of English on Telugu).

## హితసూచని :

1862 లో ప్రకటింపబడిన సామినేని ముద్దు నరసింహాలు నాయుడుగారి "హితసూచని" పంతులుగారి గ్రంథసంకలనములో నున్నది. అది ఇప్పుడు గౌతమీ గ్రంథాలయములో నున్నది. అందులో "దయ్యములు" అనేవ్యాసాన్ని పంతులుగారు **యథాతథంగా దొంగిలించి తమ 'వివేకవర్ధని'లో 1875 మార్చినెలలో**

1875 సెప్టెంబరు లేక 1876 సెప్టెంబరు?) ప్రకటించారు, దానిని తమవ్యాసాలలో ముద్రించుకున్నారు. (వీరేశలింగకృత గ్రంథములు ఎనిమిదవ సంపుటము. పుటలు : 388, 89,90.) ఈ సంగతి డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు పైన పేర్కొన్న తమ గ్రంథములో వ్రాశారు. (పుట : 367) పంతులుగారు అనేక ఇంగ్లీషు గ్రంథాలలో నుంచి తీసి ప్రహసనములు రచించినారుగాని వాటిని సరిగా ఎకనాలెడ్జి చేయలేదని శ్రీ వీరభద్రరావుగారి థీసిస్‌వల్ల తెలుస్తుంది.

## వీరేశలింగం-గురజాడ అప్పారావు

Mr. Apparao was born on 21.9.1862 and was younger than veeresalingam by 14 years. He has parodied in his incomplete drama 'కొండుభట్టీయం' written in 1906 Mr. K. V. Ramana Reddy wrote in Mahodayam P. 414.

"మాధవయ్యపాత్రకు కేశవరాయుడుపాత్రకు నిజజీవితంలో వీరేశలింగంతోటి వెంకటరత్నం నాయుడుతోటి చాలా పోలికలున్నట్లు రచయితవదలిన సూచనలనుబట్టి ఇప్పుడు నిర్ధారణచేయవచ్చు. మాధవయ్యకున్న "రావుబహద్దరు" బిరుదు, బ్రహ్మసమాజంలో వుంటూకూడా శాస్త్రోక్తపద్ధతిలో హైందవాచారాలకు అనుగుణంగానే సంస్కరణ వివాహాలను జరిపిస్తున్నాడని రాజారాం కేశవరాయుణ్ణి మాధవయ్యమీదికి ఎగదోలడం, మాధవయ్య ఎన్నోగ్రంథాలు రాసినట్లుగా, వాటిలో ఉపదేశాత్మక లఘురచనలూ, హేళనాత్మక గ్రంథాలూ, ఖండనాత్మకమైనవీ ఎక్కువగా నున్నట్టుగా ప్రస్తావనరావడం - ఒక్కసాలిడ్ (Solid) బుక్కైనా ఉంటే ఒట్టు! పిట్టకథలూ పిచికకథలూ, తిట్లూ, "మాధవయ్యగారిది వైదికపురస్తా,అందులో వేగినాటి సన్యాసం ఆయనకు దేశాన్నిపట్టి అబ్బింది" వగైరామాటలు. ఇవన్నీ వీరేశలింగం మొక్కల్లే. వీరేశలింగంగారు తమ "స్వీయచరిత్ర"లో వితంతు వివాహం సంస్కారము చెడునని కడచిన ఇరువదయిదు సంవత్సరములనుండి ఈశ్వరవంచకుడనయి, అనుష్ఠాన బ్రాహ్మణులను నిందించు వారిలాగనే భ్రమలలో చిక్కుకుని, మతవిషయములైన నా విశ్వాసములను కొన్నింటిని కార్యములలో చూపక యాత్మవంచకుడనయితి" (పుటలు: 260 మహోదయం)

రాజారాం.... చూడండి, నాయుడుగారూ! మన మాధవయ్యగారున్నారు. వారి యోగ్యత. ఆంధ్రపాండిత్యమూ, కవితాసామర్థ్యము మన దేశమునకెల్ల నలంకార భూషితములయి యున్నవే. వారు బ్రహ్మసమాజ మతము నెన్నాళనుండియో అవలంబించి ఆమతమునకు, మొనగాండ్లయివున్నారు. విధవావివాహములు ఆచరించవలసి

వచ్చినప్పుడు, రీజన్ కాగిసవారు బ్రహ్మసమాజముయొక్క మార్గమువదలి హిందూ శాస్త్రప్రకారం ఆచరిస్తారు. అది యేమనవచ్చును?

కేశవ : నిజమే! గాని మాధవయ్యగారు సవబునూలిన పని చేసిననూ మళ్ళించడము శక్యముకాదు. కాని, తాము విధవావివాహము కు ఫర్ కాని, యెగినెష్టుగాని వున్నట్లు కానరాదు!

రాజా : మాధవయ్యగారు గొప్ప గ్రంథకర్తలు, సంఘసంస్కార నిర్వాహకులు; వారికి మనమందరము పూజచేయవలసినదే। వారిపేరిట చంద్రకాంత శిలా పతిమవకటి నిలపనగు; గాని తప్పుత్రోవను మనల నీడ్చుకుపోయి హాస్పాదు లనుగా చేసినప్పుడు నేనయిన నేమిచేతును? పెళ్ళిచేసుకునే కుర్రవాడు బ్రహ్మసమాజ మతస్తుడైనప్పుడు సమాజమందిరములోసమాజ పద్ధతిప్రకారం పెళ్ళిచేయింపుదును. మాధవయ్యగారేమి చేయుదురు?

రాజారాం : ఈ పటుపటాంగములో యెవరు గెలుస్తారంటారు?

శాస్త్రి : తాము దివాన్‌బహద్దర్లు; మాధవ అయ్యగారు రావుబహద్దర్లు. ఇద్దరి తారతమ్యము కంపెనీవారు యెంచేవుంచారు. తాము సార్థకనాములగు మంత్రులు. మాధవయ్యగారిది వైదీకపురస్తా. అందులో పేగినాటి సన్యాసం. జరుగుతూ మనమంతా అన్యమతస్తులకు హాస్యాస్పదం కావడం నీకు మనస్కరించియున్నదా? పెళ్ళాడేకుర్రవాడు బ్రహ్మసమాజ మతస్తుడైనప్పుడు హిందూ శాస్త్రోక్తంగా పెళ్ళి చెయ్యడం నీకు యుక్తమనే తోచిందా?

రాజా : మనలో స్త్రీలు అజానులు; అస్వతంత్రులున్ను. వాళ్ళకి "గతానుగతికో లోకః" అన్నట్లు ఆచరణేగాని మతమంటూ వకటున్నదీ? క్రమంగా ఆపిల్లభర్త మతం అవలంబిస్తుంది; ఇన్ యాంటిసిపేషన్, మనం అందులో చేర్చవచ్చును.

గిరీ : కిరస్తానులు, తురకలూ, విధవావివాహం చేసుకుంటే హిందూసంఘ సంస్కారానికి ఎంతలాభమో బ్రహ్మసమాజంవారు చేస్తే అంతేలాభము. యింత కంటే సవరలు, కోదులు, గదబలు మొదలయిన కొండజాతుల ఆచారప్రకారం వివాహం కొంత వింతగానైనా వుంటుంది. దొరలు సంతోషించడంకద మీకు కావలసినది? కొండజాతుల ఆచారాలంటే తెల్లవాళ్ళు చెవికోసుకుంటారు. పేపర్లలో వ్రాసినా చదవతగివుంటుంది.

మాధవయ్య, కేశవరాయుడు ఇద్దరూ బ్రహ్మసామాజికులే, ఇద్దరూ విద్యాసంస్థలకు సంబంధించినవారే. వెంకటరత్నం నాయుడు విధవా వివాహాలను మొత్తంగా ఒప్పేసుకోలేకపోయినట్లే వీరేశలింగం వేశ్యావృత్తి నిర్మూలన విషయంలో విశ్వాసం కనబరచలేకపోయాడు (415 మహోదయం)

సమకాలిక మహోద్యమాలలో మతవిషయాలు, సంఘ సంస్కరణ విషయాలూ దూరి తత్ఫలితంగా సంస్కరణోద్యమం 1907 తర్వాత మందగించి పోయినమాట చరిత్రసత్యమే." శ్రీ కె. వి. రమణారెడ్డి "మహోదయం."

పంతులుగారి రచనలలో ప్రహసనాలను మెచ్చుకొన్నారంటూ గురజాడ అప్పారావుగారి అచ్చువాక్యాలను పరిశోధకులు ఉదాహరిస్తున్నారేగాని, పంతులుగారి రచనలన్నింటినిగూర్చి జీవితాన్ని స్వభావాన్ని ఉద్యమాన్నిగూర్చి గురజాడవారు నోట్సులాగా వ్రాసివున్న అముద్రితమైన సర్వంకష విమర్శసంగతిని వెల్లడించకున్నారు. అందుచేత పంతులుగారిపై గురజాడ సమగ్రాభిప్రాయాన్ని యిస్తున్నాను.

## CRITICISM OF GURAZADA

Sri Gurazada Appa Rao Pantulu garu wrote in his diary under date 7-4-1895. Lionizing has done much harm to Southern India. Some fellow of indifferant character or attainments is made much of and the conviction grows upon him and his admirers that he is perfect. He cares no longer to improve himself, and his followers copy his inperfections. Mr. Viresalingam is an example to the point."

This statement clearly shows that Mr. Appa Rao knew all about. Mr. Viresalingam, his life, character and career and about his followers.

The following are some of the important points of criticism made by Sri Gurazada Appa Rao in his works.

(1) The practices of Pantulu garu and his followers are not in consonance with principles of Brahma samaj which they professed.

(2) Their views and behaviour in the matter of pro-nautch anti-nautch controversy of those days are contradictary.

(3) Advocating ban on Dancing girls without solving their problems.

(4) Questionable methods followed in social reform movement and widow marriages.

(5) Giving houses and money and making inducements for promoting widow marriages.

(6) The leadership of Viresalingam his domination, arrogance, love of publicity. his contempt for his collaegues and enimity with his equals.

(7) Obtaining titles from the Government and currying the favour of authorities.

(8) Criticism of literary activities.

(i) No substantial contribution to Literature. no solid work' only satires, Farces and silly stories.

(ii) No originality.

(iii) Condemining the erotic critical works of old poets but himself producing such works.

(iv) Translation from English dramas, full of kissing and embracing and unnatural settings.

Mr. Gurazada Apparao criticised Mr. Pantulu and his followers that they did not improve in life, and caricatured them.

After the conferment of the title of Rao Bahadur on Viresalingam pantulu garu, Mr. Toleti Venkata Subba Rao of Rajahmundry who was employed in the Chintamani press of Viresalingam Pantulu published his biography in April 1894' in which he decribed the life and work of Pantulu garu in high eulogistic terms and it is reasonable to believe that Sri Gurazada Apparao Pantulu had read it and felt disgusted.

There is reason to believe that Mr.Gurazada Apparao knew the story of Mr. Viresalingam from 1878 to 1894 and creticised him driectly and indirectly. The rivalries between Mr. Viresalingam and his colleagues in Prarthana Samaj, Social reforms movement and municipal affairs was mentioned by Mr. Leonard in his thesis on the life of Mr. Viresalingam. He also gave some interesting facts but he did not deal with the criticisms of Mr. Gurazada Appa Rao. It is reasonable to believe that Mr. Gurazada Appa Rao. was fully imformed about the rivalry, enemity between Mr. Viresalingam Pantulu and Eluri Lakshminarasimham and read Vivekavardhani edited by Pantulu and Godavari News edited by Eluri Lakshminarasimham. It is also reasonable to think that he was told about the

Mr. Gurazada Appa Rao has written a lengthy note about the three parts of the History of Andhra Poets published by Mr. Viresalingam Pantulu in 1890, which was first published in Vivekavardhani between the years 1887 and 1890.

## Andhra Kavula Charitram (History of Andhra Poets)

In his Note about the above book, Apparao wrote "This book is neither fish, nor flesh nor redherring. It is not lives of the

poets in any sense of the term because in no case is there any life to write or a semblance of one, no estimate of the work is attempted, no connection traced between authors. Any idea that the work resembles works known as Lives of poets in English, not to speak of such classical works like Johnson's, would be highly misleading. It is not an anthology but an indifferent medly of all. It must be a misnomer to give the name of history to these determinations of the times of the poets which are arrived at by methods most unscientific. It would be equally absurd to call it criticism, the application of an epithet or two showing little discrimination and carrying hardly any meaning to the style of an author. Even the specimen verses quoted are not selected on any principle and are isolated. It would have been his foetal material of great value if he had published all the historical portions of Telugu poems and oriental scholars would have lain under great obligation to him, if he had translated them into English. He could have rendered great service to the Telugu reading public if he had given a choice selection of extracts from classical writers with a reviewing analysis of the plots, of the poems, to help to proper appreciation of the extracts. But historical or critical work is not his domain and his work in this direction would not merely disappoint but disgust one that has the slightest idea of what history or criticism is.

# వీరేశలింగంగారు - విద్యార్థులు

వీరేశలింగం పంతులుగారు 1876 నవంబరు ఒకటవతేదీన ధవళేశ్వరము పాఠశాలవదలి రాజమహేంద్రవర ప్రభుత్వ పాఠశాలలో నెల కిరువదైదు రూపాయల జీతముగల రెండవ ఆంధ్రోపాధ్యాయులుగా ప్రవేశించారు. ఆయన 1874లోనే "వివేకవర్ధని" పత్రికస్థాపించి హిందూజన సంఘములోని దురాచారములనుగురించి తీవ్రవిమర్శలు చేస్తూ వ్యాసాలువ్రాయడం ప్రారంభించారు. బ్రాహ్మణులను క్రైస్తవ మిషనరీలవలెనే దూషించడం ప్రారంభించారు.

పంతులుగారి దగ్గర విద్యార్థులుగా నున్న డాక్టరు ఆచంట లక్ష్మీపతి గారు, శ్రీవల్లూరి సూర్యనారాయణ పంతులుగారు, దాసు విష్ణురావు పంతులుగారుకూడా వారు క్లాసుల్లో సరిగా పాఠాలుచెప్పేవారుకారని, సంఘ సంస్కారం చేయుటనుగురించి విమర్శిస్తూ కాలముపుచ్చేవారనివ్రాశారు. పంతులుగారి బోధలవల్ల విద్యార్థులలో సంఘ సంస్కారభావాలు తలకెక్కినవి. వీరు. పంతులు గారికి అంగరక్షకులుగా నుండేవారు. అయిదు వందలమంది విద్యార్థులు లాటీలు పుచ్చుకొని పంతులుగారి వితంతువివాహ ఉద్యమానికి తోడ్పడి కొన్ని దౌర్జన్యాలు కూడా జరిగించారు. మానూరి పురుషోత్తంగారి పెళ్ళిసందర్భంలో పెళ్ళికూతురి యక్క పెళ్ళిపీటలమీదనుండి పెళ్ళికూతురిని యీడ్చుకుపోవజూడగా "నాయాజ్ఞమీద విద్యార్థు లడ్డుపడి కాళ్ళొక్కరును చేతులొక్కరునుబట్టి, యెత్తుకొనిపోయి యరచు చుండగా నామెను వీధిలో నిసుకలో గూలవేసిరి." స్త్రీపై స్త్రీలు కలుగజేసుకొనునట్లు గాకుండా, పురుషవిద్యార్థులచేత స్త్రీలను కాలుచేతులుపట్టి బైటవేయించటాన్ని పంతులుగారుగాక ఎవరుచేయించగలుగుతారు? పైగా అదొకఘనకార్యముగా వారు గాకమరెవరు సగర్వంగా వ్రాసుకొంటారు. విద్యార్థులఅల్లరిని మితిమీరిన చేష్టలను వారు అదుపుచేసేదేముంది? పంతులుగారు తమ "స్వీయచరిత్ర" మొదటిభాగంలో విద్యార్థులనుగూర్చి 93, 143, 145, 151, 152, 153, 191, 196 పుటలలో వ్రాశారు. రెండవభాగంలో 90, 91 పుటలలో వ్రాశారు. ఇటీవల కాంగ్రెసువారు, కమ్యూనిస్టులు మొదలైన రాజకీయ నాయకులు తమ ఉద్యమాలలో విద్యార్థుల నుప యోగించుకొన్నట్లే పంతులుగారు అప్పుడేవారి నుపయోగించుకొన్నారు.

ప్రతిదినము పాఠములు చెప్పేటప్పుడు రెండుపద్యములు చదవడముతడవుగా ఏదో ఒకసాంఘిక విషయమై చర్చకుదిగడమో, ఉపన్యాసం ప్రారంభించడమో

తరగతి గంటకొట్టేవరకు జరుగుతూ వుండేదని ఆచంట లక్ష్మీపతిగారు వీరేశలింగ స్మారకోత్సవ సంచికలో వ్రాశారు.

శ్రీదాసు విష్ణురావు పంతులుగారు 1881 లో రాజమహేంద్రవరములో చదివారు. ఈయన తమ "స్వీయచరిత్ర" లో (అముద్రితము) : "వీరేశలింగముగారు తెలుగుపాఠములు చెప్పువారుకారు. సంఘ సంస్కార విషయములు మాట్లాడుచుండుట, వారి పుస్తకములు వ్రాసుకొనుట, ప్రూపులు దిద్దుకొనుటయే వీరు క్లాసులో చేయుపనులు. ఆయనకు వ్యతిరేకముగా మాట్లాడువారినందరిని "ఫూల్" ఫూల్, అనిచెప్పుట వారికలవాటు." అనివ్రాశారు.

## శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు

బందరులో న్యాయవాదిగానుండి సంఘ సంస్కర్తగా పేరుపొంది దానధర్మాలు చేసిన శ్రీవల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు "సూర్యనారాయణీయము" అను తమ 'స్వీయచరిత్ర'లో వీరేశలింగము పంతులుగారినిగూర్చి ఇట్లువ్రాసిరి.*

"1878 లో నేను రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజీలో నాలుగవ ఫారములో చేరినప్పటినుండియు కందుకూరి వీరేశలింగం పంతులుగారు మా కుపాధ్యాయులుగా నుండి ఒకతెలుగేగాక మరికొన్ని గ్రంథములనుకూడా పాఠము చెప్పుచుండిరి. ఈయన మెట్రిక్యులేషను ప్యాసై ధవళేశ్వరం స్కూలులో హెడ్డు మాస్టరుగానుండి కాలేజీకి ఉపాధ్యాయులుగా అప్పుడేవచ్చిరి. ఈయన యలవాటునుబట్టియు మేము పాఠములను సరిగా వల్లించకపోబట్టియు క్లాసులోయేవియో లోకాభిరామాయణములతో నింపేవారము. మాకోమలమైనమనస్సులకు నాటునట్లు మాకు ఉగ్గుపాలతో సంఘ సంస్కరణను గురించియు, సాంఘిక మూఢవిశ్వాసములను గురించియు చిత్రవిచిత్రముగ యీయన యుపదేశించుచుండిరి. పూర్వపు రాతిబొమ్మలనన్నింటిని బ్రద్దలుకొట్టుటే యీయన పరమావధి. ఆంధ్రకవుల అతిశయోక్తులు, అలంకారములు యీయన తలకెక్కవు. వానినెల్లప్పుడు యీసడించేవారు. సంస్కృత నాటకమును యాంధ్రీకరణముచేసి మాకు వినిపించేవారు. స్వకపోలకల్పితమగు ప్లీడరు నాటకము మొదలైనవి మాచేత ఆడించేవారు. ఈయన కలమునకు అడ్డుతగిలేవారు లేకపోయిరి. ప్రతివారము వివేకవర్ధనిలో నిరాఘాటముగా సాంఘికాచారములను ప్రహసనముల మూలమున విమర్శించేవారు.

"1881 లో వితంతు వివాహములు శాస్త్రసమ్మతములుకాదని అనేకమంది గొప్ప పండితులు ఎందరో ఈనిరుపమానఆంధ్రపండితుని యందుండు గౌరవము చేతనే యీయనను ఒప్పించుటకు విజయనగరం మహారాజావారి బాలికాపాఠశాలలో సమావేశమై యీయనతో ప్రతివారము బహిరంగసభలలో చర్చలుజరిపిరి.(పంతులుగారికథనం ఇందుకు భిన్నంగావుంది.)

"మాపంతులుగారి మాట కెన్నటికిని అడ్డుచెప్పక ఆకాలములోనున్న మేము 500మంది విద్యార్థులము ప్రతివీథిలోను సందులోను ఆయనకెట్టి హానియు కలుగ కుండలాటీకర్రలతో జాగరణ చేసితిమి. మే మాపునర్వివాహములో అక్కడ భోజనముచేసినను, తాంబూలము పుచ్చుకొన్నను మమ్మును వెలివేయుటకు సాధ్య పడకపోవుటచే పెద్దలు చేయునదేమియులేక మిన్నకుండిరి. పెదలుమొదట ఆయనతో చేరిరిగాని ఒక్క బసవరాజు గవర్రాజుగారుతప్ప తక్కినవారు ప్రాయశ్చిత్తము చేయించుకొనిరి."

"మాలో కొందరము కాలేజీలో రోడ్డుప్రక్కనున్న చెట్లకొమ్మలకుమాయజ్ఞోప వీతములను తగిలించి మార్గస్థులను వృథాగా కవ్వించుచు మాసంఘ సంస్కరణాభి లాషను ప్రకటించుచుంటిమిగాని యింగితజ్ఞానముతో, శాస్త్రపరిశోధన చేసికాదు. మా చిన్నతనపు ఊహలకును చేష్టలకును మాకిప్పుడు నవ్వువచ్చుచుండును. మాలపల్లెలో కాపురముండుటకు ప్రయత్నించితిమి. పండిత శివనాథశాస్త్రిగారు వర్ణములనుగురించి తన వాగ్జాలమును కురిపించగా, యిండ్లలో యెవ్వరితోను చెప్పక కలకత్తాకు ఆయనతో ప్రయాణముకాగా ఆయనే మమ్ము వారించెను."

"మేమందరము అనుష్ఠానములో కాలునిడుటచే సంఘమువదలకుండ సంస్క రణములను ప్రవేశపెట్టవలయునని యభిప్రాయపడజొచ్చితిమి. నేను చెన్నపట్టణము వెళ్ళినతరువాత పంతులుగారు (అనుష్ఠాన) బ్రాహ్మమతమును పుచ్చుకొని యజ్ఞోప వీతమును, హైందవకర్మకాండను త్యజించి తమ్ము గురుభావముతో పూజించు చున్న పునర్వివాహ సంఘమువారి నందరిని త్రోసిపుచ్చుట మాలో బహుమంది సంఘసంస్కరణ వాదులకు వెగటుగ తోచినమాట వాస్తవము. గురుపీఠాధికారి అన్యమతమును స్వీకరించుటవలన యీ పునర్వివాహ దంపతులు చెట్టులేనిపక్షులవలె యెవ్వరియిష్టమువచ్చినట్లు వారు ప్రవర్తింపవలసి వచ్చెను తమ పూర్వపు సంఘ ములో వీరికి స్థానము లేకపోయెను. నూతన సంఘమును హైందవాకృతిలో యేర్పాటుచేసికొనలేక పోయిరి. కర్మలనుపట్టుకొని పీకులాడువారు కొందరు,కర్మను విసర్జించివేసెదమని కొందరు, త్రిశంకుస్వర్గములో కొందరు యుండిరి. వీరికొక సాంఘిక విధానము కలుగజేసినవారు లేకపోయిరి."

శ్రీ సూర్యనారాయణరావు పంతులుగారి విమర్శన్యాయమైనది. వీరేశలింగం పంతులుగారు వితంతు వివాహోద్యమమును బ్రహ్మసమాజ మతపునాదిపైన నడప లేదు. వితంతువివాహములు హిందూధర్మశాస్త్ర సమ్మతమనివాదించారు. ఆప్రకారమే బ్రాహ్మణపూజారులను పెట్టి వివాహములు జరిగించారు. వితంతువివాహములు చేసి కొన్న దంపతులు బ్రహ్మసమాజమతమును స్వీకరింపలేదు. వారు హిందూ సంఘా చారాలనే అనుసరించారు. పంతులుగారు 1906 వరకు జందెము విసర్జింపకపోవుటకు కారణములను చెప్పుచూ ఈసంగతినే వివరించారు.

వితంతువివాహాలు చేసుకొన్నవారు తమకులాచారాలను అనుసరిస్తూ బ్రాహ్మణులచేత వైదికకర్మలు చేయించుకోవాలని, దేవాలయాలలో దేవుళ్ళను అర్చించాలని ప్రయత్నించారని, సివిలుదావాలుకూడా దాఖలుచేశారని గుర్తుంచుకోవాలి.

"Teachers in Goverment college (Provencial School, Rajahmundry) like BasavarajuGovarraju, Eluri Lakshmi Narasimham Challapalli Bapaiah, Veeresalingam spent most of their time with, college faculty members, talking with students about social reform andtheir duty to improve the conditions in Andhra. Leonard gives authority ofRayasam Venkata Sivudu In Veeresalinga Smrutulu, Guntur 1931 (see Leonard P. 120)

ఏలూరు లక్ష్మీనర్సింహంగారు ప్రార్థనా సమాజబోధనలు చేసేఆస్తిక పాఠశాలను స్థాపించడానికి రాత్రి పాఠశాలలు స్థాపించి విద్యార్థులద్వారా సంఘసంస్కార కార్యక్రమాలు జరగడానికి గొప్పకృషిచేశారు. వారికి బి.ఏ. పరీక్షతర్వాత ఉద్యోగాలిస్తామని ఆశపెట్టారు. లక్ష్మీనరసింహంగారు విద్యార్థులను చేరదీసి ప్రార్థన సమాజంలో బలవంతులుకావడం పంతులుగారికి గిట్టలేదు. అభిప్రాయభేదాలు కలిగాయి. పంతులుగారు పగబట్టారు. స్త్రీ పునర్వివాహ అంతరంగిక సమాజంలోకి లక్ష్మీనరసింహంగారిని చేర్చలేదు. వీరిద్దరిమధ్య rivalry ని గూర్చి లియోనార్డు చాలావివరాలిచ్చాడు.

వివేకవర్ధనిలో ప్రకటింపబడిన బ్రాహ్మవివాహం లేక పెద్దయ్యగారిపెండ్లి విద్యార్థులు చదివారు. వ్యవహారధర్మబోధిని లేక ప్లీడరు నాటకము విద్యార్థులను ఆకర్షించినది.

పంతులుగారు పారిమిత్రులు విద్యార్థులుకలసి 1880లో విజయనగరం రాజాబాలికా పాఠశాలలో వ్యవహారధర్మబోధిని నాటకమును ప్రదర్శించిరి. అందు న్యాయాధికారి, న్యాయవాదులు పరిహసింపబడిరి. కొందరికి బాధకలిగినను చాలామంది ఆనందించిరి. వందలకొలది ప్రేక్షకులువచ్చిరి.

విద్యార్థులతో ఒకనాటక సమాజం స్థాపిస్తే సంఘసంస్కార ప్రచారం బాగా సాగుతుందని తోచినది. 1881 కడపటిభాగమున ఒకనాటక సమాజం స్థాపించితిమి. అప్పుడు ధార్వాడకంపెనీవారు నాటకములాడిన పాకలు ఖాళీగానుండెను. అందులో చమత్కారరత్నావళి అనునాటకము లాడించిరి. అవిప్రజలనాకర్షించెను. విద్యార్థులలో నాటక ప్రదర్శనములందు అభిరుచికలిగెను. పిల్లలలో చదువు పైన శ్రద్ధపోతున్నదని కొందరు నిందించిరి. (స్వీ. చ. పుట 154)

1881లో విద్యార్థుల సంఘ సంస్కరణ సమాజము అభివృద్ధి అయినది. విద్యార్థులు అత్యుత్సాహముతో పనిచేయుచుండిరి. పంతులుగారు విద్యార్థికాకపోయినా సమాజములో సభ్యులుగా నుండిరి. పెద్దిభొట్ల వెంకటప్పయ్యగారు కార్యదర్శి. ఇందులోచేరినవారు పొగచుట్టలు కాల్చరాదు. బోగము మేళములకు వాడలకు పోగూడదు. సమస్త సంఘసంస్కరణములకు తోడ్పడుటకు ప్రతిజ్ఞలు గైకొనిరి. (154.)

పంతులుగారు స్వీయచరిత్ర 2 వ భాగంలో వ్రాసిన ఒక్కసంగతివల్లఅసలు రహస్యం బయల్పడుతున్నది. 1897 సం॥ నుండి 1904 సం. వరకూ పంతులుగారు చెన్నపట్నంలో ప్రెసిడెన్సీ కాలేజీలో పండితుడుగా పనిచేసివచ్చినతరువాత తమ సంఘసంస్కార వితంతువివాహ ఉద్యమాలు సరిగా సాగకపోవడానికి కారణం చెపుతూ "ఏడెనిమిదిసంవత్సరాలు చెన్నపట్టణంలో వుండివచ్చుటచేత రాజమహేంద్ర వరం నాకు క్రొత్తదిగా కనబడెను. మునుపటివలె నాకు పాఠశాల విద్యార్థుల సహాయములేదు. నేనున్నకాలముననుండిన విద్యార్థులిప్పుడెవ్వరూలేరు. ఉన్నవారు నన్నెరుగని క్రొత్తవారు. వారు నాబోధనలు విననివారగుటచేత వారిలో సాంఘికసంస్కారోత్సాహములేదు. పురములోని పెద్దమనుష్యులకు కొంత సంస్కారోత్సాహము తగ్గిపోయినది. విద్యాధికులలో హిందూసమాజము యొక్క ప్రాబల్యముచేత రెండువర్గము లేర్పడినవి. సంఘసంస్కారము నందనాదరము గలవారి సంఖ్య అధికమైనది."

(స్వీ. చ. 2వ భాగం పు. 240)

# ఆత్మూరివారితో విరోధం

విధవా పునర్వివాహోద్యమానికి మహారాజ పోషకులైన పైడారామకృష్ణయ్య గారు తొలివితంతువివాహాలు జయప్రదంగా జరిగేసరికి ఉప్పొంగిపోతూ వీరేశలింగం గారు చరిత్రలో శాశ్వతులౌతున్నారంటూ ఒక అభినందనలేఖ వ్రాశారు. స్వీయ చరిత్రలో పంతులుగారు ఉల్లేకించిన ఆ ఆంగ్లలేఖలోనే ఆత్మూరి లక్ష్మినరసింహం గారిపాత్ర ప్రాధాన్యం ఎటువంటిదో స్పష్టంగా చెప్పారు.

"You and Gavarraju garu (the little men) have succeded a monstrous thing fighting against the current with the aid of the shield of our admirably bold friend, B.A.B.L.A. Lakshminara simham garu"

పొందికలేని యీ యింగ్లీషులేఖలో ప్రసక్తమైన పంతులుగారు, గవర్రాజు గారు, ఆత్మూరివారు – లేఖవ్రాసిన పైడావారు – నిజానికి ఈనలుగురి సమిష్టికృషే విధవావివాహోద్యమం. ఆత్మూరివారిపై ఏమేమి వ్రాసి ఎంతగా వారి ప్రాధాన్యాన్ని తక్కువపరచుటకు పంతులుగారు యత్నించినప్పటికీ, వారుల్లేఖించిన యీ వుత్తర మొక్కటే విధవావివాహోద్యమ కృత్యాద్యవస్థలో ఆత్మూరి లక్ష్మినరసింహంగారి కీలకపాత్రను చాటుతున్నది.

1879 నుంచి రెండేళ్ళపాటు వితంతువివాహోద్యమం ఉపన్యాస విన్యాస మాత్రంగాను, అసంపూర్ణప్రహసన రచనావిలాసంగానూ కొడికట్టిపోయివుండగా శివనాధశాస్త్రి వచ్చి వుత్తేజమిచ్చి అంతరంగిక సమాజం ఏర్పరచడానికి నిమిత్త కారణులై వున్నప్పటికీ, ఆత్మూరి లక్ష్మినరసింహంగారప్పటికి జిల్లా న్యాయాధి కారిగా రాజమండ్రికి బదిలీమైవచ్చి, అంతరంగిక సమాజంలో చేరివుండకపోయి నట్లయితే, శివనాధశాస్త్రి యిచ్చినవుత్తేజము, ఏర్పడిన అంతరంగిక సమాజము నిస్తేజమై ఎంతకాలం నిష్ప్రయోజకంగా వుండవలసివచ్చేదో చెప్పలేము. పైడా రామకృష్ణయ్యగారి నిధిలేకపోతే అప్పట్లో వితంతువివాహోద్యమం లేదనుకొంటే ఆత్మూరి లక్ష్మినరసింహంగారు ఆసమాజంలో లేకపోతే ఆనిధికూడా లేదన్నమాట ధ్రువం.

ఆత్మూరి లక్ష్మినరసింహంగారు పైడా రామకృష్ణయ్యగారి కులస్థులు. అనగా వైశ్యులు. అప్పటి వైశ్యుల్లో వారే B.A.B.L. ప్యాసైనవారు. జిల్లా న్యాయాధికారిగా వున్నారు. 1880 నుండి అమలాపురంలో జడ్జిగా వుంటూ కాకినాడలో వైశ్యజమీన్ దార్లుగా వృద్ధిలోవున్న పైడా రామకృష్ణయ్యగారి గౌరవాభిమానాలకు పాత్రులై

వున్నారు. పైగా ఆత్మూరి పండితులు–సంస్కృతం దండిగా వచ్చినవారు. బ్రహ్మ సమాజ సంస్కరణాభిప్రాయాలను ప్రచారంలో పెట్టుతున్నవారు. పంతులుగారికి 1868లో ఆ బ్రాహ్మమతంతో పరిచయం కలిగించింది వీరేయని లోగడేతెలిపి యున్నాము. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారంటే ఎంతగొప్ప అభిప్రాయం పైడా రామకృష్ణయ్యగారికున్నదో పైపత్తరమే చాటుతున్నది. రామకృష్ణయ్యగారిలో సంస్కరణాభిప్రాయాలు నెలకొని స్థిరపడటానికి లక్ష్మీనరసింహంగారి పాత్రవున్నది. పెళ్ళిపెళ్ళికి వెయ్యేసిరూపాయిలచొప్పున పైడావారు పంపిన చందాధనం లక్ష్మీనరసింహంగారి చేతులమీదగానే వాడకం జరిగేది. పైడావారితో వీరేశలింగంపంతులు గారికి వారు రాజారావుగారిద్వారానే ప్రథమపరిచయం లభించి వుండవచ్చుగాని, ముప్పదివేల నిధివాగ్దానంగాని, దానివాడకంగాని లక్ష్మీనరసింహంగారిద్వారానే సాధ్యమయింది. 1879లోనే పైడావారు ముప్పదివేలు వాగ్దానం చేసినట్లుగా అర్థంవచ్చునట్లు, లక్ష్మీనరసింహంగారిలో నిమిత్తంలేకుండా తమకే వాగ్దానం చేసినట్లు అర్థమయ్యేట్టుగా, "ఈ వాగ్దానమువలన మాకు మరింత యుత్సాహముకలిగి ద్విగుణ ధైర్యముతో బనికిపూనినను, రెండుసంవత్సరములకు పిమ్మట ప్రథమవివాహమగు వరకును పట్టిన సమస్తవ్యయములను నేనేవహించినాడను" అని స్వీయచరిత్రలో వ్రాశారు. "అంతరంగిక సమాజ మేర్పడుటకు ముందు రెండేళ్ళనుండికూడా విధవా వివాహం చేసుకోగలమని వాగ్దానం చేయించుకొని కొందరు విద్యార్థులకు పాఠశాల జీతములు కట్టినట్లు, సొమ్మిచ్చి మధ్యమనుష్యులచే బాలవితంతువులను పెళ్ళికి సమకూర్చు ప్రయత్నము రెండేళ్ళుగా చేస్తూయున్నట్లు వ్రాశారు. కాని యథార్థంగా అంతరంగిక సమాజం ఏర్పరచుకొనేవరకు పంతులుగారు నడిపింది ప్రచారపర్వమే గాని ఉద్యోగపర్వం కానేకాదని మరచిపోరాదు. ఈవ్రాత ఆదాత తమవాగ్దానాన్ని నెరవేర్చడంలో రెండేళ్ళు ఆలస్యం చేశారన్న నిందాధ్వని నిండావుంది.

మళ్ళీ 1884లో వితంతు పునర్వివాహ సమాజాన్ని పునర్వ్యవస్థీకరించి పైడా రామకృష్ణయ్యగారిని సభ్యులనుగా తీసుకొన్నప్పుడు ఆసంఘానికి కోశాధిపతిగా ఆత్మూరి లక్ష్మీనరసింహంగారినే చేశారు. పైడా రామకృష్ణయ్యగారు 1886 మార్చి 28 వ తేదీన మరణించారు. మరణించేముందు ఆత్మూరి లక్ష్మీనరసింహంగారిని వితంతువివాహసమాజం తరఫున ట్రస్టీనిచేసి పదివేలరూపాయల మూలనిధి ఏర్పరచి దానిని వ్యయపరచకుండా దానిపైవచ్చే వడ్డీనిమాత్రమే వివాహిత వితంతుసంక్షేమం కొరకును, వితంతువివాహాల నిమిత్తమున్నూ రామకృష్ణయ్యగారొక మరణశాసనం వ్రాశారు.

ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు ఆనిధికి ఏకైకధర్మకర్తలై ఆర్థికాధికారం సర్వం వారి హస్తగతముకావడం పంతులుగారికి ఇష్టంలేకపోయింది. దానితో రామకృష్ణయ్యగారి అపరక్రియలు ముగియకమునుపే, అనగా వారు చనిపోయిన

మూడవనాటికే, 1886 మార్చి 31 వతేదీ వివేకవర్ధని సంచికలో ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారిపై దంభాచార్య విలసనమని పేరుంచి ఒక ప్రహసనం ప్రారంభించి వరుసగా ప్రకటించసాగారు. వేరొకప్రక్కన లక్ష్మీనరసింహంగారికి ఆనిధిపైచిక్కిన అప్రతిహతాధికారాన్ని తగ్గించి వితంతువివాహ సమాజం ఆవిల్లు రిజిష్టరు చేయించడానికి, మరికొందరిని ట్రస్టీలుగా చేర్చటానికి ప్రయత్నాలుచేశారు. దంభాచార్య విలసనం లక్ష్మీనరసింహంగారినిగూర్చే నన్నవిషయం బహిరంగమైపోవటంతో లక్ష్మీనరసింహంగారికి పంతుగారిపై ఆగ్రహం కలిగింది. పూళ్ళోట్రముకు వేయించి వివేకవర్ధనిప్రతులు నడివీధిలో దగ్ధం చేయించారు. పంతులుగారి ప్రహసన ప్రచురణ నిరూపించరాని పరోక్షచర్యకాగా లక్ష్మీనరసింహంగారు చేయించిన పత్రికాదహనం ప్రత్యక్షమైన బహిరంగచర్య. ఆత్మూరిపైన వివేకవర్ధని తరఫునపరువునష్టం నోటీసు ఇప్పించారు పంతులుగారు. ఆత్మూరి తమచర్యలోని దౌర్బల్యాన్నిగుర్తించారు. జడిశారు. తగ్గి క్షమాపణవ్రాశారు. క్షమాపణ ప్రచురించకుండా తొక్కిపట్టింది వితంతు వివాహ సమాజకార్యవర్గం. కొన్నితీర్మానాలుచేసి ఆయనచేత అమలుజరిపించారు. ఆతర్వాతనే క్షమాపణ ప్రచురించి దాని నంగీకరించామన్నారు. అంతటితో లక్ష్మీ నరసింహంగారికి పరువునష్టం దావాభయం తీరింది.

1886 అక్టోబరు అయిదవతేదీన విధవావివాహం చేసుకున్న వరుల పక్షాన పులవర్తి శేషయ్య, నల్లగొండ కోదండరామయ్యగార్లను తనతోపాటు అడిషనలు ట్రస్టీలుగా ఆత్మూరివారు కోఆప్టు చేశారు. రామకృష్ణయ్యగారి విరాళం సొమ్ము వితంతువివాహాలను ప్రోత్సహించడానికి వినియోగించాలనే వితంతువివాహ సమాజ కమిటీవారి తీర్మానాన్ని ఆత్మూరివారు తృణీకరించారు. ఈసందర్భంలో వితంతు వివాహం చేసుకున్నవారి అభిప్రాయాల ప్రకటన పత్రిక జారీచేశారు. ఒక్క గోగుల పాటి శ్రీరాములుగారు మాత్రమే వితంతువివాహములను ప్రోత్సహించడానికి పైడా వారిధనం వినియోగించాలని వ్రాశారు.

ఆసొమ్ము ఆత్మూరివారివద్దనుంచి రాబట్టడంకోసం పంతులుగారు చాలా తంతులు చేశారుగాని ప్రయోజనం లేకపోయింది. ఆత్మూరివారు 1887 జనవరి 22 వ తేదీన గుత్తికి బదిలీయై వెళ్ళిపోయారు. ఆసొమ్మును బ్యాంకులో వేశామని చెప్పి, దానిమీద వచ్చేవడ్డీఅని కొంతసొమ్ము పాతవివాహ దంపతులకు పంపించారు. తరువాత ఆయన చనిపోవడంతో అది అంతమయినది. దానినిగూర్చి పంతులుగారు "స్వీయచరిత్ర"లో వ్రాశారు.

## స్వీయచరిత్ర కథనం నిజంకాదు :

రామకృష్ణయ్యగారి మరణమునకు నాలుగుదినములముందు తమసమ్ముఖమున నుండి ఆత్మూరి లక్ష్మీనరసింహంగారిని సమాజపక్షాన ధర్మకర్తను చేశాదని,

వారక్కడ అప్పుడులేకుంటే తమ్ముగాని మరొకరినిగాని ఏర్పరచేవారన్నట్లుగా పంతులుగారు వ్రాసింది యథార్థంకాదు. విల్లువ్రాసిన తేదీ మార్చి 18. అంతకుముందే ఈయేర్పాటునుగూర్చి లక్ష్మీనరసింహంగారితో రామకృష్ణయ్యగారు మాట్లాడారు. ఆలాగని మార్చి 17 వతేదీన వారు పంతులుగారికి కడపటి వుత్తరం వ్రాశారు. అందులో పంతులుగారిని ఆత్మూరితోకలిసి తాము మాట్లాడిన విషయాలు తెలుసుకొమ్మన్నారు. తామట్లు కలుసుకొని తెలుసుకొన్నదీ లేనిదీ పంతులుగారు వ్రాయలేదు కాని ఆవుత్తరం అందిన రెండుమూడుదినాలలోనే రామకృష్ణయ్యగారు చనిపోయారని వ్రాశారు. అనగా, మార్చి 17 నాటివుత్తరం 25,26 తేదీలదాకా తమకందలేదని వ్రాశారు. రామకృష్ణయ్యగారి మరణానికి నాలుగుదినములుముందు మరణశాసనంవ్రాశారని, ఆత్మూరి సమ్ముఖముననుండగా వారిని ధర్మకర్తగా వ్రాశారని పంతులుగారు వ్రాసింది వాస్తవసమాచారంకాదు. ఆత్మూరివారెదుటవుండగా వ్రాసిన వీల్నామాకాకపోవుటచేతనే ఆత్మూరివారు విల్లులోపల మీరే ధర్మకర్తలుగానుండియని యున్నచోట స్పష్టముగా ఆత్మూరి లక్ష్మీనరసింహంగారే ధర్మకర్తలుగానుండి అని వుండేటట్లు సవరింపవలసిందిగా రామకృష్ణయ్యగారికి లేఖ వ్రాయవలసివచ్చింది. వారెదగ్గిరుండి వ్రాయించుకొన్నట్లయితే మరణశాసనం తమ అభీష్టంమేరకు చాలా పకడ్బందీగా వుండివుండేదని చెప్పనక్కరలేదు. పదివేల నిధి ఏర్పరచిన మరణశాసనాన్ని ఆదినుంచి రిజిష్టరు కానివ్వరాదనేతలంపు లక్ష్మీనరసింహంగారికున్నదన్నమాట యథార్థంగా తోచదు. అదంతా పంతులుగారి చలువ. వారి ప్రవర్తనా పర్యవసానం. దంభాచార్య విలసనం చదువుకొన్నతర్వాత మూన్నాళ్ళకు ఆమరణశాసనాన్నికూడా సమాజంముందుంచారు. ఆవిషయాన్ని మరచిపోలేము. ఎటుతిరిగీ పైడా రామకృష్ణయ్యగారి మరణశాసనం పుట్టి అందులో ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు ఏకైక ధర్మకర్తలుగా ఏర్పరచబడిన తర్వాతనే వారిలో ఎప్పటినుంచో వుంటున్న లంచగొండితనంమీద పంతులుగారి ధ్వజమెత్తడంలో సొంతకారణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రామకృష్ణయ్యగారి నిధిపై లక్ష్మీనరసింహంగారికి అధికారమేర్పడటమే పంతులుగారికి పరమకంటకమయింది. ఆత్మూరివారు 1882 లోనే వైష్ణవం పుచ్చుకొన్నారు. అప్పటినుంచే ద్వాదశోర్ధ్వ పుండ్రాలుపెట్టుకొన్నారు. గండభేరుండంచుపంచెలు కట్టుకొనేవారు. వేదపాఠశాలపెట్టారు. వైదికముద్రాయంత్రముపెట్టారు బ్రహ్మసమాజం మాటెప్పుడో విడిచిపెట్టి వైదికమతప్రవిష్టులయ్యారు. అటువంటి పరమవైష్ణవుల సహాయసహకారాలు నాలుగేళ్ళుగాపొంది తమవితంతు వివాహోద్యమానికి కోశాధికారిగా పెట్టుకొన్నారు. రామకృష్ణయ్యగారి నిధివిషయంలో తమ ప్రాధాన్యం పోయేసరికే వారిలోని లంచగొండితనాన్ని, వారి వైష్ణవత్వాన్ని రచ్చకీడ్చారు.

బ్రహ్మసమాజం పేరుచెప్పి ప్రార్థనాసమాజం పెట్టిన పంతులుగారు తాము జంద్యెం తీసివేయలేకపోయారు. తమబ్రాహ్మణత్వాన్ని మరచిపోలేకపోయారు. వైదిక

వివాహవిధిచొప్పున పెళ్ళిళ్ళుచేశారేగాని తమమతమైన బ్రాహ్మపద్ధతిలో పెళ్ళిళ్ళు చేయలేకపోయారు వివేకవర్ధని ప్రెస్సులోని భాగస్వామ్యుల ఆస్తిని ఏడేళ్ళపాటుగా అనుభవిస్తూ దావా మీదకుతెచ్చుకొన్నారు. అదంతామరచిపోయి, కప్పిపెట్టుకొని సహచరుల ప్రాధాన్యం దుస్సహమైనప్పుడు వారిలోటుపాటులపై ధ్వజమెత్తి వారిని ఉద్యమంనుంచి దూరంచేసుకొన్నారు.

ఆత్మూరి, ఏలూరివారితో విరోధాలు పెంచుకొని పైడా రామకృష్ణయ్యగారి నిధి తమవాడకంక్రిందికి రాకపోయేసరికి 1886 నుండి 1889 వరకుగల కాలంలో పంతులుగారు ఒక్క వితంతువివాహాన్నైనా చేయించలేకపోయారు. 1888 లో వారు చేసినపెళ్ళి 1886లో రామకృష్ణయ్యగారి నిధితోనే జరగవలసినదానినిరామకృష్ణయ్యగారి అభిష్టానికి వ్యతిరేకంగా ఆనాడు పంతులుగారే పేచీపెట్టి నిలిపివేశారు. దాన్నే 1888లో చేయించారు. అది విడిస్తే 1892లోగాగల ఐదేళ్ళలో పంతులుగారు ఒక్క వివాహంమాత్రమే చేయించగలిగారు. ఈకాలంలో పంతులుగారి ప్రవర్తనే వితంతు వివాహోద్యమంలో విరోధాలు తెచ్చి ఉద్యమాన్ని దెబ్బగొట్టింది.

ఏలూరి లక్ష్మీనరసింహంగారితో విరోధం ప్రత్యేకంగా చెప్పవలసినట్టిది. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు పంతులుగారితో విడిపోయినపిదప చాలా ప్రతిభ జూపి రాణించారు. వారు జర్మన్‌భాషనేర్చి మాక్సుముల్లరు దృష్టికెక్కారు. ఆనంద గజపతిగారి మన్ననకెక్కారు. విజయనగరంలో 1890 నుండి 93 వరకు మూడేళ్ళు జడ్జిగావుండి ఆనందగజపతికి సన్నిహితులయ్యారు. మాక్సుముల్లరు ఆనందగజపతికి సన్నిహితులయ్యారు. మాక్సుముల్లరు ఆనందగజపతికి వ్రాసినలేఖలో వేదభాష్య విషయంలో లక్ష్మీనరసింహంగారిపేరు సూచించారని ప్రసిద్ధివుంది. మైసూరు మహారాజా ఇంగ్లాండు వెళ్ళాలనుకొంటే సముద్రయానం శాస్త్రవిరుద్ధమని ఆస్థాన పండితమండలిచెప్పగా, ఆనందగజపతిగారి ఆస్థానంవారి అభిప్రాయం కనుగొనమని కోరారట. లక్ష్మీనరసింహంగారు సముద్రయానం శాస్త్రసమ్మతమని ఆకారాలు చూపించారు. దాసుశ్రీరాములుగారంతటి పండితుణ్ణి ఆకట్టుకొని వైశ్యునికి యాజ్ఞాధికారమున్నదని చాటి యజ్ఞంచేసి సోమయాజిననిపించుకొన్నారు. వారు 1901 లోనే చనిపోయారు. వైశ్యులు వారిపేరబందరులో ట్రస్టునిర్మించారు. భవనం నిర్మించారు. హిందూసమాజంలో సంస్కర్తగా తుదివరకూ నిలిచారు. వితంతువివాహాలను వారు చివరంటూ బలపరచారు.

ఆత్మూరి లక్ష్మీనరసింహంగారి జీవితంలో హిందూమత పీఠాధిపతులతో చేసిన పోరాటం చారిత్రాత్మకమైనది. తొలి వితంతు వివాహం జరిపించినవెంటనే వీరేశలింగం, గవర్రాజుగారలతోపాటుగా వీరినికూడ వెలివేస్తూ విరూపాక్ష పీఠాధిపతులు బహిష్కారపత్రికను జారీచేశారు. అప్పుడే వీరు వైష్ణవచక్రాంకితాలు వేయించుకొని వైష్ణవమతం పుచ్చుకొన్నారు. విరూపాక్ష పీఠాధిపతులు తమపై బహి

షాంర్ఛ్యరచర్య తీసుకొన్నందుకు, వారికా అధికారంలేదని దావావేశారు. ఆదావా దిగువ కోర్టులో ఓడిపోయింది. ఆమీద మద్రాసు హైకోర్టువారికి అప్పీలుపెట్టారు. ఆ అప్పీలులో పీఠాధిపతులకు అధికారమైతే వుండిగాని బహిరంగమైన ఒక కార్డు మీద బహిష్కారపత్రిక పంపడంవల్ల పరువునష్టం జరిపించారని అలాచేసినందుకు మాత్రం రెండువందల రూపాయల జరిమానా ఆపీఠాధిపతులకు విధిస్తూ హైకోర్టు తీర్పిచ్చింది. పీఠాధిపతులు ఆజరిమానాను కట్టుకోక తప్పిందికాదు. ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారికి పీఠాధిపతులకే జరిమానా వేయించారన్నటువంటి గొప్పపేరు ప్రతిష్టలు లభించినని. పంతులుగారితో విడిపోయినపిమ్మటకూడా శృంగేరి పీఠాధిపతులతో ఆంధ్ర వైశ్యులకు, యజ్ఞాధికారము, వేదాధ్యయనాధికారము కలదనే విషయమై వివాదం ఏర్పడింది. శృంగేరిపీఠాధిపతులు మళ్ళీ బహిష్కారపత్రిక జారీ చేశారు. కుంభకోణంలోవున్న కోమట్లకు వైదికవిధులు అక్కడి బ్రాహ్మణులు జరిపించరాదని ఉత్తర్వు జారీచేశారు. కాని బ్రాహ్మణులచేతనే తమ వివాహాది శౌత కర్మలను విజయవంతంగా జరిపించేటట్లు చేయగలిగారు. వైష్ణవులైన తమపై ఏచర్య తీసుకోవటానికీ శృంగేరివారికి అధికారంలేదని సమాధానమిచ్చారు. వైష్ణవపీఠాలు వైశ్యుల వేదాధ్యయనాధికారాన్ని కాదనకుండ అనుమతించినవి. కడకు 1897వసంవత్సరములో రాయలసీమ, కోస్తా ఆంధ్రము రెండింటినుండి ఎంతోగొప్ప వేదపండితులను సమీకరించి స్వస్థలమైన బందరులో పెద్దయజ్ఞాన్ని యజ్ఞకర్తలుగా తాము జరిపించి సోమయాజి అనిపించుకొని లక్ష్మీనరసింహసోమయాజులు అనేపేరు వహించిరి. వారితర్వాత మరికొందరు వైశ్యప్రముఖులుకూడ యజ్ఞాలు చేయించారు. వేదాధికారం వహించారు. ఇదొక పెద్దతిరుగుబాటు. శూద్రులు తాము క్షత్రియులమని వేదవిధులందు తమకధికారమున్నదని ఉద్యమించటానికి పూర్వమే ఆంధ్రవైశ్యులచే ఆటువంటి ఉద్యమాన్ని లక్ష్మీనరసింహంగారు సాగించారు. లక్ష్మీనరసింహంగారు చనిపోయినతరువాత వారి ఆర్యవైశ్యసమాజం వితంతువివాహాలను అంగీకరిస్తూ వారి ప్రభావంవల్లనే లక్ష్మీనరసింహంగారి జీవితచరిత్రనుకూడ ఆసంఘమువారు ప్రకటించి యున్నారు.

# ఏలూరివారితో విరోధం

పంతులుగారు ఏలూరి లక్ష్మీనరసింహంగారి విషయంలో జరిగించిన అన్యాయము ఇంతింతయని చెప్పవీలులేదు. ఆయన తమకు బాల్యస్నేహితులు చాలా తెలివైనవారు, తమకన్న పెద్దచదువు చదివినవారు, పట్టభద్రులు, సామాన్యఉపాధ్యాయుడుగాకక ప్రధానోపాధ్యాయుడుగా పనిచేసినవారు, న్యాయవాదిగాకూడాఉన్నారు. ప్రజలగౌరవానికి పాత్రులై, మునిసిపలు చెయిర్మనుగా చాలాకాలము పనిచేసి, ప్రకాశం పంతులుగారన్నట్టు పట్టణానికి కిరీటంలేని రాజుగా సుండేవారు. పైగా పంతులుగారితోపాటు సమానశక్తియుక్తులు గలవారు. 1878 సం॥లో ప్రార్థన సమాజం స్థాపించినవారు. పంతులుగారికి, మొదటినుండి అన్ని కార్యకలాపాలలో కుడిభుజంగా నున్నవారు. వివేకవర్ధని నిర్వహణలో తోడ్పడుతూ, ఇంగ్లీషువిభాగములో వ్రాసేవారు. అందరికన్నా ఉత్సాహముతో పనిచేశారని పంతులుగారే ఒకచోట ప్రశంసించినవారు. ఇంతటి ప్రాముఖ్యముగల మహాపురుషునిగూర్చి పంతులుగారు తమ స్వీయచరిత్రలో సరిగా వ్రాయకపోగా, వారి జీవితవివరములను ఒకవరుసక్రమంగానైనా వివరించక, ఆయనలోగల సుగుణములు, ఆయనచేసిన మంచిపనులు చెప్పక, ఆయన గౌరవానికి భంగంకలిగించే సంగతులుమాత్రం వివరంగా వ్రాసి ఆయన నొక దుర్మార్గునిగా చిత్రించారు!! పంతులుగారి స్వీయచరిత్రలో ప్రతిపుటలోనూ, ఆయనపట్లగల అసూయ, ద్వేషము కనబడుతాయి. అంతగా సందర్భశుద్ధి లేకుండా, తన సంఘసంస్కరణకు అంతరాయంగానిపట్ల ఏదో సందర్భం కల్పించుకొని flash back చేసి, లక్ష్మీనరసింహంగారి కేసువిషయము 25 పుటలలో విస్తరించి వ్రాశారు. అయితే లియోనార్డు (Leonard) ఏలూరి లక్ష్మీనరసింహంగారి జీవితవిశేషాలను చక్కగా వివరించారు. ఆయన నొకమహాపురుషునిగా వర్ణించాడు.

ఈ విరోధానికి కారణాలను పంతులుగారు తమ స్వీయచరిత్రలో చాలా చిత్రంగా వ్రాసి తమ రచనాప్రావీణ్యం ప్రదర్శించారు. "నాకు బాల్యమిత్రుడై యుండిన ఏలూరి లక్ష్మీనరసింహంగారు నాపైన నిట్టితప్పు అభియోగము నేల తెప్పించుదురని కొందఱడుగవచ్చును. ఆస్తిక పాఠశాలాస్థాపనమునకు తరువాతస్వల్పకాలము వరకును మేమిరువురము కలిసి పనిచేయుచు వచ్చినను, ఆపాఠశాల విషయమున నాత డనుసరించుచు వచ్చినమార్గమును, రాత్రి పాఠశాలా విషయమున నాతడు త్రొక్కినత్రోవయు, ఇతరవిషయము లందతడు అవలంబించినపద్ధతులును నింద్యము

లుగా నాకు కనబడినందున పూర్వ మిత్రభావమునుబట్టి నేనప్పుడప్పుడు మందలించు చుండుటయు వివేకవర్ధనిలో వ్రాయుచుండుటయు, తటస్థించుచువచ్చెను. అతడును తాను ప్రచురించెడు "గోదావరి వృత్తాంతము" (Godavari News)అనుపత్రికలో నాకు వ్యతిరేకముగా వ్రాయదొడగెను. ఇది యిట్లుండగా, అతడు రాజమహేంద్ర వరోన్నత పాఠశాలకు ప్రథానోపాధ్యాయుడును, పురపారిశుధ్య విచారణ సంఘమున కధ్యక్షుడును అగుట తటస్థించెను." అని పంతులుగారు చెప్పి ఒక తగవులో తాము మధ్యవర్తిగానుండి ఆయనను మందలించిన సందర్భమును చాలా విపులముగా వ్రాశారు.

రాజమహేంద్రవరములో ఏలూరి లక్ష్మీనరసింహముగారి శిష్టుకరణముల కులమువారైన పడవల ఇజారా వ్యాపారముచేసి సంపన్నులైన కొండుమహంతి చిన్నస్వామిగారి మేడకు ఎదురుగా కాపురముండు నెప్పల్లి రామబ్రహ్మంగారి అల్లుడు అల్లరచిల్లరగా తిరుగుచున్న వానిని లక్ష్మీనరసింహంగారు చేరదీసి సత్ర ములో భోజనము పెట్టించుచు అతని సేవింగ్సుబ్యాంకు బుక్కును తమదగ్గర నుంచు కొనుట, నెప్పల్లివారిపిల్లను పంపించవలసినదని అతడు వారిని ఒత్తిడిచేయుట, ఇదంతయు లక్ష్మీనరసింహముగారేదో దురుద్దేశముతో చేస్తున్నారని అందరితోను చెప్పడం ప్రారంభించినారని, అందుపైన లక్ష్మీనరసింహముగారు నెప్పల్లివారి ఇంటి పైన రాళ్ళువేయించుచున్నారని వారు వీరేశలింగముగారితో మొఱపెట్టుకొనగా, ఆయన మధ్యవర్తిగావచ్చి కల్పించుకొని నెప్పల్లివారింటిపైన పడిన రాళ్ళవంటివే, చిన్నస్వామిగారి మేడమీద నుండగాచూసి వారిని మందలించగా, లక్ష్మీనరసింహం గారి చాకలివాఁడు బహిరంగంగానే రాళ్ళువేస్తూవుంటే మమ్ములను నిందిస్తారేమిటి అన్నారని, అంతట పంతులుగారు లక్ష్మీనరసింహంగారి మిత్రులైన బయ్యపునీడి వెంకటజోగయ్యగారియెదుట లక్ష్మీనరసింహంగారిని తగాదాపరచినట్లున్ను, ఆయన సరియైన సమాధానం చెప్పకపోగా మందలించారని పంతులుగారు వ్రాశారు. అటు తరువాత పంతులుగారు యిళ్ళపైన రాళ్ళువేయించుచున్నవారు పెద్దమనుష్యులుగా పరిగణింపబడుతున్నారని వివేకవర్ధనిలో ఒకవ్యాసమును ప్రకటించారు. ఇంతే కాదు, పంతులుగారు మునిసిపలు రాజకీయాలలో లక్ష్మీనరసింహముగారి ప్రత్యర్థియైనన్యాపతి సుబ్బారావు పంతులుగారి పక్షమున చేరి లక్ష్మీనరసింహంగారి చెయిర్మను పదవిని గూర్చి వ్యంగ్యముగా "మహారణ్యపురాధిపత్య" మనే గొప్ప ప్రహసనమును పంతులుగారు రచించి 1889 సంవత్సరములోనే వివేకవర్ధనిలో ప్రచురించారు. ఇది గాక పంతులుగారు వివేకవర్ధనిలో ప్రచురించిన "తిర్యగ్విద్వన్మహాసభ" అను ఇంకొక ప్రహసనములో కూడా వివిధ జంతువులుగా వర్ణింపబడిన పురజనులలోని కొందరుచేసే సంభాషణలలో లక్ష్మీనరసింహంగారినిగూర్చి వ్యంగ్యముగా వ్రాశారు. రాజమహేంద్రవరములో అక్షరజ్ఞానమున్న చదువరులకు లక్ష్మీనరసింహముగారి నీతినిజాయితీలను గురించి ప్రవర్తననుగూర్చి అనుమానము కలిగేవిధంగా అనేక

అపకీర్తికరమైన సంగతులు స్ఫురించేవిధంగా పంతులుగారు తమ వ్యంగరచన సాగించారు.

అంతట లక్ష్మీనరసింహముగారిమీద పరువునష్టము చేసిననేరానికి రెండుక్రిమినలు కేసులు, ఒక సివిలుదావాను దాఖలుచేశారు. పూర్వం అనేక వ్యవహారాలలో గొప్ప అధికార్లు, ప్లీడర్లు వగైరాల లంచగొండితనము దుర్మార్గాలను బహిరంగ పరచి కోర్టు వ్యవహారములలో ఆరితేరిన వీరేశలింగముగారు తమవకీలు న్యాపతి సుబ్బారావుపంతులుగారి సలహాతో లక్ష్మీనరసింహముగారు దాఖలుచేసిన క్రిమినలు కేసులో "Justificaton plea 'పెట్టి, ఆయన నిర్వహించే పాఠశాల వ్యవహారములలో ఇతర వ్యవహారములలో భారీచెయ్యిగా ఖర్చులుపెడుతూ జమాఖర్చులతో ఉత్తరప్రత్యుత్తరాలలో అజాగ్రత్తగా నుండేవారని ఎరిగిన పంతులుగారు ఆవిషయములలోని లోటుపాట్లు తెలుపగల సాక్ష్యసాధనాలు సంపాదించి లక్ష్మీనరసింహంగారిని తమప్లీడరుగారిచేత వీటినిగూర్చి ప్రశ్నింపిస్తే, ఆయన సమర్థించుకోలేడని అంతట ఆయన ప్రవర్తనపైన కేసువిచారించే మేజిస్ట్రేటుకు అనుమానంకలిగి తాముచేసిన వ్యంగ్యారోపణలను కేవల విమర్శగావించి కేసుకొట్టివేయగలడని ఎరిగినవారైనందువల్ల పంతులుగారాప్రకారం కేసు నడిపించారు. అంతట మేజస్ట్రేటు లక్ష్మీనరసింహంగారి వాఙ్మూలములోని పరస్పర విరుద్ధములైన జవాబులు గమనించి, పంతులుగారు నేరంచెయ్యలేదని కేసు కొట్టివేశారు. శ్రీ ఆంధ్రకేసరి ప్రకాశంగారు తమస్వీయచరిత్రలో ఈవిషయాన్నిగూర్చి వ్రాస్తూ లక్ష్మీనరసింహముగారికి కొంచెము స్త్రీవాంఛ వున్నమాటనిజమేగాని ఆయన లోకులసొమ్ము హరించే మనిషికాడని వ్రాశారు.

పంతులుగారు ప్రత్యక్షంగా వేశ్యను ఇంటిలోపెట్టుకొన్న శిష్యులతోను, స్త్రీలోలురుగా పేరుపడ్డ పెద్దమనుష్యులతోను చెలిమిపాటించి వారిని ఖండించకుండా ప్రశంసిస్తూ స్వీయచరిత్రలో వ్రాశారు. స్వతంత్రాభిప్రాయాలు కలిగి, వారితో కార్యకలాపములలో భేదించినవారినిమాత్రం శత్రువులుగా చూస్తూ వారినిగూర్చి అన్యాయంగా వ్రాశారు.

## ప్రకాశంగారి మాటల్లో :

ఏలూరి లక్ష్మీనరసింహంగారే మొదటి నానఫీషియల్ చైర్మన్, మునిసిపాలిటీలో ఆయన కిరీటములేని రాజులాగ చలామణీఅయ్యాడు. అప్పటికే (న్యాపతి) సుబ్బారావుపంతులుగారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, నేతి సోమయాజులుగారు మొదలైనవారు, పురప్రముఖులై, ఏలూరి లక్ష్మీనరసింహంగారిని ఓడించడానికి అవకాశం వచ్చినప్పుడల్లా ఏదోవిధంగా ప్రయత్నిస్తూనే ఉండేవారు. ఆయన మీద ఏవో రకరకాల పన్నాగాలు పన్నేవారు. సుబ్బారావుపంతులుగారు ప్రసిద్ధరాజ

కీయ నాయకులై ఆతరవాత 'ఆంధ్రభీష్మ' బిరుదం పొందగలిగారు, కాని, అప్పట్లో స్థానికరాజకీయాల్లో బహులౌక్యులు. తను వెనకాలవుండి తమ ముఖ్యశిష్యులచేత తమాషాగా నాటకమాడించేవారు. ఆయనకి అదొకవిలాసం! ఇతరులమీద బహు నేర్పుగా దెబ్బలు తీస్తూ ఉండేవారు! కాని ఏలూరి లక్ష్మీనరసింహంగారుమాత్రము లొంగేవారుకారు. మెరకవీధి "తెలగాలు, షాహుకార్లుకొందరు, ఆయనకిపట్టుగా ఉండి సుబ్బారావు పంతులు ప్రభృతులుచేసే ఎత్తులు అన్నీ భగ్నముచేసేవారు.

లక్ష్మీనరసింహంగారిమీద అనేకరకాల నిందలుపడ్డాయి. అయనకి స్త్రీలోల త్వము ఉండేది. కాని ప్రజలసొమ్ము సద్వినియోగం చేసుకొనే మనిషిమాత్రముకాడు. కాని చాలాకాలానికి సుబ్బారావుపంతులు ప్రభృతులు ఆయనమీద ఎత్తినదండయాత్ర లకి లొంగిపోయాడు. సుబ్బారావుపంతులు ప్రభృతులకు వీరేశలింగము పంతులు గారు, ఆయన వివేకవర్ధనీ పత్రికకూడ తోడయ్యాయి. ఏలూరి లక్ష్మీనరసింహం గారిమీద అపత్రికలో వ్యంగ్యంగా అనేక చిత్రమైన కథలు వ్రాసేవారు. అందుమీద లక్ష్మీనరసింహంగారు, పరువునష్టందావా వేశారు. ఆ దావాలో జస్టిఫికేషన్ ప్లీపెట్టి లక్ష్మీనరసింహంగారిని అనేక సాక్ష్యాలతోటీ, సంపన్నాలతోటి బాగా అల్లరిపెట్టారు. అందుచేత ఆయన నిస్పృహచెంది ఈరాజకీయాల్లో నిడమర్తి దుర్గయ్యగారిని తన స్థానే ప్రవేశపెట్టారు." (నాజీవితయాత్ర, పుటలు. 85-86)

పంతులుగారు నేర్పరియైన గ్రంథకర్తగనుక, తమ స్వీయచరిత్రలో లక్ష్మీ నరసింహంగారిని నిందిస్తూ మేజస్ట్రేటు వ్రాసినతీర్పుయొక్క ఇంగ్లీషు, తెలుగు పాఠాలను పూర్తిగా ముద్రించి దానికి వక్రభాష్యం చేశారు. సివిలుదావా విచారణ రెండేళ్ళు వాయిదాలుపడినది. దానివిచారణలో రాజమహేంద్రవరములోగల ప్రముఖు లనేకులు సాక్ష్యమిచ్చారని, అదిచాలా సంచలనం కలిగించినదని చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు తమ స్వీయచరిత్రలో వ్రాశారు. ఆదావా విచారించిన న్యాయాధిపతి ఉభయపక్షాల సాక్షిసాధనాలను జాగ్రత్తగా గమనించి, పంతులుగారు లక్ష్మీనర సింహంగారిపైన చేసినఆరోపణలు, వ్రాసినవ్రాతలు పరువునష్టము కలిగించినమాట నిజమే అని తీర్మానిస్తూనష్టపరిహారమును నిర్ణయించడములోమాత్రము దయదలచి నిమిత్తమాత్రముగా ఒక అణాడిక్రీ ఇచ్చారు.

ఈకేసులోని సంగతులనుగూర్చిన వివరాలుగాని న్యాయాధిపతితీర్పునుగాని పంతులుగారు తమ స్వీయచరిత్రలో నుదాహరించకుండా దాటవేశారు. దానికి కార ణము అందులో లక్ష్మీనరసింహముగారినిగూర్చి మాత్రమేగాక తమనుగూర్చికూడ అనేకవిషయా లుండడంవల్ల, తమ నీతినిజాయితీలకు భంగముకలుగుతుందనే భయ ము వల్లనే ముద్రించలేదు.

## చిలకమర్తివారి మాటల్లో :

లక్ష్మీనరసింహగారిని గూర్చి చిలకమర్తివారుకూడ తమ స్వీయచరిత్రలో వ్రాస్తూ, ఆయనను కొందరు విమర్శిస్తూ దుర్మార్గునిగా చిత్రించేవారని, కొందరు ఆయన ఆపద్బాంధవుడని, సర్వజనసులభుడని మెచ్చుకొనేవారని వ్రాసి ఆయనలో కూడా కొన్ని సుగుణములున్నవని, ఆయన తమ స్నేహితుడని, తాము వారింటికి వెళ్ళేవారమనికూడా వ్రాశారు. చిలకమర్తివారు పంతులుగారి పక్షమువారని, తనకు వ్యతిరేకంగా పనిచేస్తున్నారని తెలిసికూడా వారితో విరోధము పూనక స్నేహంగానే లక్ష్మీనరసింహంగారు ఉండేవారు.

ఆంధ్రకేసరి ప్రకాశంగారూ, చిలమర్తివారూ వ్రాసినదానికి విరుద్ధముగా వీరేశలింగంగారు, లక్ష్మీనరసింహంగారిని ఒకదుర్మార్గునిగా చిత్రిస్తూ అందు కనుగుణములైన సంగతులు వ్రాశారు.

పంతులుగారిలాగ వ్రాయడానికి కారణములేకపోలేదు. తమ ఇద్దరిమధ్య శత్రుత్వం ఏర్పడగా లక్షినరసింహముగారు తమతోసమానమైన ప్రతిభాశాలియైనందు వల్ల ఆయన తమకు కంటకుడైనందువల్ల సహించక ఇలాగ వ్రాసినట్లెంచవచ్చును.

"కంటికి నిద్రవచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటక మిందునే యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగల యట్టి మనుష్యున కెన్నడేనియన్
గంటకుడైన శాత్రవుడొకండు దనంతటి వాడుగల్గినన్"

అని శ్రీనాధమహాకవి కాశీఖండంలో వింధ్యనుగూర్చి వ్రాసిన పద్యం అక్షరాల నిజం.

వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రలో ఏలూరి లక్ష్మీనరసింహముగారిని గూర్చి వ్రాసిన సంగతులేగాక ఆత్మూరి లక్ష్మీనరసింహగారిని గూర్చి వ్రాసిన సంగతులు కూడా చదువరులకు ఆశ్చర్యము కలిగించేటట్లుగా నుంటాయి. అవి ఒక వరుసక్రమములో నుండవు. పంతులుగారు తమ రచనాపాటవ నైపుణ్యమువల్ల బ్రహ్మని తిమ్మినిగా చేయగల శక్తి గలవారు. దానిని తలక్రిందులు చేయగలరు. అందువల్ల దానిని గూర్చి వ్రాసేటప్పుడు తమమంచితనము, గొప్పతనము, వారి చెడ్డతనము, అల్పత్వము ప్రకటింపబడేటట్లు వ్రాయగలరు. వారి స్వీయచరిత్రను ఈ దృష్టితో పరిశీలించాలి.

1889 సంత్సరంలో ఏలూరి లక్ష్మీనరసింహముగారితో నెప్పల్లి వారి ఇంటిపైన రాళ్ళువేయించారని పంతులుగారు మధ్యవర్తుల దగ్గర తగవుపెట్టగా, పెద్దమనుష్యులు చేరి లక్ష్మీనరసింహంగారిని మందలించారని, వారిలో వారి మిత్రుడు బయ్యపునీడి వెంకటజోగయ్య గారుకూడా ఉన్నారని పంతులుగారువ్రాశారు. లక్ష్మీనరసింహంగారు

మొగము చిన్నదిచేసుకొనివెళ్ళిపోయారట. అప్పుడక్కడనున్న దామరాజు నాగరాజు గారు, లక్ష్మీనరసింహగారి మీద ఫిర్యాదు దాఖలు చేస్తామన్నారుట: అంతట పంతులు గారు సామాన్యులకు గొప్పవారికి మధ్య తగాదా వచ్చినపుడు సామాన్యముగా దండ విధాయకుని (మేజిస్ట్రేటు) వద్ద, ముఖ్యముగా స్వదేశీయ దండ విధాయకుల యొద్ద న్యాయము దొరకదని, ఫిర్యాదు చేయవద్దని అన్నారట. అయినప్పటికీ నాగరాజుగారు దాఖలుచేశారట. అసలు నెప్పల్లివారు కేసుపెట్టలేదు. పంతులుగారిని, మాదిరెడ్డి వీర స్వామి నాయుడుగారిని సాక్షులుగా వేశారట. ఆకేసువిచారించే సబుమేజస్ట్రేటు తిప్పి తిప్పి తుదకు కొట్టివేశాడని పంతులుగారు. తమ స్వీయచరిత్రలో వ్రాశారు. (చూడుడు పుట 22) పైన తెల్పినసంగతులవల్ల లక్ష్మీనరసింహముగారిపైన యుద్ధమారంభించి నది పంతులుగారే అని తెలుస్తుంది. ఒక మధ్యమనిషిచేత ఆకేసు పెట్టించినవారు పంతులుగారే ననడంలో సందేహము అవసరములేదు.

గవర్నమెంటు కాలేజి ప్రిన్సిపాలు మెట్కాఫు దొరగారు లక్ష్మీనరసింహం గారికి, పంతులుగారికి రాజీ చెయ్యడానికి ప్రయత్నించారుగాని పంతులుగారువినలేదు. మీరు క్షమాపణ చెప్పనక్కరలేదు. లక్ష్మీనరసింహంగారి ప్రవర్తన మంచిదికాదనీ ఇతరులన్నమాటలు నమ్మి నేను అలాగవ్రాశాను ఇప్పుడాయనప్రవర్తన మంచిదే యని కొందరంటున్నారు గనుక నా అభిప్రాయాలను మార్చుకుంటున్నాను అంటే చాలునన్నారు. అంతట పంతులుగారు అలాగ అంగీకరించను. ఆయన ప్రవర్తన మంచిదికాదనే ఇప్పటికీ నేను నమ్ముతున్నాను అన్నారట!

పైడావారి ట్రస్టుసొమ్ము విషయమై ఆత్మూరివారితో పంతులుగారు విరోధించి గుత్తికి బదిలీయై వెళ్ళనతర్వాత వారి నాశ్రయించినవారు ఏలూరివారిని ఆశ్ర యించడము ప్రారంభించినారు. నల్లగొండ కోదండరామయ్యగారికి భార్యావియో గము కలిగినది. మళ్ళీ ఒకవితంతు వివాహము చేసుకోదలచినాడు, కాని పంతులు గారు పట్టించుకోలేదు. పంతులుగారికి అతను వ్యతిరేకముగా పనిచేశాడు. అతనంటే పంతులుగారికి పగ. అంతట అతడు ఏలూరివారిని ఆశ్రయించాడు. అంతట ఆయన ఆవివాహానికి కావలసినఖర్చునంతా తామేభరించి, 18-10-1888తేదీన ఆవివాహము జరిగించారు. అదే లక్ష్మీనరసింహంగారిపై పంతులుగారి పగకు పెద్దకారణమయి నది. ఆవివాహానికి పంతులుగారు వెళ్ళలేదుసరికదా దానినిగూర్చి స్వీయచరిత్రలో వ్రాయనైనాలేదు!

వితంతువివాహము చేసుకున్న దంపతులు వీరేశలింగము పంతులుగారికి కొత్తవితంతువివాహాలు జరిపి పేరుపొందాలనే ఉత్సాహము ఉన్నదేగాని పాత దంపతుల కష్టములనుగురించి ఆలోచించి వారికి సహాయము చేయడములేదని 1893 సం॥ లో వితంతువివాహ సంఘమునకొక అర్జీనిచ్చారు. ఈవిషయము లియోనార్డుగారు వ్రాస్తూ 1893 జూన్ 23వతేదీ గల MEP MRO రికార్డును ఆధార పత్రముగా ఉదాహరించారు.

## మున్సిపాలిటీలో పంతులుగారు :

రాజమహేంద్రవరము మునిసిపలు సంఘ వ్యవహారములనుగూర్చి లియోనార్డు బాగా పరిశోధించి మరియొకగ్రంథమును రచించాడు. పంతులుగారు మునిసిపలు సంఘసభ్యత్వమును తమ బాలికా పాఠశాలకు గ్రాంట్లు సంపాదించడానికి, తమ సంఘసంస్కరణోద్యమానికి వ్యతిరేకులైనవారిపైన కక్ష సాధించడానికి ఉపయోగించుకున్నారని స్పష్టముగా వ్రాశాడు: దీనివల్ల పంతులుగారి నీతినిజాయితీలు పూర్తిగా దెబ్బతిన్నవి. లక్ష్మీనరసింహంగారు చేశారన్నపనినే వీరు చేశారు. ఆకాలములో మునిసిపాలిటీలకు సభ్యులనెన్నుకునేపద్ధతిలేదు. ప్రభుత్వమువారు కలెక్టరు సిఫారసునుబట్టి కొందరిని సభ్యులుగా నియమించేవారు. అందులో ప్రభుత్వ ఉద్యోగులే హెచ్చుసంఖ్యలో నుండేవారు. కొందరు రాజభక్తి కలవారిని, అధికారుల ప్రాపకం సంపాదించినవారిని, సభ్యులుగా నియమించేవారు. ప్రారంభంలో కలెక్టరే చెయిర్మనుగా నుండేవాడు. అటుతరువాత పెద్ద ఉద్యోగాలు చేసేదొరలను, దేశీయు లను చెయిర్మనుగా నియమించేవారు. ఆటుతరువాత ఎన్నికలపద్ధతి వచ్చింది. ఎన్ని కలద్వారా ఎన్నికైన తొలిచైర్మన్ ఏలూరి లక్ష్మీనరసింహముగారే.

1881 సం॥ సెప్టెంబరు నెలలో రాజమహేంద్రవరము మునిసిపలుకౌన్సిలులో సభ్యులుగా నియమించబడినవారు ప్రభుత్వస్కూళ్ళ ఇనస్పెక్టరయిన మన్రోదొర గారు, స్కూళ్ళ డిప్యూటీఇనస్పెక్టరయిన సి. నాగోజీరావు పంతులుగారు, కాలేజీ ప్రిన్సిపాలు మెట్కాఫ్‌దొరగారు, కాలేజీలో తెలుగుపండితులైన వీరేశలింగం పంతులుగారు, ఉపాధ్యాయులైన ఏలూరి లక్ష్మీనరసింహంగారు, ఊరిలోని వర్తక ప్రముఖులైన నరిసల్లి కృష్ణమ్మగారు, ప్లీడరైన చిర్రావూరి యగ్గన్న శాస్త్రిగారు. వీరిలో చివరివారు వీరేశలింగంగారి సంఘసంస్కరణ, వితంతువివాహ ఉద్యమా లకు వ్యతిరేకులైన పూర్వాచార పక్షీయులు. వారి అభిమానిగా నుండేవారు.

అప్పట్లో మునిసిపాలిటీలో అవినీతి ప్రబలియుండేదని, దానిని నిర్మూలించ డానికి తాము కష్టపడి పనిచేశామని, మునిసిపలు స్థలాల ఆక్రమణ తొలగించడానికి ధైర్యంతో పనిచేశామని, పన్నులవిధింపులలోని వ్యత్యాసాలనుగూర్చి పనిచేశామని, ఇంకా చాలా ఘనకార్యాలు చేశామని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు. అయితే వారి జీవితచరిత్రను పరిశోధించిన అమెరికా దేశీయుడైన లియొనార్డు, పంతులుగారు తమ సభ్యత్వము నుపయోగించుకొని, తమ బాలికాపాఠశాలకు గ్రాంట్లు సంపాదించుకొన్నారని, తమ సంఘసంస్కరణకు వ్యతిరేకులైనవారిపైన కక్ష సాధించేచర్యలు జరిపారని చాలసమాచారము యిచ్చాడు.

1882 సం॥ లో తమపాఠశాలకు పదిరూపాయల గ్రాంటును 1884 సం॥ లో ఇరవై రూపాయలకు పెంపుచేయించుకోగలిగారని, అటుతరువాత నాగోజీరావుపంతులు గారు చెయిర్మనుగానుండగా గ్రాంట్లు మునిసిపలు ఫండునుండి ఇచ్చేదానికిబదులుగా

ప్రొవినిషియల్ ఫండులలోనుంచి గ్రాంటులు ఇచ్చేవిధానంరాగా వారిదయవల్ల, 1886 సం॥ లో రూ. 140/- రెండవదఫా గ్రాంటుసంపాదించారని, 1887 సం॥లో తమ ప్రియమిత్రులు న్యాపతి సుబ్బారావుగారు చెయిర్మనుగానుండగా, ఇద్దరు కాలేజీ లెక్చెరర్ల తోడ్పాటుతో రు. 120/- గ్రాంటు సంపాదించుకున్నారని, లియోనార్డు వ్రాశాడు. అసంగతులను ధ్రువపరిచే చరిత్రాధారాలను వివరించాడు.

పంతులుగారు ఆంగ్లేయప్రభుత్వముపట్ల భక్తిగలవారు. దొరలపట్ల వినయవిధేయతలుగలిగి, వారిస్నేహమును సంపాదించేవారు. ఉద్యోగులను ఆశ్రయించేవారు. అందువల్ల మొదటిటరము ముగిసినతరువాత 1884 సం॥ లో మళ్ళీ ఆయనను మునిసిపలు సభ్యునిగా నియమించారు. ఏలూరి లక్ష్మీనరసింహంగారిని నియమించలేదు. లక్ష్మీనరసింహంగారు తమ ఆస్తిక పాఠశాలలో పిల్లలజీతాలు తగ్గించి,ఇతర పాఠశాలలలోని పిల్లలనుఆకర్షిస్తున్నారని అధికారులకాయనపైన ఈర్ష్యకూడాకలిగింది.

పంతులుగారు అధికారుల ప్రాపకంతో బాగా పేరుసంపాదించగా, 1885సం॥లో ఆయనకు "రాయసాహెబు" బిరుదువచ్చింది. రావుబహదూరు బిరుదు మరోఏనిమిదేళ్ళతర్వాత వచ్చింది.

1888 సం॥ లో మునిసిపాలిటీ చెయిర్మను పదవికి ఎన్నికపద్ధతి రావడంతో పట్టణంలోని ప్రజలలో గొప్పపలుకుబడి సంపాదించిన ఏలూరి లక్ష్మీనరసింహంగారు చెయిర్మనుగా ఎన్నుకోబడినారు. ఆయనను ఏవిధంగానైనా పదవీచ్యుతుని చేయాలని గవర్నమెంటు ప్లీడరు, మునిసిపలుసభ్యుడునైన న్యాపతి సుబ్బారావుగారు కుట్రలు పన్నడం ప్రారంభించారు. న్యాపతి సుబ్బారావుగారు గవర్నమెంటు ప్లీడరై, మునిసిపలు సభ్యులుగా నియమింపబడినవారు. వీరేశలింగం పంతులుగారు మునిసిపలు సభ్యులుకాకపోయినా సుబ్బారావుగారి పక్షానచేరి, వివేకవర్ధనిలో లక్ష్మీనరసింహంగారిపైన అనేకనిందలుమోపుతూ, వ్యంగ్యంగావ్రాయడం ప్రారంభించారు. దీనిఫలితంగా విరోధాలు ప్రబలి వ్యవహారము కోర్టుకెక్కినసంగతి పైన వివరించబడినది.

1888 సంవత్సరంలో కాలేజిప్రిన్సిపాలు మెట్కాఫ్‌గారు, ఊరిలోని పాఠశాలలన్నిటిని ఏకంచేసి పెద్దపాఠశాల స్థాపించేప్రణాళిక నేర్పాటుచేశారు. ఏలూరివారి ఆస్తికపాఠశాలకూడా అందులోకలిపి వారినే ప్రధానోపాధ్యాయులుగా చేశారు. ఇది వీరేశలింగంగారికి చాలా బాధకలిగించి, అగ్గిపైన గుగ్గిలం జల్లినట్లయినది. పంతులుగారికి, లక్ష్మీనరసింహంగారికి రాజీచెయ్యడానికి మెట్కాఫ్‌గారు ప్రయత్నిస్తే పంతులుగారు వినలేదు।

పంతులుగారు తమ శక్తియుక్తులవల్ల రచనావృత్తివల్ల గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించారు. తమమాటను కాదనేవారెవరుంటారనే ధీమాతో తమస్వీయచరిత్రలో ఉన్నవిలేనివి కల్పించివ్రాశారు. అందువల్ల ఆనాటి ఇతరచరిత్రాధారాలను జాగ్రత్తగా చదివి నిజానిజాలు తేల్చనిదే పంతులుగారి వ్రాతలు నమ్మడానికివీలులేదని లియోనార్డుగారి పరిశోధన గ్రంథమువల్ల రూఢియైనది.

# బసవరాజువారి మార్గదర్శకత్వం

బసవరాజు గవ్రరాజుగారు రాజమహేంద్రవరం కాపురస్థులు వీరేశలింగం పంతులుగారికన్న ఏడేళ్ళ చిన్నవారు. వీరు 1855 సం॥ లో జన్మించారు. పాఠశాలలో నాలుగవ తరగతిలో డబుల్‌ప్రమోషను పొంది 1872 సం॥ లో మెట్రిక్యులేషన్ పాసైనారు. రాజమహేంద్రవరం కాలేజీలో ఎఫ్. ఏ. ప్యాసై ధనాభావం వల్ల బి. ఏ. తరగతిలో చేరజాలక 1875 సం॥ లో రాజమండ్రి కాలేజి నంటియున్న పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరారు.

గవ్రరాజుగారు వారిమిత్రులు కలిసి "రాజమహేంద్రవరం ప్రొవిన్షియల్ స్కూలు క్లబ్బు" అనేపేరుతో ఒక నీతిసమాజాన్ని స్థాపించారు. నీతిధర్మాలను గూర్చి ప్రసంగించడము తామాప్రకారము నడచుకొనడము, ఇతరులనాప్రకారము నడిపించడము దాని ఉద్దేశాలు. దాని కార్యదర్శి గవ్రరాజుగారే. ధవళేశ్వరం స్కూలు ప్రధానోపాధ్యాయులుగా పనిచేస్తున్న వీరేశలింగంగారిని తమ సమాజ ప్రారంభదినమున ఉపన్యసించవలసినదని, అందులో సభ్యులుగా చేరవలసినదని కోరగా పంతులుగారు ఐకమత్యాన్ని గూర్చి ఉపన్యసించి అప్పటినుండి ప్రతిఆదివారము వెళ్ళి ఆసమాజసభలలో పాల్గొనడం ప్రారంభించారు.

పంతులుగారు సమాజాలు స్థాపించి వానిద్వారా సంఘసంస్కార ప్రచారము చేయడానికి గవ్రరాజుగారే మార్గదర్శి. 1876 నవంబరు 1 వ తేదీనుండి కాలేజీలో రెండవ తెలుగుపండితులుగా పంతులుగారు పనిచేస్తూవున్నప్పుడు గవ్రరాజుగారితోను ఏలూరి లక్ష్మీనరసింహం, బుర్రా రాజలింగశాస్త్రిగార్లతోను కలిసితిరుగుతూ వివేకవర్ధని పత్రికానిర్వహణలో వారి సలహాసహాయములు పొందుతూవుండగా వీరి విమర్శలకు గురియైనవారు వీరిని దుష్టచతుష్టయమనీ పిలిచేటంత సన్నిహితులుగానున్నారని స్వీయచరిత్రలోనే వ్రాశారు. వివేకవర్ధని ఇంగ్లీషు సెక్షన్ గవ్రరాజుగారే చూచేవారు. అప్పటి లగాయతు గవ్రరాజుగారు 1888 సం॥ లో చనిపోయేవరకు పంతులుగారికి కుడిభుజముగానుండి అన్ని కార్యాలలో తోడ్పడినారనికూడా వ్రాశారు. వీరు బి. ఎ. బి.యల్, ప్యాసయ్యారు. లాయరుగా మంచి ప్రాక్టీసు సంపాదించారు. అటుతరువాత వీరేశలింగంగారు స్థాపించినట్లుగా వ్రాసికొన్న ప్రార్థన సమాజములలో, సంఘసంస్కరణ సమాజములలో వేశ్యలకు ఒసగులు, వసూళ్ళ నిషేధ సమాజములలో, స్త్రీ పునర్వివాహసమాజము మొదలైన అన్నిసమాజములలో గవ్రరాజు

గారు వీరేశలింగంగారితోపాటు ప్రధానపాత్ర వహించారు. ఇంతేకాదు. ఆసమాజాల నిర్వహణలో కష్టపడిపనిచేసి కార్యాలు సాధించేవారు. వారిసలహాసహాయాలు లేనిదే వీరేశలింగంగారు ఏపనీ చేయలేదనేసంగతి స్వీయచరిత్రవల్లనే తెలుస్తుంది.

తొలి వితంతు వివాహానంతరం వెలివేయ బడ్డారు. ప్రాయశ్చిత్తం చేయించుకోకుండా నిలబడ్డారు. తనకు తోడియల్లుడైన చిత్రకామరాజుగారిపై తెచ్చిన అభియోగంలో పంతులుగారితో నిలిచారు.

వీరేశలింగంగారు ముక్కోపి. వారు చెప్పినదానికెవరైనా వ్యతిరేకంగా మాట్లాడితే సహించేవారుకాదు. వారిపై పగబట్టేవారు. వారిని సాధించేవారు. అనేక మంది మిత్రులను విరోధులుగాచేసికొన్నారు. గవర్రాజుగారు పంతులుగారు తొందర పడకుండామంచి సలహాలనిచ్చి అనేక సందర్భాలలో తగాదాలురాకుండా కాపాడారు. ఏలూరిలక్ష్మీనరసింహంగారితో విరోధం పెట్టుకొనవద్దని పంతులుగారికి సలహా యిచ్చారు. 1888 సం॥లో గవర్రాజుగారు చనిపోయిన తరువాతనే స్నేహితులతో పంతులుగారి విరోధాలు మొదలయ్యాయి. వీరేశలింగం పంతులుగారు ఏలూరి లక్ష్మీ నరసింహంగారితో, ఆత్మూరి లక్ష్మీనరసింహంగారితోనూ విరోధము పెంచుకొని కోర్టు వ్యవహారాలలో దిగి చాలాచిక్కులకు లోనైనారు. అటుతర్వాత వారికి మంచి సలహాలిచ్చేవారు లేనందువల్లనే పంతులుగారు న్యాపతి సుబ్బారావుగారితోకూడా విరోధించారు. అందువల్లనే పంతులుగారు అనేక అవకతవకపనులుచేసి అప్రతిష్ఠపాలైనారనే దానిలో సందేహంలేదు.

నిజానికి పంతులుగారికి వచ్చిన పేరుప్రతిష్ఠలకు ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు, గవర్రాజుగారు ఆరంభించిన కార్యాలు ముఖ్యకారణములనీ చెప్పవచ్చునుగాని అంతా తమ ప్రయోజకత్వమేయని పంతులుగారిఊహ. పంతులుగారికి 1893సం॥లో రావుబహదరు బిరుదురావడంతో అహంభావము పెరిగిపోయినది. ఈసంగతి లియొనార్డు వ్రాసియున్నాడు. నిజానికి అంతతుముందే, అనగా 1885 లో రావుసాహబ్ వచ్చిననాటినుండే అహంకరించారు.

పంతులుగారు గవర్రాజుగారి జీవితచరిత్రను ప్రత్యేకంగాకూడా వ్రాశారుగాని ప్రతిసందర్భములోను తమ ప్రాధాన్యతను గొప్పదనాన్ని ప్రకటిస్తూ వచ్చారేగాని గవర్రాజుగారి మార్గదర్శకత్వమును గూర్చి వివరించలేదు. గవర్రాజుగారు నిగర్వి. ఆయన ఎంతగొప్ప కార్యమును సాధించినా దానినిగూర్చి ఎక్కువగా చెప్పరు. ప్రతివిషయంలోను పంతులుగారికే ప్రాముఖ్యమునిస్తారు జాగ్రత్తగా పరిశీలిస్తే వీరేశలింగంగారుచేసిన స్వార్థత్యాగంకంటె గవర్రాజుగారు చేసిన స్వీయప్రాధాన్యత్యాగమే చాలాగొప్పదనకతప్పదు. గవర్రాజుగారి జీవితమునుగూర్చి ప్రత్యేకముగా పరిశోధించి ఒకగ్రంథమును రచించడం అవసరమనీ నా అభిప్రాయం.

# మంగమ్మ కథ

వీరేశలింగం పంతులుగారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు 1910, ఆగస్టు 12వ తేదీన చనిపోయారు. ఆమె మరణానంతరం పంతులుగారి జీవితం అల్లరిపాల యింది. పరువునష్టం కేసుతో కొట్టుపాలయింది. అదంతా మంగమ్మకథగా లోకప్రసిద్ధ మయింది. ఆవృత్తాంతాన్ని స్వీయకథలో పంతులుగారు సరిగా వ్రాయలేదు.

"శ్రీమతి మంగమ్మ వితంతుశరణాలయములో నుండినవారిలోనెల్ల నాభార్య కధికప్రియురాలు. అందుచేతనే యీసారియామెను నాభార్య (1910 ఏప్రిల్‌లో) (బెంగుళూరికి) వెంటగొనివచ్చినది. నాభార్యకామెయందు పుత్రికావాత్సల్యము. ఆమె కును నాభార్యయందు మాతృస్నేహము. ఆమె వితంతుశరణాలయములోనే యుండి నను తరుచుగా మాయింటికివచ్చి నాభార్యకు సమస్తోపచారములను జేసిపోవుచుండె డిది. నాభార్య నాతో మన మంగమ్మను వివాహముచేసి పంపివేయవలదనియు, పెండ్లి చేసి, మనయొద్దనే యుంచుకొందమనియు పలుమారు చెప్పుచుండెను."

మంగమ్మకు ఆమె అన్నగారంపిన పదిరూపాయలతో మద్రాసులో ఆమెకొక చీరకొని యిచ్చినప్పుడు, తమ సొమ్ముతోనే కొనయియ్యవలసినదని రాజ్యలక్ష్మమ్మ గారు సూచించియుండగా, ఆమెగారు బొంబాయివెళ్ళినప్పుడు కొన్న పండ్రెండు రూపాయల చీరను ఆమెమరణించినవెంటనే పంతులుగారు మంగమ్మకు యిచ్చినట్లు స్వీయచరిత్రలో చెప్పారు.

"నాభార్యకు ప్రియతమురాలైన మంగమ్మ యామె నిమిత్తము బెంగపెట్టు కొని రోగపడెను. నేనామెకు మందులిప్పించుచు వచ్చితినిగాని మనోవ్యాధికి మందు లేదన్నట్టు చిరకాలమునకుగాని యామెస్వస్థపడినదికాదు" అని స్వీ. చ. లో వ్రాశారు.

తమ దుఃఖముమాత్రము "ఓయీ! దుఃఖపడబోకుము. ఇది మీ యుభయుల మేలుకొరకే జరిగినది" అని భగవద్వాణిగా రాజ్యలక్ష్మమ్మగారు చనిపోయిన తెల్ల వారుజాముననే వినిపించినంతనే తనకున్న విచారమంతయు క్షణములో నదృశ్యమై మనస్సు నిర్మలమయి నిర్విచారమయ్యె"నని వ్రాసుకొన్నారు. మానసికంగా వెంటనే వారు తేరుకొన్నారేమో తెలియదుగాని వారి ఆరోగ్యముమాత్రము దెబ్బతిన్నది. అన్నసదుపాయము కుదరక ఆరోగ్యము కుదుటపడలేదని వ్రాసుకొన్నారు. మంగమ్మ

మాత్రము పైకిఆరోగ్యముగానున్నను ఆమెగారివిషయమై బెంగపెట్టుకొనగా మందు లిప్పింపవలసివచ్చినదట!

తమభార్య పోయినతరువాత తమకుకలిగిన అసౌకర్యములను వీరేశలింగం గారు "స్వీయచరిత్ర"లో వివరించారు. పులవర్తి సుబ్బారావుగారింట భోజనం సరి పడలేదు. ఒక్కనాడైనా అభ్యంగనస్నానములేదు. 1910 నవంబరులో ఆయన దురవస్థనుచూసి మంగమ్మ, జానకమ్మ తమ తలంట్లకిచ్చిన నూనె, నలుగుపిండి మిగిల్చియుంచి, వేడినీళ్ళుకాచి, పంతులుగారు వద్దనిఅంటూవున్నా తలంటిపోసినారు. భార్యపోయిన నాలుగునెలల కిదే మొదటితలంటు. (స్వీ. చ. 111) పంతులుగారికి అన్నహితవు పోయినది. బెంగుళూరుకు పదునేనుదినములకు ప్రయాణమనగా మళ్ళీ రెండవపూట అన్నముతినసాగిరి.

పులవర్తి సుబ్బారావింటిలో పంతులుగారికి భోజనసదుపాయమునకు చేటు పుట్టగా, వితంతువులలో ఎవరైనా పునర్వివాహముచేసుకుని తమవద్దనుండి సంరక్షణచేసే యెడల వెయ్యిరూపాయల నిచ్చెదమని పంతులుగారు చెప్పిరి. అందుకు ముగ్గురు వితంతువులు ముందుకువచ్చిరి. వారిలో మంగమ్మమాటలను విశ్వసించి ఆమె సం రక్షణలో నుండుటకు నిశ్చయించుకొన్నారు. బెంగుళూరు వెళ్ళుటకు మూడురోజు లకుముందునుండి ఆమె వంటచేసిపెట్ట నారంభించినది. ఆమెను వివాహమాడుటకు పోతరాజు, సూర్యప్రకాశరావుకు చూపించి అతడు ఇష్టపడగా బెంగుళూరునుంచి తిరిగివచ్చినపిమ్మట పెండ్లిచేసెదమని చెప్పి 27-3-1911 వతేదీన పంతులుగారు మంగమ్మతో బెంగుళూరువెళ్ళిరి. ఆమె పెండ్లి నిశ్చయించిననాటినుంచికాక, బెంగుళూరువెళ్ళుటకు మూడురోజులు ముందునుండిమాత్రమే ఆమె వంటచేసి పెట్ట నారంభించినదట!

34-6-1911వతేదీ పంతులుగారి డైరీవివరణవల్ల బెంగుళూరునుండి ఆయన మైసూరు వెళ్ళినారని, అక్కడ మహారాజువారి కళాశాల, వితంతుశరణాలయం జగన్మోహన రాజభవనము ఇండస్ట్రియల్ స్కూలుచూశారని, సాయంత్రం దివా నును దర్శించారని తెలుస్తున్నది. మైసూరువిశేషాలను మంగమ్మకుకూడా చూపించా రని ఎంచవచ్చును.

1-7-1911 : పంతులుగారు బెంగుళూరుఇంటికి క్రయదస్తావేజులు రిజిష్టరు చేశారు. అనగా ఇల్లు అమ్మివేశారు.

12-8-1911 : రాజ్యలక్ష్మమ్మగారి సంవత్సరీకం రాజమండ్రిలో జరిగినది. స్నేహితులందరూవచ్చారు.

3-9-1911 : స్కూలుకమిటీ మీటింగుకువెళ్ళిరి.

8-10-1911 : మంగమ్మను పోతరాజు సూర్యప్రకాశరావు కిచ్చి బ్రహ్మ సమాజవిధులప్రకారం వివాహం జరిపించారు. అతనిరాక ఆలస్యమైనందుననే పెండ్లి అంత ఆలస్యముగా జరిగినది. మార్చినెలనుండి పెండ్లివరకుగల ఈతొమ్మిదినెలల కాలము మంగమ్మయే వంటచేసి పెట్టినది. మంగమ్మ పెండ్లిపిమ్మట ఆమె బ్రతికి యున్నంతకాలమూ పంతులుగారికి ఆమెయే వంటచేసి పెట్టినదికదా!

1911 డిశంబరు చివర : రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు చూడ వచ్చిరి. పంతులుగారాయనతో తిరిగినందున జ్వరంవచ్చినది.

1912 జనవరి మూడవతేదీన పంతులుగారికి స్మృతితప్పినది. ఆరాత్రి కుందూరి వెంకటరత్నంగారు, గంగన్నగారు సాయముగా పరుండిరి. లేవలేనిస్థితి పడినది.

1912 జనవరి 24 వ తేదీవరకు మంగమ్మఆమెభర్త మేడమీద పరుండుచు వచ్చిరి.

చిలకమర్తివారు మంగమ్మ ఒకతే రాత్రిప్పు మేడమీద పరుండి పంతులు గారికి ఉపచారాలు చేసేదనివ్రాయగా, పంతులుగారుమాత్రం ఇలావ్రాశారు.

1913 ఫిబ్రవరి 14 వతేదీనాటికి కొంతబలము వచ్చినది. గర్భవతియయి యున్న తనభార్యనుపచారమునకయి వెంటగొని ముందుగానే పోవలసినదనియు, ఎండాకాలపు సెలవులియ్యగానే తానువచ్చి మమ్ము గలిసికొనెదననియు మార్చినెల మధ్యనుండియు త్వరపెట్టుచూ వచ్చినందున" 1912ఏప్రిలు మూడవతేదీన పంతులు గారు మంగమ్మకలిసి బెంగుళూరువెళ్ళగా, వేసంగి సెలవులిచ్చినతరువాత సూర్య ప్రకాశరావు ఏప్రిలు 27 వతేదీన బెంగుళూరు చేరుకొన్నారు.

21-4-1912 : బెంగుళూరునుండి పంతులుగారు కుందూరి వెంకటరత్నం గారికి వ్రాసినఉత్తరంలో జయంతిగంగన్నగారు వితంతు శరణాలయ వ్యవహారము లలో శ్రమతీసికొనినందులకు వందనములు పంపిరి.

18-6-1912 : బెంగుళూరునుండి రెబ్బాప్రగడ పాపయ్యాగారికి వ్రాసిన ఉత్తరంలో 22వతేదీన బయలుదేరి చెన్నపట్నంవచ్చి, 25వతేదీ ఉదయం రాజ మహేంద్రవరం చేరుతామని వ్రాసిరి.

1912 ఏప్రిలునుండి 1915 వరకు పంతులుగారు డైరీవ్రాస్తూనే వున్నారు. 1917 వరకూ ఉత్తరములు వ్రాస్తూవచ్చారుగాని "స్వీయ చరిత్ర" రెండవభాగమును 1912 ఏప్రిలుతోనే ముగించివేశారు.

12-8-1912 : గవర్నరు గార్డెన్ పార్టీకివెళ్ళిరి.

24-11-1912 : గ్రామభాషకు అసమ్మతితెల్పుతూ మద్రాసు పచ్చయ్యప్ప హాలులో మీటింగుకు అధ్యక్షత వహించిరి.

26-2-1913 బనగానిపల్లెరాజ్యలక్ష్మిబాయమ్మ వితంతువివాహం. మంగమ్మను తీసుకుని బెంగుళూరు శ్రీరాములుగారు వెళ్ళారు.

4-3-1913 : "భట్టిప్రోలు శరభయ్య నాళం కృష్ణారావు వగైరాల ప్రోత్సాహంతో నాపైన కుందూరి వెంకటరత్నం, గంగన్నగార్లపైన రాజమండ్రి డివిజినల్ మేజిస్ట్రేటుదగ్గర క్రిమినలుకేసు దాఖలుచేసినాడు" అని పంతులుగారి డైరీలో వున్నది.

ఈశరభయ్య రాజేశ్వరిని వివాహంచేసుకున్నాడు. వీరికథ పంతులుగారి "స్వీయచరిత్ర" 237-39 పుటలలో, చిలకమర్తివారి "స్వీయచరిత్ర" 205 వ పుటలో వున్నది. భర్తనువదలి రాజేశ్వరి వీరేశలింగంస్కూలులో చదువుతున్నది. ఆకాలంలో ఆమెతో గంగన్నగారికి సంబంధమున్నట్లు పుకారులుండేవి. ఒక ప్రహసనంకూడా అల్లి ప్రదర్శించారు. గంగన్నగారు ఆస్కూలుకు హెడ్మాష్టరుగా వున్నాడు.

11-4-1913 : పంతులుగారు బెంగుళూరునుండి కుందూరి వెంకటరత్నంగారికి వ్రాసినఉత్తరం "నేనీరోజున నిచ్చటికి వచ్చినాను. బడలికవల్ల నాకు జలుబు చేసినది. మీరు వితంతుశరణాలయములోని వారిక్షేమము తెలుసుకొనుచున్నారని నమ్మెదను. తక్కినవ్యవహారము లెట్లునడచుచున్నవి. అవసరసమయములందు స్వార్థపరాయణులైన మిత్రులు నన్నువీడవచ్చుగాని సర్వేశ్వరుడు నన్ను విడనాడడని నానమ్మకము."

15-4-1913 : బెంగుళూరునుండి డిటోవారికి ఉత్తరం: 'నేనెల్లసమయములందును సర్వేశ్వరునొక్కనినే నమ్మియున్నందున నామనస్సులో నేవిధమైన ఆందోళనము కలుగుటలేదు. నాకు పరమమిత్రులనియెంచబడినవా రేసమయమునసైన నన్ను వదలివేయవచ్చునుగాని సర్వేశ్వరుడు నన్నెన్నడును విడువడు. రాజమహేంద్రవరం సమాచారములు మీరునాకు తెలియచేయగలరని నేనాశించుచున్నాను.'

22-4-1913 : బెంగుళూరునుండి డిటోవారికేలేఖ : 'ఈరోజున నాకు కొంచము నయముగానున్నది. నావగ్గుబాధ తగ్గుచున్నది. నాకు రుచిగనుండునట్లు వంట చేయలేరు. నాకుగత్యంతరంలేదు. క్రమముగా ఈవంటకు నేనలవాటు పడియెదను. నేనువ్రాసినలేఖలో నాఆప్తమిత్రులుగూడ నన్ను వదలివేయవచ్చుననిగాని సర్వేశ్వరుడు నన్ను విడవడని వ్రాసినప్పుడు నేను ప్రత్యేకముగా నెవరి నుద్దేశించి

వ్రాయలేదు. ఈ ప్రపంచమున నేనేకాకిగానుంటినని, ప్రాపంచికధోరణి కలిగిన మన స్నేహితులు నన్ను వదలివేసిరని నేనప్పుడప్పుడనుకొనుచుందును. నావృద్ధాప్యములో ఇప్పటి నాఅసహాయస్థితిలో సర్వేశ్వరుడు నాకు శాంతి (Comfort) నొసగుచున్నాడు. ఈవిపత్తులు, అపవాదముల నడుమనాకు మనశ్శాంతి నీశ్వరుడొసగియున్నాడు. ఈ ప్రపంచమున నేను చేయవలసినపని ముప్పాతిక మువ్వీసము ముగిసినదని నేనెంచుచున్నాను. త్వరలో జగత్పితము, శ్రేష్ఠమిత్రుడు (Friend and father) నగు సర్వేశ్వరుని నేను కలిసికొనవలసియున్నది. నేనెప్పుడును ఈశ్వరునిపై ఆధారపడియున్నాను. ఈశ్వరపాలితమైన ఈప్రపంచమున సత్యమే జయించితీరును. మన యుద్యమము ధర్మముపైనను సత్యముపైనను ఆధారపడియున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్సభ వార్షికోత్సవము ఈసరికి చాలవరకు ముగిసియుండును. పిఠాపురం మహారాజాగారీసభకు వచ్చినారా?

3-5-1913 : బెంగుళూరునుండి కుందూరి వెంకటరత్నంగారికి ఉత్తరం : మనపాఠశాల పరీక్షాఫలితములు మొత్తముమీద బాగుగానే యున్నవనుకొందును.... దైవానుగ్రహమువలన నాఆరోగ్యము బాగుపడుచున్నది....

10-5-1913 : బెంగుళూరునుండి డిటోవారికిలేఖ : ఏసుక్రీస్తు జీవితమును వ్రాయుట ముగించినాను.

12-5-1913 : బెంగుళూరునుండి డిటోవారికి : ఆపత్రిక (Carlylean) యొక్క మూడుసంచికలు నేనిక్కడికి వచ్చినతరువాత నాకుచేరినవి. అటువంటి.... వ్రాతలను లెక్కచేయుట తెలివితక్కువ. కుక్కలు మనలజూచి మొరగిన మొరగనీయండి. మన జీవితాంతమువరకు ఘోషణదూషణముల లెక్కగణించక మనవిధ్యుక్త ధర్మమును చేయుదము. సర్వేశ్వరుడొక్కడే మంచిచెడ్డల నిర్ణయింపగలడు.

15-5-1913 : బెంగుళూరునుండి డిటోగారికి లేఖ : భారమంతయు దేవునిపై నుంచి స్నేహితులవద్దనుండిగాని విరోధులువద్దనుండిగాని కలుగు ప్రతిఘటనను, అపవాదములను లెక్కసేయక మనము కష్టపడి కృషిచేయవలసియున్నది. అర్థులమైనచో సర్వేశ్వరుడు మనకు తోడ్పడునుగాక.

19-6-1913 : బెంగుళూరునుండి డిటోవారికి పంతులుగారు చాలాపెద్ద వుత్తరమేవ్రాశారు. అందులోని ముఖ్యవిషయము : నా స్వీయచరిత్రములో రెండవ భాగమున వందపుటలు వ్రాయగలిగినాను, నా స్వీయచరిత్రము చాలావరకుగాని పూర్తిగాగాని వ్రాయుటకు వీలగునట్లు ఈమాసాంతమువరకు నేనిచ్చటనే యుండ దలచినాను. భగవంతుడు తప్పక నాపక్షముననున్నాడు.

4-7-1913 : స్కూలుకు, ఆసుపత్రికి వెళ్ళినట్లు పంతులుగారు తమడైరీలో వ్రాసినారు.

5-7-1913 : (డైరి) జాయింటు మేజస్ట్రేటు కోర్టుకు వెళ్ళినాను. శరభయ్య మాపైనతెచ్చిన క్రిమినల్‌కేసు విచారించి "Frivolous" అని డిస్మిసుచేశారు. కాంపెన్సేషను ఇప్పించిరి.

24-7-1913: పంతులుగారు కాకినాడలో శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావు గారికి వ్రాసిన ఉత్తరంలో పైన చెప్పిన కేసు డిస్మిసు చేసిన సంగతి వ్రాసి;........ అబద్ధపు సాక్షము నిలువనేరదు. సత్యము జయించి తీరును.........ఈ పట్టణమున ఇప్పటి తరము వారిలో నాకు పరిచయములేదు. నాకు శత్రువులు కూడా వున్నారు. ఇచ్చటనాకు నమ్మకమైన స్నేహితులు చాలా తక్కువగా వున్నారు. అందువలన వారి వద్దనుండి ఎక్కువ లాభము కలుగునని నేనాశించుటలేదు. నా పూర్వపు విద్యార్థులు, స్నేహితులునగు మీవంటి వారిపై నేను సాయము కొరకు అధారపడవలసియున్నది అని వ్రాసిరి.

1913 జూలై లో పంతులుగారొక వ్యాసమును వ్రాసి "దేశమాత"కు పంపిరి. అదిప్రకటింపబడగా, అదితననుద్దేశించివ్రాసినట్లు టంగుటూరిశ్రీరాములుగారు తలచి పంతులుగారిపైన పరువు నష్టము నేరంతో క్రిమినలు కేసు రాజమండ్రి జాయింటు మేజిస్ట్రేటు కోర్టులో దాఖలు చేసిరి. (చి.స్వీ.చ.)

1-10-1913: పంతులుగారు మోచర్ల రామచంద్రరావు ఏలూరి గారికి వ్రాసిన వుత్తరములో శ్రీరాములుగారు దాఖలు చేసిన క్రిమినలు కేసు వేసిరని వ్రాసిరి.

1913 అక్టోబరులో పంతులుగారు నాళం కృష్ణారావు, సత్యవోలు అప్పారావు అయ్యగారి బాపిరాజు, టంగుటూరి శ్రీరాములుగార్లపైన రాజమండ్రి జాయింటు మేజిస్ట్రేటు కోర్టులో పరువునష్టం కింద కేసు దాఖలు చేసిరి.

నాళం కృష్ణారావుగారు "మానవసేవ"లో పంతులుగారికి అవమానకరమైన పద్యములు ప్రకటించిరి. శ్రీరాములుగారు "కార్లీలియన్" పత్రికలో అవమాన కరమైన వ్రాతలు వ్రాసిరి. పంతులుగారికి నాళం కృష్ణారావుగారికి మధ్యరాజీ చెయ్యడానికి ప్రయత్నము జరిగి విఫలమైనది.

10-11-1913:రాజమండ్రి జాయింటు మేజిస్ట్రేటు బార్డ్సువెల్ పంతులుగారి సాక్ష్యంవిని ముద్దాయిలపైన నేర స్థాపన చేస్తూ చార్జస్ ఫ్రేమ్ చేసినాడు.*

---

* స్టూఅర్టుకిముందు ఈకేసు విచారించిన బార్డ్సువెల్ హైకోర్టుజడ్జిఅయ్యాక నేనొకసారి ఆయన్ని కలుసుకోవడంతటస్థించింది. అప్పుడు ఆయన (ఈకేసు) ప్రస్తావన తీసుకువచ్చి "తనయెదుట ముద్దాయితరపున (అనగా శ్రీరాములుగారితరపున) కేసుసరిగా చెప్పనికారణంచేతనే చార్జిచేశాను. అన్నాడుఅని ప్రకాశంపంతులుగారు వ్రాశారు. అనగా శ్రీరాములుగారు కేసు నడిపినతీరులో లాయరులోపంవల్లనే అలా చేశానేగాని కేసులో పటుత్వమునుబట్టి కాదని చెప్పినట్లవుతున్నది.

అంతట నాళం కృష్ణారావుగారు క్షమాపణకోరారు. ఇంతలో బర్న్సువెల్‌కి ట్రాన్సు పరు అయినది. ఎఫ్. డబ్ల్యు. స్టీవార్టు అనేదొర ఇంగ్లండునుంచివచ్చి జాయింటు మేజిస్ట్రేటుగా చార్జీపుచ్చుకున్నాడు. టంగుటూరి ప్రకాశం పంతులుగారు అప్పుడే ఇంగ్లండునుండి తిరిగివచ్చి ముద్దాయిల తరపున కోర్టుకు హాజరై కేసును మొదటి నుండీ విచారించాలని Denovo Trial కోరగా స్టీవార్టు అంగీకరించాడు. ప్రకాశం గారు పంతులుగారిని అయిదురోజులు క్రాస్‌పరీక్షచేసి వారికేసుకు భంగము కలి గించే అనేకసంగతులు చెప్పించారు. మంగమ్మ పంతులుగారు కలిసి సెకండు క్లాసుకుపేలో ప్రయాణంచేసి బెంగుళూరులో మూడునెలలు ఒకేగదిలో వుండేవారని ఆమెవీపును ఆయన నిమిరేవారని ఒప్పించారు.

10-1-1914 : జాయింటు మేజిస్ట్రేటు స్టీవార్టు పంతులుగారి అవినీతి ప్రవర్తన రుజువైనదని తనతీర్పులో వ్రాసి, కేసు డిస్మిస్‌చేశారు.

"Mr. Stewart held that the immoral life of Pantulu is proved under the evidence act. The joint Magistrate dismissed the case making most damaging remarks again my character"
అని పంతులుగారు నాటిడైరీలో వ్రాసుకున్నారు.

శ్రీరాములుగారు తాము పంతులుగారిపై తెచ్చిన కేసు ప్రొసీడింగ్సు, పంతులుగారు తమపైన తెచ్చినకేసు ప్రొసీడింగ్సు "కార్లేలియన్" పత్రికలో ప్రకటించారు.

6-2-1914 : స్టీవార్టు తీర్పుపైన పంతులుగారు జిల్లా మేజిస్ట్రేటు Elwin దొరదగ్గర రివిజను పిటిషన్ దాఖలుచేయగా పాశ్చాత్యనీతిప్రకారము పంతులుగారి ప్రవర్తన అవినీతికరమైనా, హిందువులనీతినిబట్టికూడా అది అవినీతికరమేనా అనే విషయమునుగూర్చి విచారించవలెనని ఫర్దర్ ఎంక్వయిరి ఉత్తర్వుచేశారు. (1914 ఫిబ్రవరి)

ఈ రివిజను చెల్లదని శ్రీరాములుగారు హైకోర్టులో రివిజనుపిటిషను దాఖలు చేయగా దానిని సదాశివయ్యరుగారు రివిజను జెంచికి పంపించారు. ఫిర్యాదీ ముద్దాయి కూడా పబ్లిక్‌గుడ్ నిమిత్తం పనిచేసేవారేకదా, కేసు రాజీచేయమని ప్రకాశంగారిని కోరారు. దీనినిగూర్చి శ్రీరాములుగారు విమర్శిస్తూ "కార్లేలియన్" పత్రికలో తీవ్రంగావ్రాశారు.(1914 ఏప్రిలు మొదటి రెండువారాల సంచికలు.)

## కేసు ముగిసినా జరుగుతున్నదని వ్రాసారు

పంతులుగారు తెచ్చిన పరువునష్టం కేసు రాజమండ్రి జాయింటు మేజిస్ట్రేటు కోర్టునుండి పెద్దాపురం డివిజను మేజిస్ట్రేటుకోర్టుకు ట్రాన్సుఫరు అయినది. పంతులు

గారు తమ ప్లీడరుతో పెద్దాపురం వెళ్ళినట్లు, ప్రకాశంగారు పంతులుగారిని 1914 డిసెంబరు 7, 8, 9 తేదీలలో క్రాస్‌పరీక్షచేసినట్లును కేసు 7-1-1915 వ తేదీకి వాయిదాపడినట్లుకూడా పంతులుగారు తమడైరీలో వ్రాసుకున్నారు.

3-3-1915 వతేదీన పెద్దాపురంలోని క్రిమినలుకేసును ఉపసంహరించుకున్నట్లు పంతులుగారు డైరీలో వ్రాసుకున్నారు. ప్రకాశంగారి క్రాసుపరీక్షలో మళ్ళీ పాతసంగతులన్నీ పంతులుగారిచేత ఒప్పించారు గనుక కేసు నిలబడదని ప్లీడర్లు సలహాఇచ్చినందువల్లనే, ఇది జరిగినది. దీని ఫలితంగా స్టీవార్టు చేసిన స్ట్రిక్చర్సు మాయనిమచ్చలుగా వుండిపోయినవి.

మార్చి 3వ తేదీతో తమకేసును ఉపసంహరించుకొన్న పంతులుగారు తమ స్వీయచరిత్ర రెండవభాగమును ముగించి, 19. 1. 1915 వ తేదీన అచంట లక్ష్మీపతిగారికి పంపించి, 24 ఏప్రిల్, 1915 తేదీనరికి విజ్ఞానచంద్రిక ప్రచురణగా వెలువరించి, "అవతారికలో" 1915, ఏప్రిల్ 1 వ తేదీనదానిలో "అవతారిక"తో వ్రాసిన ఆక్రిమినల్ కేసు యింక ముగియలేదని, కేసు నడచుచుండగా వ్యవహారమధ్యమున ఆరోపణల విషయమై ఎక్కువగా వ్రాయరాదని మానుకొన్నామని, మలిముద్రణలో వ్రాయగలనని వ్రాశారు.

1912 వ సంవత్సరము డిసెంబరునెల మొదలుకొని 1913వ సంవత్సరము ఏప్రిల్ నెలవరకును స్థానికపత్రికలలో రెంటిలో నాకు విరోధముగా కొన్ని ఆరోపణలు చేయబడినందున, ఆవిషయమున నాలుగవప్రకరణములో కొంతవ్రాసితినిగాని తరువాతనే తత్ప్రకటనవిషయమున ధర్మస్థానములలో, దండశాఖలోను వ్యవహారశాఖలోను, కొన్ని యభియోగము లారంభమయినవి. ముద్రింపబడుచుండినప్పుడు ముగియనందున వ్యవహారమధ్యమున వానిని ప్రకటించుట యుచితముకాదని నిలిపివేయవలసినవాడనైతిని. పుస్తకమంతయు నేకసంపుటముగా ముద్రింపబడునప్పుడు తద్విషయములు మరియొక ప్రకరణము చేర్చబడును-రాజమహేంద్రవరము 1వ ఏప్రిల్ 1915-వ సం.

నాలుగువారములక్రిందనే తాము ఎత్తివేసుకొని ముగించుకొన్న ఆకేసును గూర్చి అభియోగమారంభమైనదని అబద్ధంవ్రాసి, ఆకేసువిషయం ఏమీవ్రాయకుండా తప్పుకొన్నారు. ఆఅభియోగములకువారుతలొగ్గినట్లుఅయినది. అభియోగమేనిజంకాకపోయి, తామునిర్దోషులమన్న ఆత్మవిశ్వాసమే వున్నట్లయితే అబద్ధంవ్రాసివుండేవారు కాదు. తమ భార్య దగ్గర అంత చనువుగల మనిషి తమ దగ్గరకూడా కొంత చనువుగా వుండేవని పంతులుగారు వ్రాయక పోవడము ఆశ్చర్యకరమైన విషయము.

తాము అత్యంత ప్రేమాస్పదురాలయిన భార్యపోయి దుఃఖపడుచుండగా, ఆమెకు అత్యంత ప్రేమాస్పదురాలైన మంగమ్మకూడా దుఃఖముతో బెంగపెట్టుకున్న దని, తాము మందు ఇప్పించినా కొన్నాళ్ళవరకు స్వస్థ పడలేదని వ్రాశారు. ఇంత వ్రాసినవారు, తమ దుఃఖోప శమనార్థమై మంగమ్మ ప్రయత్నించినదనిగాని, తాము దిగులుపడి ఒంటరిగానుండగా మేడమీదికి అప్పుడప్పుడు వచ్చి చేతనైన పరిచర్యలు చేసేదనిగాని వ్రాయకపోవడం అంతకంటె అసహజమైన సంగతి. ఆమెపగటి పూట లైనా తరచుగా మేడమీదికివచ్చి సహాయం చేసేదని, తాము రాత్రిప్పు దగ్గుతో బాధ పడుతూవుండగా కొంతసేపువుండి ఉపచారాలు చేసేదని, మరీ బాధపడుతూవున్న పుడు మేడమీదనే పరుండేదని వ్రాస్తే కొంపమునుగుతుందా? దానికి తమను ఎవరైనా అపార్థం చేసుకుంటారా? కాక అదేమైనా అసహజమైన విషయమా? ఆమాత్రం వ్రాయడానికి ఎందుకు భయపడ్డారు? చిలకమర్తి కొంచెం ఇలాగేకదా వ్రాశారు.

మంగమ్మ ఇలాగా తరచుగా తమకు ఉపచారాలు చేస్తుండడము చూచి వితంతుశరణాలయములోని కొందరుస్త్రీలు అన్యాయంగా అనుమానపడి అపార్థాలు కల్పించి అపవాదులు వ్యాపింపచేశారనికూడా పంతులుగారు వ్రాయరైరి. చిలకమర్తి వారు వ్రాసిందికూడా ఇదేకదా? ఈమాత్రము ఆలోచన పంతులుగారికేలకలుగలేదు? ఆయనగారి ఆత్మవిశ్వాసము, ధైర్యసాహసాలు, ధర్మనిష్ఠ అడుగంటిపోయినవన్న మాట.

వీరేశలింగంగారికి సర్వవిధాలా అనుకూలవతియైన భార్య పోయినది అమితదుఃఖము కలిగినది. ఆయనకు ఎవరితోడను చనువులేదు; ఆయనను ఓదార్చ గలవారులేరు. ఆయనకు మొదటినుండీ తనపనులుతాను చేసికొను అలవాటులేదు, అన్నీ భార్యఅమర్చిపెట్టేది, ఇప్పుడీ వార్ధక్యములో ఏపనియుచేసికొనలేక అసహాయ స్థితిలోనున్నారు. పులవర్తి సుబ్బారావుగారింట నాలుగుమెతుకులుతిని కాలక్షేపము చేయుట ప్రారంభించిరి అతనిభార్య గయ్యాళి. మీదుమిక్కిలి ఆమెకు పంతులుగారి పట్ల సానుభూతిలేదు. వీరేశలింగంగారికి భార్యపోయినతర్వాత తలంటులేదు. నాలుగునెలలకు దుర్గమ్మ మంగమ్మ జాలిపడి, నూనె నలుగుపిండిమిగిల్చి తలంటి నారు. ఆయన మొదటవద్దన్నారు. కాని తరువాత పోయించుకున్నారు. వడ్డిమంగలి చేతకాకుండా ఆడవారిచేత తలంటించుకోవడం వింతగానే యున్నది!!

## ఇలా వ్రాయకూడదా?

వీరేశలింగంగారికి దగ్గుబాధ హెచ్చినది. వర్షాకాలములో రాత్రిప్పు ఒంట రిగా మేడమీద బాధపడుతూవున్నపుడు మంగమ్మవెళ్ళి కొంతసేపుండి ఆయనకు ఉపచారాలు చేసివచ్చేదని, మరీ దగ్గుఎక్కువగా ఉన్నపుడు అక్కడేపరుండేదని ఊహించుట అసమంజసముకాదు. ఈసంగతులను వీరేశలింగంపంతులుగారు స్వీయ

చరిత్రలో వ్రాయలేదు. కాని ఇలాజరిగివుండడంలో సందేహంలేదు. వీరేశలింగం గారితో, వారిభార్యతో ఎంతోచనువుగాఉండే మంగమ్మగారు ఆయన అసహాయ దశలో ఏకాకిగా బాధపడుతుండగా చూస్తూ వూరుకుంటుందా? ఆయనను ఓదార్చ డానికి, ఆయనకు సహాయం చేయడానికి ప్రయత్నించదా? ఇట్టిస్థితిలో ఆమె మేడ మీదికి తరచువెళ్ళడంలో ఆశ్చర్యమేమున్నది? నీవెందుకు వస్తున్నావని పంతులు గారనరుకదా? ఈవిషయాలేమీ పంతులుగారు తమ స్వీయచరిత్రలో వ్రాయకపోవడా నికి కారణమేమిటి? పులపర్తి సుబ్బారావుగారింట భోజనసౌకర్యాదులేవీలేవని మంగమ్మ ఎరుగదా? ఎరిగినా ఆమె ఎందుకు సహాయముచేయలేదు? ఆయన ఆమె సహాయమును ఎందుకుపొందలేదు? మంగమ్మను సుబ్బారావుగారి భార్యకు వంట నేర్పమని చెప్పినపంతులుగారు, ఆమెనే వంటచేసిపెట్టమని కోరవచ్చునుకదా! వీరేశలింగంగారికి అన్నం సయించకపోవడం, విరేచనాలువెళ్ళడం, జ్వరమ్రాగుతూ వుండడం, ఇవన్నీచూసికూడా ఆమె కల్పించుకొనలేదా? ఈసంగతి సందర్భాలను గురించి పంతులుగారు స్వీయచరిత్రలో ప్రస్తావనచేయలేదు, బహుశః ఇవన్నీవ్రాస్తే అనుమానాలకు అపార్థాలకు తావేర్పడుతుందని కాబోలు-వ్రాయకుండా తప్పించారు.

ఈస్థితిలో పంతులుగారు తమ సంరక్షణకోసం ఎవరైనా వితంతువివాహం చేసుకొని తమదగ్గరవుంటే వెయ్యిరూపాయలిస్తామనిచెప్పగా ముగ్గురు వితంతువులు ముందుకువచ్చారు.అందులో మంగమ్మహృదయపూర్వకముగాఅందుకు అంగీకరించి నట్లునమ్మి ఆయన ఆమెసంరక్షణలో నుండుటకు నిశ్చయించుకొనినారు. అంతట మంగమ్మ వంటచేసిపెట్టుట కారంభించినది. అప్పైన అంతవరకూ ఆమె పంతులు గారికి సాయపడలేదు.

మంగమ్మనుగూర్చిన అపవాదుల విషయము పంతులుగారి వృత్తాంతరాలవల్లనే వెల్లడవుతుందిగాని, అయినను వారు స్వీయచరిత్రలో ఈవిషయమే ప్రస్తావించలేదు. స్వీయచరిత్ర 2 వ సంపుటమునకు 1915 మార్చిలో చివర పీఠికవ్రాయునప్పటికి క్రిమినలు కేసులన్నీ అయిపోయినవి. కానివానినిగురించేమియు పంతులుగారు వ్రాయ లేదు.

అన్నిటికంటె ఆశ్చర్యమేమనగా, మంగమ్మ క్రిమినలు కేసుల మధ్య చనిపోగా, ఆమె చనిపోయిన విషయము పంతులుగారు డైరీలో కూడా వ్రాయకపోవుట! మంగమ్మను తాము అభిమాన పుత్రికగా చూచేవార మని పంతులుగారు వ్రాసినారుకదా! ఆమె తమకుచేసిన సేవానివరాలుకూడా ఉన్నది ఉన్నట్లుగావ్రాసివుంటే చాలమంది విశ్వసించేవారుకూడా. చిలకమర్తివారివలె సరిపెట్టు కొనియుండేవారు. అలాచేయక దీనినిగూర్చి పంతులుగారు ఏమీ వ్రాయకపోవుట వల్లకూడా అనేక అనుమానాలు ప్రబలినవి. 1913 మార్చినాటికి గర్భవతిగా నున్న న్న మంగమ్మ ప్రసవించలేదు – తల్లికాలేదు.

నిజానికి స్వీయచరిత్ర 2 వ సంపుటములో పంతులుగారు మంగమ్మ విషయంలోనేకాక, అనేక ఇతర విషయాలలోకూడా తమ ప్రవర్తనను సమర్థించుకోవడానికి కొన్ని అప్రస్తుతవిషయాలు అసంగతాలువ్రాశారు. ఈసంగతి "లియొనార్డు" సూచించాడు.

ఇంతకును ఒకవేళ మంగమ్మతో వీరేశలింగంగారికి సంబంధం ఉన్నదనుకొన్నను అదిఆయన ఆంధ్రదేశానికి, ఆంధ్రభాషకూ వారుచేసినసేవకు భంగముకలిగిస్తుందా? ఆయన జీవితచరిత్రవ్రాసినవారు ఆయనవలెనే నిష్కారణముగా భయపడి ఈఘట్టమునువ్రాయుటకు జంకుతున్నారు. పైగా ఆయనపైన అపవాదులు నమ్మిన వారిని గర్హిస్తున్నారు!!

పంతులుగారు 1919 సం॥ మేనెల 27వతేదీన చనిపోయారు. ఈలోపుగా వారు తమ స్వీయచరిత్ర శేషమును వ్రాయలేదు సరికదా ఈమంగమ్మకథనుగూర్చి ఒక బహిరంగ ప్రకటన అయినాచేయలేదు.

## మంగమ్మ మగని రెండో పెళ్ళితంతు

క్రిమినలుకేసుల మధ్యలో మంగమ్మ చనిపోయినది. పోతరాజు సూర్యప్రకాశరావు మళ్ళీ పెళ్ళిచేసుకోదలచాడు. మంగమ్మను పెళ్ళిచేసుకొన్నప్పుడు జందెము తీసివేసి బ్రహ్మసమాజపద్ధతినే చేసుకున్నాడు. ఇప్పుడు మళ్ళా జందెము ధరించి వితంతు శరణాలయములోని ఒకవితంతువును హిందూశాస్త్రంప్రకారం తనకు వివాహం జరిగించమని పంతులుగారిని కోరాడు. పంతులుగారు అంగీకరించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, కుందూరి వెంకటరత్నంగారు ఇందుకు అసమ్మతిసూచకంగా పెళ్ళినుండివెళ్ళిపోయారు. 16-8-1915వతేదీన "ధర్మసాధని" అనే కాకినాడ బ్రహ్మసమాజ పక్షపత్రిక పంతులుగారి ప్రవర్తనను తీవ్రంగాఖండిస్తూ పంతులుగారి పరువునష్టం కేసువల్ల ప్రజలలో గౌరవం తగ్గిపోయినదని, వారిని పబ్లిక్‌లైఫ్‌నుండి తొలగివలసినదని కోరినది. శ్రీరాములుగారు "ధర్మసాధని" వ్యాసమును తమ "కార్లేలియన్" సెప్టెంబరు మొదటిరెండుసంచికలలోప్రకటించారు. 24-8-1915 వ తేదీ డైరీలో తాను చేసిన వివాహమునుగూర్చి "కార్లేలియన్"లో శ్రీరాములుగారువిమర్శించారని డైరీలో పంతులుగారు వ్రాసుకున్నారు.

సూర్యప్రకాశరావు కోరినట్లుగా శరణాలయంలో ఒక వితంతువును హిందూశాస్త్రప్రకారం వివాహం జరిపించడంలో పంతులుగారికి దూరాలోచన లేకపోలేదు. అతడికోరిక చెల్లించకపోతే అతడు ఎదురుతిరిగి, తమకు వ్యతిరేకంగా తమ విరోధులతోకలిసి పనిచేయవచ్చును. ఇంకా ఏమైనా అపవాదులు కల్పించవచ్చును. అందువల్ల అతనిని తమచేతులలో వుంచుకొనడానికే ఆపనిచేశారు. వీరేశలింగం స్కూలు

లోని కొందరు ఉపాధ్యాయులుకూడా వీరేశలింగముగారికి వ్యతిరేకంగా ప్రవర్తింప జొచ్చిరి. (చి. ల. స్వీ. చ. 310) అప్పటికి కొంతకాలం పూర్వం నాళం కృష్ణారావు గారు 'వీరేశలింగం గ్రంథాలయం' పేరుతీసివేసి 'ప్రజాగ్రంథాలయం' (Peoples Library)) అని మార్పించారు. స్టీవార్టు తీర్పువల్ల. టవునుహాలులో జూబిలీపఠన మందిరములో వీరేశలింగముగారు సభ్యుడుగా వుండడానికి తగడని, వారిని సభ్యునిగాకూడాతొలగించవలసినదని టంగుటూరిశ్రీరాములుగారు, దామెర్ల వెంకటరమణా రావుగారు, వాడ్రేవు శంభులింగంగారు, నాళం కృష్ణారావుగారు, ఎర్రమిల్లి కామరాజుగారు, మాంధాత కామేశ్వరరావుగారు (ఆరుగురు) పఠనమందిర కార్యదర్శికి అర్జీవ్రాసిఇచ్చిరి. దీనినిగూర్చి విచారించడానికి జూబిలీరీడింగురూము జనరల్ కమిటీలో నూరుమంది సభ్యులుగల మహాసభ సమావేశమనగా, 82 మందిసభ్యులు హాజరైరి. పంతులుగారి సభ్యత్వము తొలగించమని కోరినవారిలో ఇద్దరుమాత్రమే హాజరైరి

సభకు న్యాపతి సుబ్బారావు పంతులుగా రధ్యక్షత వహించిరి. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, కళాశాల తత్వశాస్త్రాధ్యాపకులైనను. చక్రవర్తిగారును తొలగించుట న్యాయముకాదనివాదించిరి. త్రాగుబోతులు సభ్యులైయుండగా పంతులు గారేల వుండరాదనివాదించారు. పంతులుగారు కట్టించినదానినుండినిర్మాతనే వెలివేయటమా అన్నది అన్యాయ మనిపించింది. ఎనుబదిఇద్దరు సభ్యులలో ఇద్దరుమాత్రము వీరేశలింగముగారికి వ్యతిరేకంగా వోటునిచ్చిరి. ఇద్దరు తటస్థులైరి. 78 మంది వీరేశలింగముగారి కనుకూలముగా వోట్లునిచ్చిరి. వీరేశలింగముగారి డైరీలో 18-9-1915 వ తేదీన ఆసభకు 83 మంది హాజరైరని, తీర్మానానికి ముగ్గురు మాత్రము వ్యతిరేకముగాను, అనుకూలముగా 80 మంది వోటుచేసిరనివ్రాశారు. ఆముగ్గురిలో శ్రీరాములుగారు, నాళం కృష్ణారావుగారు వున్నారని వ్రాశారు. ఈ పరిస్థితులలో 31-7-1915వతేదీన పోతరాజు సూర్యప్రకాశరావు వివాహమును పంతులు గారు బ్రాహ్మణవిధులతో చేయించుటలోని దూరదృష్టి తెలియగలదు.

## టంగుటూరి సోదరులు - వీరేశలింగంకేసు

మంగమ్మతో పంతులుగారి అక్రమసంబంధం విషయం పత్రికాప్రచురణజేసి కేసుల్లో చిక్కుకొన్న టంగుటూరి శ్రీరాములుగారి వ్యక్తిత్వం గుణశీలాలు సంస్కరణాచరణలెట్టివో తెలియటం చాలాఅవసరం. పంతులుగారి నింద్యవర్తనపై ధ్వజమెత్తినవారు పంతులుగారి విరోధులుకారు, సనాతనపక్షంవారుకారు, సంస్కరణవిముఖులుకారు-పంతులుగారి శిష్యులు, అనుచరులు, అభిమానులు సంస్కారపక్షస్థులు శుద్ధవర్తనులు సత్యవ్రతులు అయిన ఉత్తమపౌరులు అనేమాట జ్ఞాపకం చేయుట ఎంతైనా అవసరం. ప్రజలలో నీతిమానాన్ని పెంచుటకు దీక్షవహించానని ప్రకటించి, స్త్రీవిద్యావితంతువివాహ సంస్కారవిషయాల్లో తనకు అగ్రచరులో

అనుచరులో, సహచరులో అయివున్నవారి జీవితవిధానం నీతినిధానంగా లేకపోయి నందుకు వారిగుట్టురట్టుజేసి పత్రికలకు కోర్టులకు ఎక్కించి సర్వతోముఖ నీతినిధులుగా తానూ తనసహచరులు అనుచరులూ వుండాలని ప్రబోధిస్తూ వచ్చిన గురుకుంజరుని నడవడి గురితప్పినప్పటికి శిష్యగణంచేసిన తిరుగుబాటే మంగమ్మ విషయంగా పంతులుగారిపై లేచిన అల్లరిఅన్నమాట యథార్థం.

పంతులుగారి లిటిగేషన్ దెబ్బతట్టుకోలేమని జడిసి మధ్యలో క్షమాపణచెప్పి బైటపడ్డవారుగాని, వ్రాసినవ్రాతనుంచి వెనుదిరుగకుండా రానున్న ఆపదతలచుకొని బెజారెత్తకుండా ధీరోదాత్తంగా తుదివరకు నిలిచినెగ్గి, నిగ్గతీసిన శ్రీరాములుగారుగాని పంతులుగారు వేలెత్తిచూపడానికి, వాయెత్తిచెప్పడానికి గుణలోపమేమీలేని వారు. అడిగినట్టుగా అప్పుయివ్వలేదని, ఇచ్చినఅప్పు నిలవేసి వసూలుచేసినకారణంగా కసిపూని నాళం కృష్ణారావుగారు తనమీద యీ ఆరోపణచేసి వ్రాశారన్నారేగాని ఆత్మూరి ఏలూరి లక్ష్మీనరసింహాలలో తప్పులెన్నిచూపినట్టుగావీరిలోఏమీ చూపలేకపోయారు. ఆనాళంవారు సుప్రసిద్ధ దేశభక్తులు. పంతులుగారిభక్తులు. పంతులుగారి పేర గ్రంథాలయం స్థాపించి నడిపించుతున్నవారు. వితంతువివాహ సంస్కారమేగాకుండా హరిజనవిద్య అస్పృశ్యతానిరసనవరకుగల సంస్కరణకై కృషిచేసిన వారు. మధురకవి బిరుదందినవారు.

శ్రీరాములుగారి విషయంలోనంటారా, నాళం కృష్ణారావుగారి విషయంలో చూపించినటువంటి వ్యక్తిగతమైన కారణాలను ఉద్దేశాలను పంతులుగారేమీ తమ స్వీయచరిత్రలో వ్రేలెత్తి చూపలేకపోయారు. శ్రీరాములుగారు నాస్తికులని, ఆస్తికులకుమాత్రమే ప్రవేశంకల్గించిన హితకారిణీ సమాజ కార్యవర్గమునకు శ్రీరాములుగారెన్నుకోబడినప్పటికి ఆనిబంధనలవలన తానుండరాదని, ఆనిబంధనను నిరసించి దానినుండి తప్పుకొన్నారనిమాత్రం వ్రాశారు. అంతకన్నా శీలదోషం చూపలేకపోయారు. హితకారిణీ కార్యవర్గంనుండి మానుకొన్నప్పటికి పంతులుగారి సంస్కారపక్షంలో ముఖ్యులుగా వున్నారు. చిలకమర్తివారి స్వీయచరిత్ర శ్రీరాములుగారు పంతులుగారికి గట్టి అనుచరుడని, పంతులుగారు బాపయ్యగారు ఏర్పాటుచేసిన సహపంక్తి భోజనాలలో పాల్గొన్నట్టివారని, అరవవాడొకడు ఆడువేషంలో వితంతుశరణాలయంలో క్రీడించుచున్నట్లుగా ఒకఅబద్ధపువార్త తనపత్రికలో ప్రచురించినవానిపై పెట్టినకేసులో పంతులుగారికి ప్లీడరుగా పనిచేసినవారని, చిలకమర్తివారితో పాటుగా వితంతువివాహ ప్రచారకుడుగా, ఉపన్యాసకర్తగా తిరిగినవారుగా కనిపిస్తారు. పంతులుగారివిషయాలుదాచి, నాస్తికులనిమాత్రం చెప్పిఅదేచాలు ఆయనను దెబ్బతీయడానికి చాలనుకొన్నారు. కార్లైలియన్ అనేఆంగ్లపత్రికను నడిపేవారు. వారు పట్టభద్రులు. న్యాయవాదులు. వారు న్యాయవాదిత్వంలో చూపిన సత్యనిష్ఠ బహూకఠినమైనది. అన్నగారైన ప్రకాశంపంతులుగారే ఆవిషయం చెప్పారు.

## ప్రకాశంగారి వాఙ్మూలం :

నా పెదతమ్ముడు శ్రీరాములు చిన్నప్పటినుంచీ కొంచెము నెమ్మదైనవాడు.... అతడు రాజమహేంద్రవరంలో ప్రాక్టీసుచేసేరోజుల్లో మంచి బుద్ధిసూక్ష్మమూ, వాదనాశక్తి చూపించాడు. కానికేసుల్లో ఏమాత్రం న్యాయము లేకపోయినా వాటిని నిరాకరించడంవల్ల అంతగా న్యాయవాదిగా ప్రయోజకుడుకాలేకపోయాడు. ఒకసారి నేను వూళ్ళోలేనప్పుడు ఒకప్రముఖుడైన క్లయింటు అతనిదగ్గరకువచ్చి ఒకకేసులో సాక్షులు ఏమిచెప్పాలో కొంచెముందుగా చెప్పించమని అడిగాడు. వెంటనే అతను "అది నాపనిగాదు. నేను సాక్షుల్ని తయారుచేసే ప్లీడర్ని కాను" అన్నాడు. అదీ అతనితరహా! అతను సంఘసంస్కార ఆందోళనరోజుల్లో వీరేశలింగంగారి శిష్యుడయ్యాడు. ఆరోజుల్లో ఆయనకి ముఖ్యులైన వాళ్ళలో ఒకడుగా వుండేవాడు. కాని తరవాత ఆయనతో తగాదాపడినవాళ్ళలో అగ్రగణ్యుడయ్యాడు.... అప్పుడే కార్లీలియన్ అనేపత్రిక ఒకటి నడిపించేవాడు. ఆకార్లీలియన్ పత్రికలో భయంఅనేది లేకుండా మంచిజోరుగా వ్రాసేవాడు. ఆపత్రిక అప్పటిప్రజాజీవితంలో ఉండేవాళ్ళకి గుండెబెదురుగా వుండేది."(నాజీవితయాత్ర పుటలు 177_178)

## చిలకమర్తివారివ్రాత :

టంగుటూరి శ్రీరాములుగారు న్యాయవాదిగానుండి 'కార్లీలియన్' యను పక్షపత్రిక నింగ్లీషు లో నాదినములలో ప్రకటించుచుండిరి. అందలి విమర్శనలు మిక్కిలి కఠినములై జనులమనసులకు మిక్కిలికష్టము కలిగించుచుండెను. వీరేశలింగముగారిమీద యపవాదములు నమ్మి యాపత్రికగూడ కఠినవిమర్శన వర్షములు కురిపించెను. ఆపత్రిక న్యాపతి సుబ్బారావు పంతులుగారిమీదను, వీరేశలింగముగారిమీదను, మరి యితర పురప్రముఖుల మీదను ధ్వజమెత్తి నిష్ఠురవిమర్శనములు వ్రాయజొచ్చెను. నాళము కృష్ణారావుగారు తెనుగున ప్రకటించుచున్న మానపత్రికలోగూడ నిందాగర్భములైన పద్యములు ప్రకటింపబడెను. నాళము కృష్ణారావు వీరేశలింగముగారియెడ నంతకు పూర్వము మిక్కిలి భక్తులై, వారి పేర వీరేశలింగ పుస్తక భాండాగారమని యొక భాండాగారము పెట్టి నడుపుచుండిరి. అట్టివారుగూడ వీరేశలింగముగారిమీద ధ్వజమెత్తిరి. పురజనులు బహువిధములుగా నీవిషయమై ప్రసంగింప జొచ్చిరి. వీరేశలింగ పాఠశాలలోని యుపాధ్యాయులే కొందరు వారికి వ్యతిరేకముగా ప్రవర్తింప జొచ్చిరి.

చిలకమర్తివారు సైతం శ్రీరాములుగారు దురుద్దేశపూర్వకంగా వ్రాశారనలేకపోయారు. ఆ పుకారు నమ్మటం పంతులుగారు ఆంధ్రదేశానికి చేసినసేవకు అపచారం చేయటమనుకొని చిలకమర్తివారు సరిపెట్టుకొన్నారు. అంతేగాని మరొకటి కాదు. అది చూడవచ్చు.

"పితృ పుత్రికా సంబంధముకలిగి వీరేశలింగము గారును మంగమ్మయును మెలగుచున్నను, వితంతు శరణాలయములోని కొందరు వితంతువులును, అచ్చటి కొందరు యువకులును ఈర్ష్యగలవారై వారిద్దరిమీదను అపవాదులు పుట్టించిరి. అవి గాలివలె పట్టణములోనికిగూడ ప్రాకెను. 'వినినంతనే వేగపడక వివరింపదగున్' అను నీతివాక్యమునుమరచి, వినగానే దానిని వేదవాక్కుగా గొందరు విశ్వసించిరి. నేను మొదట గొంతసంశయించినవాడనై, పిమ్మట బాల్యమునుండియు వీరేశలింగం గారితో గలసిమెలసి పనిచేసిన రెబ్బాప్రగడ పాపయ్యగారితోను, కనుపర్తి శ్రీరాములు గారితోను, న్యాపతి సుబ్బారావుపంతులుగారితోను మాటాడి నాసంశయములను దీర్చి కొని వీరేశలింగంగారి వయసునుబట్టియు, దేహారోగ్యమునుబట్టియు, నిష్కళంక మైన వారి పూర్వచారిత్రమునుబట్టియు, అటువంటి అపవాదములు విశ్వసింపగూడని వనియు, ఆంధ్రదేశమునకు మహోపకారముజేసిన మహనీయునిమీద దిక్కులేని యవస్థలో నిటువంటి అపవాదులువేయుట పాపహేతువనియు వట్టికృతఘ్నతయనియు నిశ్చయించుకొంటిని. నామిత్రులైన దామెర్ల వెంకటరమణారావు మొదలగువారు లోకములోని వాడుకను నమ్మిరి. టంగుటూరి శ్రీరాములుగారు వీరేశలింగముగారి మీది అపవాదులు నమ్మి ఆపత్రికలోగూడ కఠినవిమర్శన వర్షము గురిపించెను."

(- చిలకమర్తి స్వీ. చ. 272-273 పుటలు)

## మంగమ్మ కేసుగూర్చి ప్రకాశంగారు

వీరేశలింగంగారికి మంగమ్మచేసే శుశ్రూష అనేకమైన అపార్థాలకి తావు ఇచ్చి కొంత అపవాదుకి కారణం అయింది. ఆవిషయాన్నిగురించి తీవ్రంగా వ్రాయడంచేత వీరేశలింగంగారు శ్రీరాములుమీద జాయంటు మేజస్ట్రేటు కోర్టులో లిబెల్ కేసువేశారు. అప్పుడు నేను ప్రీవీకౌన్సిలు పనిమీద లండను వెళ్ళాను.

నేను ఇంగ్లాండులో ఉన్నప్పుడు అలాంటిదే ఒకకేసు జరిగింది. ఒక యువతి డ్రస్సింగ్‌గదిలోఉండగా కొత్త వయస్సుముదిరిన పాదిరీ ఆగదిలో కొన్నినిమిషాలు ఉన్నాడన్న కారణంచేత ఆయనమీద వ్యభిచారనేరం ఆరోపించారు. అది తండోప తండాలుగా ప్రేక్షకుల్ని ఆకర్షించిన కేసు: పాదిరీ తాను ఏవిధమైన అపచారమూ చెయ్యలేదనీ, ఆమెతో మాట్లాడడానికిమాత్రమే ఆగదిలోపల ఉన్నాననీ వాదించాడు. కోర్టువారు ఆడ్రస్సులో ఒంటరిగా ఉండేటప్పుడు ఆమెతో ఒకగదిలో ఉండడమే నేరమని నిర్ణయించి ఆపాదిరీని శిక్షించారు।

వీరేశలింగంగారి కేసుకూడా ఇల్లాంటిదే. ఆయనమీద ఆమె ఏకాంతంగా ఉండగా పంతులుగారు ఆమె వీపునిమురుతూ ఉండేవారనీ, బెంగుళూరు ప్రయాణంలో సెకండుక్లాసుకంపార్టుమెంటులో ఉభయులూ ప్రత్యేకంగా ప్రయాణంచేశారనీ, బెంగుళూరులో ఇద్దరూ మూడుమాసాలు ఒకగదిలోనే ఉన్నారనీ నిందారోపణచేశారు.

"మంగమ్మని నా అభిమానపుత్రికగా చూసుకునేవాణ్ణి" అని వీరేశలింగంగారివాదన. పాపం! వీరేశలింగం పంతులుగారిని సుమారు ఐదురోజులు క్రాసుపరీక్షచేసి ఈపై సంగతులన్నీ ఒప్పించాను. ఆ ఇంగ్లీషుకేసు నాధారంగా చేసుకుని నావాదన అంతా ఆ పద్ధతులమీద నడిపించాను.

కార్లీలియన్ పత్రిక తరువాత అట్టేకాలం నడవలేదు. దాని పర్యవసానం ఏమయినా, పంతులుగారు చెప్పుడుమాటలు విని ఈకేసుపెట్టినందుకు, ఆయనఅంటే భక్తిగౌరవాలు ఉన్ననేను ఆయన్ని బోనులో నిలబెట్టి చాలా కష్టమైన ప్రశ్నలతో బాధించాను. అందుకుమాత్రం నామనస్సు చాలా నొచ్చుకుంది. కానీ వృత్తిధర్మం చేత అది తప్పనిసరి అయింది. శ్రీరాములు రాజమహేంద్రవరంలోనే న్యాయంగా వకీలువృత్తి చేసుకుంటూ కాలక్షేపం చేస్తూవచ్చాడు.

(వీరేశలింగంకేసు - నాజీవితయాత్ర - పుటలు 179-181

తనతమ్ముడు వీరేశలింగంమీద అసత్యం వ్రాశాడని, వట్టిఅపనింద వేశాడని ప్రకాశంగారు వ్రాయటంలేదు. వీరేశలింగంచేత కోర్టులో ఒప్పించినట్టి విషయాలు మంగమ్మ వీపుతాకి నిమరటం, ఒకేగదిలో పరుండటం అనేవిషయాలు వట్టిసంగతులనటంలేదు. పైగా వీరేశలింగంగారే చెప్పుడుమాటలువిని తనతమ్ముడిమీద కేసు పెట్టాడంటున్నారు. అయితే అంతసంస్కరణ చెప్పిచేసినాడన్న గౌరవంగలవారిని ఇంత నిష్ఠురమైన సత్యాలనుగూర్చి నిగ్గదీసి కష్టపెట్టక తప్పలేదన్న ఆమాట ఒకపెద్దవాణ్ణి తాననవలసివచ్చిందే అన్నమాటతప్ప లేనివిషయమై నిలదీసి తికమకపెట్టి Forced Confersion ఒకటి అన్యాయంగా రాబట్టాననటంలేదు. ఈవిషయాలు కానకుండా, వీరేశలింగంగారిని ఒక అసత్యారోపణను అంగీకరింపజేసినందుకు పశ్చాత్తాపపడినట్లుగా కొందరుఅర్థంచేసుకోవటంప్రచారంచేయటంఅన్యాయంగావుంది. కష్టమైనప్రశ్నలన్నాడుగాని అసత్యారోపణలు, ప్రశ్నలు వేసినందుకు బాధపడలేదు అనిస్పష్టంగా గ్రహించాలి.

## శ్రీ రాములుగారి భవనం

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి షష్టిపూర్తి సమ్మానసంచికలో శ్రీరాములుగారే స్వయంగా ఈకేసువిషయమై ఒక ఇంగ్లీషువ్యాసాన్ని వ్రాశారు. అది శ్రీరాములుగారు చనిపోయినపిదప 1952లో ప్రచురితమైనది. దానిలో కొన్నిభాగాలను వేరుగాయిస్తున్నాను. అందులో చాలా ఆసక్తికరమైన విశేషాలున్నవి. ప్రకాశంగారు కేసు రాజీ చేయజూచారని వీరేశలింగంగారే రాజీత్మఃఅనీకరించారని, బేషరతు క్షమాపణ తప్ప మరొక విధంగాలేవని పట్టుబట్టి, ప్రకాశంగారి నిర్దాక్షిణ్యమైన ప్రశ్నలతో తన అప్రతిష్ఠాకరమైన అక్రమవర్తనను ఒప్పేసుకోవాల్సివచ్చిగప్పుచుప్పుగా కేసువత్తివేసుకొని నింద్యవర్తన ఒప్పుకొన్నట్టుచేసుకొన్నాడని,అదిచాలకమళ్ళీ1915ఆగస్టులో Malis-ciousProsecution చేయించినందుకు డామేజెస్‌కు కేసువేశాడని,అదీకోల్పోయారని తెలుస్తుంది. ఈవిషయాలు ప్రకాశంగారు తమ ఆత్మకథలో వ్రాయమరచారు.

## A Sensational Case of Defamation

Mr. Viresalingam first wrote an article attributing motives to his critic Mr. Sriramuluwho there upon filed alibel case against him. Mr. Viresaliingam Pantulu in his turn filed a Libel case against Mr. Sriramulu and Nalam Krishna Rao and others for imputing immorality, The cases created asensation not only in Rajamandry but in the whole of the country.

"The Hindu of Madras published a report on this case under the Captian "A Sensational Case of Defamation". It did not however publish the proceedings or even the statement of Mr. Viresalingam wihch contained facts enough to prove that he was a fallen man. (పతితుడు)

It appears that Sri Kasturi Ranga Iyengar, the Editor of The Hindu, wrote a letter to Mr. Ganti Lakshmanna, (Rajah mundry) the Hindu Correspondent that he did not like a partisan view.

"The Indian Patriot" published three-fourths of the deposi tion but omitted the rest. It appears that Bodapati Ramalingam the Correspondent, did not like its publication.

Mr. Mocherla Ramachandra Rao tried to effect a compro mise but Mr. Nalam Krishna Rao did not agree at first· He how-ever, apologised on 10-12-1913 after charge was framed by Mr. Bardswell. It seems that Mr. Dinavahi Hanumantha Rao who read the deposition published in the Indian patriot said he was not able to tolerate it and asked Mr. Prakasam to get the case com-promised some h· w Mr. F. W. Stewart passed his Judgment on 10-1-1914 discharging the accused after passing strictures against Mr. Viresalingam, the complainant.

The Carlylean published the proceedings of both cases in full and copies were sent to all the news papers in India. No daily paper wrote anything about the cases, "The Social Reform Advocate" of Madras and "The Indian Social Reformer" of Bom bay (weeklies) wrote about the cases. Except one Telugu paper others did not write anything about them :

Mr. Baru Srirama Narasimha Rao and Adavicolanu Venkata Gopala Rao tried to effect a compromies but Mr. Sriramulu said here was no scope for a compromise. Mr. Bardswell who first raed the case was transferred after he framed charges and the now,

Divisional Magistrate, Mr. F. W. Stewart permitted Denovotrial and Mr. Prakasam, Counsel for the accused who cross -examined Mr. Viresalingam, could clicit many damning admissions and the Magistrate severely criticised the conduct of the complainant, Mr. Viresalingam and passed strictures on his moral character and discharged the accused. Mr. Viresalingam thereafter filed a revision petition before Mr Elwin, the District Magistrate who ordered further inquiry on 6-2-1914. Thereupon Mr. Sriramulu filed a criminal revision in the High Court against this order.

In Fabruary 1914, the matter came up for admission before Mr. Justice Sadasiva Iyer. It was argue that the Judgment of Mr. Stewart should be considered to be an order of acquittal and therefore the order of further enquiry by Mr. Elwin could not be sustained, but Mr. Sadasiva Iyer over-ruled it and admitted the revision and ordered that it should be posted before a Bench. Before passing orders, he advised Mr. Prakasam that it is better if the matter is compromised as both the complainant and the accused were persons working for public good.

Mr. Sriramulu commented in his paper:-

"It is a pity that Mr. Justice Sadasiva Iyer advised like that even after reading the Judgement of Mr. Stewart and the order of Mr. Elwin and understanding the nature of the case."

Mr. Sriramulu in his article in the Carlylean criticised Mr. Justice, Sadasiva Iyer for giving such an advice. He says,

"Mr. Viresalingam's case is that we libelled his private moral character out of spite with a view to enthrone ourselves in his place. We pleaded justification for the public good and non-applicability of the plea alleged to have been raised by him. Both of us cannot be in the right."

"On 10-1-1914 Mr. F. W Stewart held that his immoral living was proved for the purposes of the evidence Act and that the only evidence more conclusive, one could ask for was that of the girl herself but she was not likely to admit 'immorality".

"On 6-2-1914 Mr. Elwin ordered futher enquiry on the sole ground that Mr. Viresalingam's conduct" though inexcusable and immoral from English stand point, must be seen if it was so from the Hindu stand-point." As a Hindu, his Lordship (Sadasiva Iyer) knows what the Hindu stand-point is in regard to the matter in dispute."

"Under such circumstances, was it proper for him to throw a hint to our counsel who is our elder brother? We are sorry, he went out of his way as a judge. Sadasiva Iyer put a premium on falsehood, hypocracy and selfishness out of false pity. A social and religious reformer who abuses his trust, misbehaves with a young woman, puts on the mask of a marriage under the auspices of a public-registered-association, gives a social reform - cosmopolitan dinner to which, associates of reform are invited and which they attend and sets the criminal law in motion against those who criticise and expose his conduct with a view to redeem him and the movement whch he proposes to lead, what kind of man is he? Is he not a corrupter of public life and public movement and an enemy to progress?'

'Of course, our Counsel (T. Prakasam) himself was moved not a little by false pity, and magnanimity towards the all round transparent impostor of Rajahmudry and tried to bring about a compromise.'

'Mr. Viresalingam and his influential supporters refused to accept any terms short of an apology. Mr. Prakasam tried to compromise by reporting that the cases are a djusted out of court. Mr. Sriramulu thanked god that this move fell through.

While the petition for revision was pending in high court the anniversary of Andhra Jateeya Kalasala of Masulipatam was celebrated last year (1914) with Mr. justice Sadasiva Iyer in the chair. Mr. Viresalingam attended the function and occupied the platform beside or behind Justice Iyer along with Mr. Annie Besant and was garlanded along with them all evidently to show to the Tamil Judge that Andhra Patriotic world did not see anything wrong in the startling facts now known about Viresa lingam's private character. It seems that the Andhra Patriots are bent upon promoting moral progress of Andhra Desa by white washing the daring and hideous day-light immorality and imposture of its heaven-sent prophet." Mr. Sriramulu says that he is of the opinion that Viresalingam's not retiring from public life is having a bad effect on the moral and social reform movements.

He proceeds to say 'After the publication of this article in Carlylean, there was some searching of hearts among the Brahmo Samaj Circles. 'Dharma Sadhani, a fortnightly Telugu paper

took courage to request Mr. Viresalingam to retire from public life 'Mr. Sriramulu translated the article and published it in the Carlylean in the first week of September. But the efforts of Dharmasadhani did not fructify.

While the defamation cases were going on, Mangamma died. Prakasa Rao and Mangamma were Brahmins but it was on accouat of Pursuation of Viresalingam, Prakasa Rao married her according to Brahmo rituals discarding his sacred thread. Now he resumed his sacred thread. Mr. Viresalingam now performed his marriage again to a Brahmin widow according to Hindu Brahminical rituals. This was not palatable to Dharmasadhani and Cocanada Brahamo circles. Dharmasadhani criticised the conduct of Viresalingam about this and said that the public opinion about him is shaken on account of the defamation cases and suggested that he retires from public life in its issue dated 16-8-1915.

Mr. Sriramulu translated this article and published it in Carlylean of September first week. It says 'great good has been done to the country through Mr. Viresalingam Pantulu. Therefore we revere him. Our reverence towards him will always last. But when we review his activities, we cannot but express our opinion of them, though adverse or unpleasant. Although we could not discover if Mr. Prakasa Rao knew English or not, yet we found out that he became a Brahmo and got his first marriage (with Mangamma) performed according to the rites of the Brahmo Samaj. It seems that he has now redonned his sacred thread. Therefore it seems that Mr. Pantulu believed that he had become again a Hindu. So it seems that he allowed his second marriage to be performed accoriding to Hindu rites under his auspices. Oh what a scorn of relig ion is this? It cannot but strike even those who have the least thinking faculty that Mr, Prakasa Rao is changing his religion for the sake of marriage.

There is nothing strange in Messers Chilakamarthi Lakshmi Narasimham and Kunduri Venkataratnam's thinking that Mr. Prakasa Rao is a fickle minded person and it is not good that Mr. pantulu should lend countenance to his couduct. Both of them went away by way of dincountenancing the marriage, without changing their opinion even after hearing the explanation given by Mr. Pantulu.

Marriages like this will spell infinite harm and ruin to the country. They are root-eating worms of Dharma, Righteousness or morality. So it is very reprehensible that Mr. Pantulu should countenance and help them. It is our opinion that Mr. Pantulu doing great harm both to the Brahmo Samaj and to the Hindu Society by his encouraging them.

We have one thing to tell Mr.Pantulu. As those friends who cooperate with him are losing faith in him on account of such strange actions of his as the opinion or feeling of the majority of people is against him as a result of the recent defamation cases, as he grew old, he will do well to understand that it is not good for him to have any more connection with Public movements and so we request him to sever his connection with the same and to take rest and spend his old age in peace.

Mr. Sriramulu refers to the fact that Mr. Chilkamarthi who is a great admirer of Viresalingam and who described him as a great saintly person (మహర్షి) mentions his despotic and fickle conduct regarding the marriage of Kamaraju Hanumantha Rao with Sundaramma at pages 242 and 243. of his own autobiography. He however continued to admire and obey Viresalingam. It is only when this horrible conduct regarding the marriage of Potharazu Prakasa Rao occurred that Mr. Chilakamarthi opened his eyes and protested.

Mr. Sriramulu commented that the article of Dharma Sadhani exploded the theory of Mr. Elwin that the behaviour of Mr. Pantulu might be harmless and innocent according to Hindu manners and customs.

In 1915, August, Mr. Viresalingam filed a suit for damages for malicious prosecution for the case filed by Sriramulu against him in the District Munsiff's Court. Mr. Prakasam knows all these facts which made me to demand the retirement of Pantulu from public life in Carlylean. But he does not mention the second and third scenes in the first case of Defamation filed by me and the second case of defamation filed by Pantulu. How can we expect him to mention about the great agitation for retirement in Carlylean?

## పంతులుగారి తుదివిలాపం :

1913లో ప్రారంభమై1915లో ముగిసిన యీ రగడను గూర్చి వ్రాయకుండా తప్పుకోవడానికి యీవ్యాజ్యెం ముగియకుండా ఇంకా కోర్టువిచారణలో వుందని అబద్ధం వ్రాసి, స్వీయజీవిత కథను 1912 ఏప్రిల్‌తోనే ముగించేశారుగాని తమ చ్యుతశీలము రచ్చకెక్కగా కోర్టుద్వారా పునరుద్ధరించుకొన యత్నించి విఫలురై యీ కోర్టు వృత్తాంతమును దృష్టిలో పెటుకొని అన్యాపదేశంగా తుది విలాపం చేయ మానలేదు.

"ఒకరే విషయమునైనను పనిచేసి పేరుపొందుచున్నప్పు డీర్ష్యాళువులైనవారు కొందరు బయలుదేరి యోర్వలేమిచేత వారిపైన లేనిదోషముల నారోపించి వారి పేరునకు భంగము కలిగింప బాటుపడుచుందురు. మరికొందరు వారి కీర్తికి మాలిన్యము కలిగించి, వారి నడఁగ్రదొక్కుటచేతనే తాము పైకిరావలెనని ప్రయత్నము చేయుదురు."

నీతులు బోధించుట గాక, ఆచరించుటే తన విశిష్టతయని ఘంటా ఘోషము చేసిచేసి కడపటికి దారి తప్పిన గురువరునిపై సుశిక్షితులైన శిష్యులు చేసిన తిరుగుబాటేగాని, సంస్కరణ నాయకపట్టముకొరకై ఈర్ష్యచే, ద్వేషముచే, ఇతరులను క్రిందికీడ్చి బురదపూయు ప్రయత్నము కాదని వేరే చెప్పనక్కరలేదు.

# అభినవ అజామిళోపాఖ్యానము

గుడిపాటి వెంకటాచలంగారి స్వీయచరిత్ర 1975 సం॥లో ప్రకటింపబడినది. ఆయన జీవిత చరిత్రనుగూర్చిన మూడుపెద్ద సంపుటాలను పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారు 1983 సం॥లో ప్రకటించారు.

ఆంధ్రదేశ ఆధునిక యుగచరిత్ర రచనకీ గ్రంథాలు తోడ్పడతాయి. వీరేశ లింగం-వెంకటరత్నం నాయుడుగార్ల నాయకత్వాన పుట్టిపెరిగిన బ్రహ్మసమాజ సంఘ సంస్కరణోద్యమాలు అడుగంటి పోవడానికిగల కారణాలు ఈ గ్రంథాలవలన తెలుస్తాయి. ఇంతేకాదు; ఆంధ్రదేశ చరిత్రలో ప్రాముఖ్యము వహించిన అనేకమంది స్త్రీ పురుషుల రహస్య జీవితాలు వీనిలో బట్టబయలైనవి.

భాగవత పురాణములోని అజామిళుడు భ్రష్టుడై ముక్తిపొందిన బ్రాహ్మణుడు. అభినవ అజామిళుడనతగిన వెంకటచలంగారు భ్రష్టుడై విరక్తిచెందిన బ్రహ్మసమాజికుడు.

వెంకటచలంగారు రమణ మహర్షి శిష్యుడని చెప్పుకుంటూ గడ్డంపెంచి తన విచిత్ర సిద్ధాంతాలను పత్రికలలోను స్వీయచరిత్రలోను ప్రకటించాడు:

"—పరస్త్రీ గమనం పాపమా? ఇంత ఆనందమైనది పాపమా? ఎందుకు పాపం?

—భార్యలో లేనిపాపం ఇంకో స్త్రీలో పాపం ఎలా అయింది?

—ఈ శృంగారం పాపం అని నిజంగా ఈశ్వరుడు చెప్పాడా?

—అసలీ శృంగారమంటే తెలియని జనులు ఇలాంటి అబద్ధపు నిబంధనలు ఏర్పరచారా?

—ఇదంతా ఒక భార్యని కట్టుకోవడం వల్ల వచ్చిందేకదా?"

అని తనముఖ్య సిద్ధాంతాన్ని స్వీయచరిత్రలో వెల్లడించారు. (49 పుట)

"నేను బి.ఏ. అవగానే ఉద్యోగం కోసం ప్రయత్నం చేసుకొంటూండగా, వెంకటరత్నం నాయుడుగారు నన్ను తమ కాలేజీలో ట్యూటరుగా చేరమని టెలిగ్రాం యిచ్చారు. ఆయనకు ప్రియ శిష్యుడనైనాను. ఆయన ఎన్ని విధాల గొప్పవారో!! ఆయనే నామొదటి ఆధ్యాత్మ గురువు. ఎట్లా పట్టిందో ఆయనకు (పిఠాపురం) మహారాజాగారిపైన ప్రేమ. అదొక్కటితప్ప ఆయన జీవితంలో ఎన్నదగిన లోపం కనిపించదు. ఆ ప్రేమ ఆయన్ని లోప భూయిష్టంగా చేసింది. కాకినాడ వెళ్ళగానే పూర్తిగా బ్రహ్మసమాజంలో చేరాను. నాకు వూపిరి, తండ్రి బతుకు అంతా బ్రహ్మ సమాజమే అయిపోయింది. "T" (చలంగారి భార్య రంగనాయకమ్మ) నన్ను అనుసరించింది. బ్రహ్మ సమాజం రెండు భాగాలు. 1. ఈశ్వరుడిలో భక్తి 2. మానవ సౌభ్రాతృత్వం. ఈ రెండు కార్యాలను గట్టిగా పట్టాను. ఎప్పుడూ ఏకాంతంగా కూర్చోవటం; దైవం మీదనే మనస్సు నిలపడం, ప్రార్థించడం; నాలో దోషాలున్నా

వాటిని నిర్మూలించడానికి గట్టి ప్రయత్నం చేయడం; నాలోని లోపాలను నిర్మూలించాలని నా జీవిత మంతా గట్టి ప్రయత్నం చేశాను. ఈనాటి వరకు నాలో తీవ్ర యుద్ధం సాగుతూనే వున్నది. దీని కోసమే ఈపై సంస్కరణలన్నీ, నేను చేసిన పనులు; నేను వ్రాసిన వ్రాతలన్నీ; ఎవరి సంస్కరణకోసం కాదు. నన్ను నేను సంస్కరించుకోవడానికి. [పుట 47]

నా ఆశయాలు :- [1] కుల చిహ్నాలు తీసేసుకోవడం.
[2] కుల భేధాలు లేకుండా భోజనాలు.
[3] స్త్రీ స్వాతంత్ర్యం.
[4] విగ్రహారాధన చేయడం మానుకోవడం [పు. 47]

"బ్రహ్మసమాజంలో స్వర్గ నరకాలు లేవు. చచ్చి పోయినతర్వాత మనుషులందరూ ఇక్కడ వారికి సాధ్యంకాని ఔన్నత్యాన్ని అందుకోవాలని ప్రయత్నిస్తారు. అంటే Moral and Spiritual Revolution ఉంటుందన్నమాట. ఆ లోకాల్లో కొన్ని పుణ్యపాపాలున్నవి. పుణ్యకార్యాలు మనల్ని ఈశ్వరుడి దగ్గరగా తీసికొని పోతాయి. పాపకార్యాలు దూరం చేస్తాయి. ఈశ్వరుడు ఒకఅప్రమేయ ఆనందానుభవం. పునర్జన్మనేది లేదు. బ్రహ్మసమాజంలో నున్నన్నాళ్ళు ఈ ప్రపంచం పైన ఏ ప్రశ్నా రాలేదు. దయామయుడైన ఈశ్వరుడి లోకంలో యిన్ని అక్రమాలు ఎందుకున్నాయనే ప్రశ్నరాలేదు నా మనసుకి. ఇప్పుడు నాజీవితంలో నైతిక సమస్యలు యేర్పడేటప్పటికి ఈశ్వరుడిపై ప్రశ్నలు బయలుదేరాయి. ఇన్ని నెలలలో నాకు సహచరుడై నాప్రియుడై నాప్రేమలో ఎంతో దగ్గరగా మెలగిన ఈశ్వరుడు నిజంగా ఉన్నాడా? లేడా? అనే ప్రశ్న వచ్చేటప్పటికి చాలా బాధ పట్టుకుంది నన్ను."

ఇదంతా సృష్టించింది ఈశ్వరుడేనా? ఇంతకన్న లోకాన్ని బాగుచేయడం చేతకాలేదా? పుట్టినందుకే కొందరిని అందవికారంగాను క్రూరులుగాను ఎందుకు చేశాడు? కొందరిని ఎందుకు బాధలతో కాల్చుకు తింటాడు జీవితమంతా? ఇలాంటి వెన్నో (పుట 50).

నీకులమేమిటి? అని ఎవరైనా నన్నడిగినప్పుడు 'నాకు కులంలేదు' అనేవాణ్ణి ఆ మాట నన్ను ఎన్ని ఇబ్బందులలోనికి తీసుకువెళ్లిందో! దూరంగావుండేది. మనసులోనాలోంచి భేదాలు పోతే అవి పోవాలని ప్రచారంచేస్తే అవి లోకం లోంచే ఓనాటికి పోవడానికే నా ప్రయత్నాలు సాయపడతాయని; ఎవరినీ నేను "నీదేకులం?" అని అడుగలేదు.

నేను బ్రహ్మమతంలో ప్రవేశించడంలో అసలు దానికి జీవం పోసినట్లైంది. నేను, [మొక్కపాటి] రామూర్తి, ఇంకా నామిత్రులు అతివాదులమైనా ఆ విధంగా అమితమైన ఉత్సాహంతో, గొప్ప సంతోషంతో రెండేళ్లు గడిచాయి' ఎప్పుడూ నాలో త్రీవమైన Struggle నా స్వభావం"

చలంగారికి మనస్సు చలించింది. స్త్రీ వాంఛ అపరిమితమైనది. వారు వారి మిత్రులు వావివరుసలు కూడా విస్మరించి స్వేచ్ఛా విహారులైనారు. చలంగారు

మాంసము, చేపలు తినేవారు. ఇంట్లో వండించేవారు. భార్య చిన్నరంగనాయకమ్మ గారిని పిల్లలను బెజవాడలోని తన వదిన డాక్టరు రంగనాయకమ్మ గారింటిలో వదిలిపెట్టి ఒక వొంటరి జాతిస్త్రీ తో కొన్నాళ్ళు కాలక్షేపం చేశాడు. పాపం ఆయన భార్య రంగనాయకమ్మగారు మహా ఇల్లాలు. భర్త చేసే అపభ్రంశం పనులన్నీ సహించి కాలక్షేపం చేసేది. ఆయన ప్రోత్సాహంతో పిల్లలుకూడా ఆవిడ మాటలు వినేవారుకారు. కొంత కాలానికి వైరాగ్యం కలిగి రమణాశ్రమానికి వెళ్ళింది. అక్కడ ఆమెకు మనోవైకల్యం కలిగింది. రమణ మహర్షి జాలిపడి ఆమెను బెజ వాడకు పంపించి వేశారు.

వెంకటచలంగారు కొన్నాళ్ళకు రమణ మహర్షి ఆశ్రమంలో చేరాలని ప్రయ త్నించారు. రమణ మహర్షి చేరనివ్వలేదు. అంతట ఆశ్రమానికి కొంతదూరంలో ఒక ఇల్లుకట్టిదానికి 'రమణస్థాన్' అనిపేరుపెట్టారు. చలంగారి కూతురు సౌరిస్‌కు పెళ్ళిలేదు. ఆమెకూడా చలంగారి దగ్గర వుండేది. రమణ మహర్షిగారి శిష్యురాల ననేది. కొంత కాలానికి తనకు దైవం ప్రత్యక్షమైనాడనేది. ఆమె నోటవచ్చే మాటలు మహర్షిగారివే అని చలంగారు వ్రాస్తారు.

చలంగారిని గాని, సౌరిస్‌ను గాని వారికి సంబంధించిన వారినిగాని రమణ మహర్షి తన ఆశ్రమంలో చేరనివ్వలేదని, చలంగారి ప్రచారం నిజంకాదని బెజ వాడలో సుప్రసిద్ధ డాక్టరుగా చాలాకాలము ప్రాక్టీసు చేసి ప్రస్తుతం హైదరాబాదులో విశ్రాంతి పొందుతూవున్న నా మిత్రులు డాక్టరు చాగంటి సూర్యనారాయణమూర్తి గారు నాకు చెప్పారు. వీరు రమణ మహర్షిగారికి కంచి కామకోటి శంకరాచార్యులు చంద్రశేఖరేంద్ర స్వామి వారికి శిష్యులు-కొన్ని గొప్ప గ్రంథాలు రచించారు.

### "అబ్బత్త" విచిత్ర వృత్తాంతము-:

గుడిపాటి వెంకటాచలంగారి మేనత్త-తండ్రి సోదరిని "అబ్బత్త" అని పిలి చేవారు. ఆమె కథను స్వీయచరిత్రలో వ్రాశారు. వెంకటచలంగారు కొమ్మూరి సాంబశివరావుగారి కొమారుడు. మాతామహుడైన గుడిపాటి వెంకటరామయ్య గారికి దత్తత వెళ్ళినందువల్ల గుడిపాటి వారైనారు. వెంకటచలంగారి కుటుంబానికి వీరేశలింగం పంతులుగారితో సన్నిహిత సంబంధాలున్నవి. వెంకటచలంగారి జనక తండ్రియైన కొమ్మూరి సాంబశివరావుగారి తండ్రిగారి పేరు వెంకటచలంగారు. ఆయన వీరేశలింగంగారి సహాధ్యాయులు. కొమ్మూరి వెంకటచలంగారి కొమార్తె మహాలక్ష్మి చాలా అందమైన పిల్ల. ఆమెను చిన్నప్పుడే కనుపర్తి సంజీవరాయుడు గారి కొమారునికిచ్చి పెళ్ళి చేశారు. ఆ పిల్లవాడు కొద్ది కాలానికే చనిపోగా, ఈ బాల వితంతువు పెద తండ్రిగారి ప్రోత్సాహంతో వీరేశలింగంగారి వితంతు శరణా లయానికి పారిపోయింది. అప్పట్లో వీరేశలింగంగారి కుడిభుజంగా నుండిన

న్యాపతి సుబ్బారావు పంతులుగారి తమ్ముడు, పెద్దప్రభుత్వోద్యోగియైన శేషగిరిరావుగారి భార్య చనిపోయి మళ్ళీ వివాహము చేసుకోవాలని అనుకుంటూ పంతులుగారి వితంతు శరణాలయం చూడటానికి వచ్చి అక్కడనున్న సౌందర్యవతియైన ఈ బాల వితంతువును వరించి వివాహం చేసుకుంటానని అన్నారు అయితే ఈ సంగతి తెలిస్తే న్యాపతి సుబ్బారావు పంతులుగారు అంగీకరించరని శేషగిరిరావుగారు వీరేశలింగం పంతులుగారు దీనిని రహస్యంగా వుంచారు. 26_2-1900 తేదీన వివాహం జరిగింది. అటు తరువాత ఈ సంగతి తెలియగా న్యాపతి సుబ్బారావు గారు పంతులుగారితో మాట్లాడటం మానివేసి బలవద్విరోధి యైనారు.

న్యాపతి శేషగిరిరావు గారు తమ నూతన వధువైన మహాలక్ష్మి పట్ల చాలా ప్రేమ కలిగి తమతో ఉద్యోగపు ఊళ్ళన్నీ తిప్పుతూ వంటినిండా నగలుపెట్టి సుఖంగా కొన్నాళ్ళు కాపురంచేసి విధివశంచేత అకాలమరణమును పొందారు. అంతట చలంగారి అబ్బత్తమళ్ళీ అనాథఅయింది. ఆమెసౌందర్యమే ఆమెకుశత్రువై చాలామంది ఆమె చుట్టూ తిరగడం ప్రారంభించారు గాని వారిలో నీతి నియమాలు లేక తుదకు ఆమెను ఒక జమిందారునికి అమ్మివేశారట! ఆ కథ అంతా ఆమె చలంగారికి పూస గ్రుచ్చినట్లు చెప్పగా ఆయన స్వీయ చరిత్రలో వ్రాశారు.

అబ్బత్త అంటుంది:—

"ఇది చూడు నాయనా! ఈ ఉద్యమం ప్రారంభించడం ఒక ఎత్తు. సంఘాన్నంతా ఎదిరించి ఒక టీచరు ఇటువంటి ఉద్యమం ప్రారంభించారంటే, ఆయన దయ, సాహసం ఎంత ఘనమైనవో ఆ ఉద్యమం అప్పుడప్పుడే పాదుకుంటూన్నదన్న కాలంలో, ఒక అభాగిని వివాహం కోసం తనకున్న ఒక్క Suppoter ని తన ప్రిన్సిపుల్ కోసం వదులుకున్నారంటే ఆయన ఎంతగొప్పవాడో ఆలోచించు. అన్నది అత్తయ్య" (పుట 62)

అబ్బత్త ఇంకా ఇలా అన్నది:-

"శరణాలయంలోచేరిన వితంతువులని వీరేశలింగం గారు ఎలా treat చేసేవారో తెలిసిందే కదా? మొగుడో, మొగుడో అంటూ ఇళ్ళనుండి పారిపోయి వచ్చిన ఈ స్త్రీలను పెళ్ళి చేసికొనడానికి ఎవరు వస్తారు? వాళ్ళకి ఎక్కడా భార్యలు దొరకని దరిద్రులు, ఎందుకూ కొరగాని వాళ్ళు, వరులక్రింద తయారయ్యే వారు. అప్పుడు వీరేశలింగం గారు పురుష స్వయంవరం ఏర్పాటు చేసేవారు. వారు ఇష్టపడ్డ పిల్లల్ని, ఆడపిల్లల కిష్టమున్నా లేకపోయినా వరుడికి కట్టి పంపేవారు. అవును నిజమే, కాకపోతే ఆ సంస్కరణోద్యమం ఎట్లా సాగుతుంది? ఆ వరుళ్ళ మొహాలు చూసి ఏ ఆడది అతనితో వివాహానికి ఒప్పుకుంటుంది? అట్లా చూసుకుంటే, వొస్తూవున్న ఈ స్త్రీలు యెంతమందిని అట్టిపెట్టి పోషించగలరు ఎంత దయామయుడైనా? దాంట్లో అర్థ మేముంది? తక్కినకథ జగద్విదితమే. నాఅత్తయ్య అదృష్టం

కొద్ది గొప్ప ఆఫీసరు న్యాపతి శేషగిరిరావు గారు Home దర్శించ వచ్చారు ఈమెను చూసి వరించారు. తక్కినదంతా వీరేశలింగంగారి స్వీయచరిత్రలో చదువ వచ్చు.' అని చలంగారు వ్రాసి, వీరేశలింగంగారి ఉద్యమానికి Supporter గా నుండిన న్యాపతి సుబ్బారావుగారు వీరేశలింగంగారు చేసిన పని భరించలేక ప్రబల విరోధియైనాడు" అని కూడా 61 వ పుటలో వ్రాశారు. అబ్బుత్త దురదృష్టం వల్ల శేషగిరిరావు గారు కూడా చనిపోయారు. మళ్ళీ ఆవిడ అనాథయైనది. అటు తరువాత జరిగిన కథ ఆమె చెప్పింది: చలంగారితో ఆమె అంటుంది:

"ఈ మొగాళ్ళు బాబూ ఎంత ఉత్తములైనా వారి దృష్టి కామినీ కాంచనాలను వొదలదు. నువ్వు అట్లా కాబోకు బాబూ. ఆనాడు నా చుట్టూ చేరిన వాళ్ళు నీతివేత్తలు, ఎంత గొప్ప నీతి పరులు దొంగలూ ఖ్యాతిపరులైనారో తరువాత కాలంలో —ఎందుకులే—వాళ్ళ పేర్లు చెపితే నువ్వు కాదు—ఈ లోకమంతా గుర్తుపడతారు. వాళ్ళలో ఎవరు ఎవర్ని వొంటరిగా వదలరు—నా దగ్గర ఋతువులలో రోడ్డు మీద కరచుకునే కుక్కలు నయం బాబూ" అంది.

ఎట్లానైనా నన్ను వదల్చుకుంటేనేగాని వాళ్ళకు శాంతిలేదు. చివరకు వాళ్ళతో తిరిగే ఒక దూరదేశపు జమిందారుకు అమ్మివేశారు నన్ను. We do not even know whether she was married to that zamindar Venkatachalam" అని క్రూరంగా మాట్లాడేవారు నా గురువు గారు. ఒక్కప్పుడు పెళ్ళి అయిందనేది. ఒక్కప్పుడు లేదనేది. మరీ అడిగితే చిన్నతనం నాకేంతెలుసు? ఏదో ఆఫీసుకు తీసికెళ్ళారు. దండలు మార్చారు. సంతకం చేయమన్నారు, అంతే. సాయంత్రం కలకత్తా మెయిలులో ఎక్కించారు" అనేది. ఆకమలను కూడా ఒకప్పుడు కూతురనేది. ఒకప్పుడు కూతురేమిటి నేను పెంచుకున్న పిల్లనేది. ఆ జమీందారు ఆవిడను ఒక అరణ్యం మధ్యలో ఒక భవనంలో దాచాడు. తనకు అమ్మిన వాళ్ళు వస్తారని వాళ్ళనుండి కాపాడాలని. "అక్కడ నన్ను బాధించి ఉండుండి ఏదో కాగితాలిచ్చి సంతకాలు చేయించారు. క్రమంగా నా రెండు ఆస్తులు-మొదటి యిద్దరు భర్తల ఆస్తులు—అతడు హరిస్తున్నాడని తెలిసింది—అటు తరువాత వాడు కమల వెంటబడితే పెద్ద పులిలాగ వాడి మీదపడి పీకేదాన్ని" అని చెప్పింది. ఆమె తనకు పెళ్ళి చేసిన వారందరికి వుత్తరాలు వ్రాసినా పలకలేదు. తుదకు వీరేశలింగం గారికి మొరపెట్టుకున్నాను. కాని ఎవరు దిక్కు"

"వాళ్ళందరి దృష్టిలో నేను బహుపాపిని. నా సౌందర్యమే నా పాతకం' నేను చేసిన దేమిటి? నా మొదటి భర్తను నేను చచ్చిపొమ్మనలేదు; ఆయన చచ్చిపోతే మళ్లీపెళ్ళి కావాలని గోల పెట్టలేదు; నారెండో భర్తని నేను చచ్చిపొమ్మనలేదు—తరువాత మళ్ళీ పెళ్ళి కావాలని నేను అనలేదు. నా పేరు యెత్తితే మూడవ పెళ్ళి చేసుకున్న 'ముండ' అనిప్రతివారు ఉమ్మి వేస్తున్నారు."

"ఇంతమంది బంధువులలో నువ్వు తప్ప నన్ను పలకరించేవారులేరు. చివరికి పాపి అని అసహ్యించుకోని మహాత్ముడు వెంకటరత్నం నాయుడుగారు

జ్ఞాపకంవచ్చి ఆయనకి వుత్తరాలు వ్రాశాను. ఏమిజరిగిందోఏమో, ఒకరోజురాత్రి District Superintendant of Police సిబ్బందితో వచ్చి నన్ను రైలులో ఎక్కించి నన్ను యిక్కడ (వీరేశలింగంగారి శరణాలయం తోటలో యీ యింటిలో) దించివెళ్ళారు నాయనా! యిది యిల్లేనా? దిక్కుమాలిన స్త్రీ యెంతకు లోకువయింది?" అంది అత్తయ్య!

అబ్బాత్తను కమలను చలంగారు చూచినప్పుడు వారున్నది రాజమహేంద్రవరంలోని వీరేశలింగంగారి వితంతు శరణాలయం తోటలో పాడుబడిన పశువుల సాల! "అది చాలా పెద్దతోట. వీరేశలింగం గారు ఆ తోటపైన వితంతువులకన్న ఎక్కువ శ్రద్ధ చూపించారు. ఎన్నో రకరకాలైన అపురూపమైన మొక్కలను నాటించి జాగ్రత్తగా పెంచారు. మిరియాల తీగెలు, కదంబ వృక్షాలు, లవంగ, యాలక, జాజికాయ, జాపత్రి పొదలు, చందన మొదలైన పూల మొక్కలు ఇంకా ఎన్నో పేర్లవి. ఆకర్షకమైన పూలు—వాటి నన్నింటినీ వదలి ఇంకో లోకానికి వెళ్ళిపోవడానికి ఎంత బాధపడి వుంటారో ఆయన. మేలైన కట్టుబాటులతో శరణాలయం నడపడానికి పత్రాలు వ్రాశారు కానీ ఈ పుష్పాలు చావకుండా పోషించే యేర్పాటు చేయలేదు. ఈ తోట యజమాని సాధువు. అబ్బాత్త నోటికి దడిసో-జాలిపడో నా జోలికి రాలేదు. అబ్బాత్తకు కొన్ని రహస్యాలు తెలుసు—ఆ వితంతు శరణాలయాన్ని గురించి. అందువల్ల ఆమెను కదల్చుటకు భయమను కుంటాను." అనీ చలంగారు తమ స్వీయ చరిత్రలో వ్రాశారు.

చలంగారు రాజమహేంద్రవరానికి 1919 సం॥లో ఎల్.టి. చదవడానికి వెళ్ళినప్పటి సంగతులివి. వీరేశలింగం గారు చనిపోయి కొద్ది రోజులైనది. చలంగారి స్వీయ చరిత్రలో వీరేశలింగం, వెంకటరత్నం నాయుడుగార్ల నాయకత్వం క్రింద—పిఠాపురం రాజాగారి ధన బలంతో సాగిన బ్రహ్మ సమాజంలోని స్త్రీ పురుషులను గూర్చిన అనేక రహస్య విషయాలున్నవి. అందువల్ల వీరేశలింగంగారి మంచి చెడ్డలను గూర్చిన గ్రంథానికిది అనుబంధముగా జేర్చవలసిన అవసరం కలిగింది. వివరాలు తెలిసికోవలసిన పాఠకులు ఆ పుస్తకాలు చదువవచ్చును.

# బ్రాహ్మ మతము
# పంతులుగారి బ్రాహ్మణీకము

పంతులుగారు త్రికరణశుద్ధిగా పరిశుద్ధాస్తిక మతమైన బ్రహ్మసమాజ సిద్ధాంతముల ననుసరించి జీవించిన మహానుభావుడని, కఠోరమైన సత్యవ్రతుడని నీతి ధర్మాలు పాలించినవాడని, ఆయన యుగపురుషుడని పంతులుగారి అంధాభిమానులు సర్వకాల సర్వావస్థలయందు ఉద్ఘోషిస్తున్నారు.

**ఈశ్వర వంచకుడనైతిని :**

అయితే పంతులుగారే "మత విషయములైన నా విశ్వాసములు కొన్నిటిని కార్యాచరణలో జూపక, యాత్మవంచకుడనయి, వితంతు వివాహ సంస్కారము చెడునని, కడచిన యిరువదియైదు సంవత్సరములనుండి ఈశ్వర వంచకుడనయి ప్రవర్తించినాడను" అని 1906లో ఆయన జంధెము విసర్జించి అనుష్ఠానిక బ్రహ్మ సమాజికుడైన తర్వాత సత్యవాదిని పత్రికలో ఒక పెద్ద లేఖ వ్రాసి, దానిని తమ స్వీయ చరిత్ర రెండవ భాగములో మరల ముద్రించారు. బ్రహ్మ సమాజము యొక్క ముఖ్య సిద్ధాంతములు రెండనియు, "అందొకటి సర్వలోకాధిపతియైన యీశ్వరుడు లోకైక పితయన్న విశ్వాసము. రెండవది జాతి వర్ణమత భేదములేక యీశ్వర దృష్టిలోనివారైన సర్వ మానవులు సోదరతుల్యులన్న విశ్వాసము. ఈ రెండును తానను్ష్ఠాన పరుడు కాగలిగినను కాజాలక పోయినను....ప్రతి సామాజికుని యొక్క పరమ భావనలు. కేవల శుష్కోపదేశమున కంటె కార్యాచరణము శ్లాఘ్య తరమనుట నిర్వివాదముగదా! తాను జేసిన యుపదేశము తనకేయాచరణమునకు పనికిరాని పక్షమున మరి యెవ్వరికి పనికివచ్చును? అట్టి వంచకుని మాటల యందెవ్వరికి విశ్వాసముండును?" అని ప్రారంభించి సత్యవ్రతాన్ని గూర్చి పెద్ద ఉపన్యాసమును పంతులుగారిచ్చారు.

పంతులుగారు గడచిన పాతికేళ్ళలో తమ బ్రాహ్మణీకమును వదలిపెట్టక, ఇతర మతాలవారితో ఇతరకులాలవారితో కలిసి భోజనము చేయలేదని 1906 ఫిబ్రవరి 2వ తేదీన దేశిరాజు పెదబాపయ్యగారింట జరిగిన విందులో జాతి మత కులభేదము లేకుండా ప్రథమ పర్యాయము భోజనం చేశామని పంతులుగారు వ్రాశారు. ఆ వెంటనే తమతండ్రి యాబ్దికమును బ్రాహ్మ ధర్మపద్ధతిని పెట్టినానని, అందులో సహపంక్తి తమ యింటనే ఏర్పరచినానని, నాడు మొదలు అనుష్ఠానిక బ్రాహ్మసమాజికుడనైతినని, పిదప 15 దినాలకు జంధెముతీసి వేశానని వ్రాసుకొన్నారు.

ఇలాగ తాము విశ్వసించిన మత సిద్ధాంతాలను అనుష్ఠించకపోవడానికి కల హేతువులను చెప్పి పశ్చాత్తాపమును ప్రకటించుచు తమ ప్రవర్తనను సమర్థించుకొనటానికి స్వీయచరిత్ర రెండవ భాగంలో పంతులుగారు పడినపాట్లు దానిని చదివిన వారిపై సానుభూతి కలుగదు; విశ్వాసము కలుగదు. దానికి కారణం వారి కథనములో వాదములో సమర్థనలలో గల పరస్పర విరుద్ధములైన సంగతులే.

## పరిశుద్ధాస్తిక బోధే వివేకవర్ధని ఆశయమట!!

స్వీయచరిత్ర మొదటి భాగములో వీరే ఇందుకు విరుద్ధముగా వ్రాసియున్నారు. "తులసీ రుద్రాక్షాది బాహ్య చిహ్నధారణకంటె సత్ప్రవర్తనము మతమున కధికావశ్యకమని జనులలో కుదురువరకును మతము పరిశుద్ధమై దురాచార నివారకము కానేరదు కాబట్టి పరిశుద్ధాస్తిక మత సిద్ధాంతములను బోధించుట వేరొక యుద్దేశ" మని వివేకవర్ధని పత్రికను స్థాపించుటలో కలదని వ్రాసియున్నారు.... "ఆస్తిక్యము, వివేకము, సత్యము, అహింస మొదలైనవియే (వివేకవర్ధని)మొదటి పత్రికలయందు వెలువడిన, యుపన్యాసములు. నేనప్పటికే బహుదేవతారాధనము విడచి యేకేశ్వరో పాసనను పూనిన వాడనై యుంటిని." అని వ్రాసి ఆ పత్రిక తొలి సంచికలలో వ్రాసిన పద్యములు బ్రహ్మమతమునగల ఏకేశ్వర భావమునే చెప్పినవని, తమరచనలు ఆమతము ననుసరించినవేయని భాష్యము వ్రాశారు.

1874లో స్థాపించి 1890 వరకు నడిపిన వివేకవర్ధనిలో బ్రాహ్మమతమును అనుసరించామని, ప్రచారముచేశామని అనేమాటగాని, 1907లో అనుష్ఠానిక బ్రాహ్మలైన తర్వాతనైనా పంతులుగారు తమ బ్రాహ్మణీకాన్ని పూర్తిగా వదలుకొన్నామనే మాటగాని నిజంగాదు. 1906లో వ్రాసినవ్రాతే వివేకవర్ధనికాలంలో వారివర్తన బ్రాహ్మణీకంగానే వున్నదని చెప్పుతున్నదిగదా! కాని ఆమాటొక్కటే వారి యదార్థ స్థితిని తెలుపజాలదు.

బ్రాహ్మమత ప్రచారమే తమ వివేకవర్ధని పత్రిక ఉద్దేశములలో ఒకటైనచో బ్రాహ్మణుండను హూణ భాషనేరిచి యందునే ప్రవేశపరీక్ష నిచ్చినాడని అంటూ తమ బ్రాహ్మణీకాన్ని చాటిచెప్పడంతో ప్రారంభించగలరా? అలా ప్రారంభించినది బ్రాహ్మమతపత్రికగా ముప్పదేళ్ళతర్వాత వ్యాఖ్యానించడం దుస్సాహసంకదా!

వివేకవర్ధని మొదటి మూడుపత్రికలనుండియు వరుసగా నొక్కొకటిచొప్పున గైకొనబడిన పద్యములవలన నాపరిశుద్ధాస్తిక భావముతేటపడవచ్చు" నని యిచ్చిన మూడుసీసపద్యాలలో నూతనమైన తమ బ్రాహ్మమత దైవభావములోని ప్రత్యేకత ఏమైనావున్నదా? అవి సంప్రదాయసిద్ధమైన అద్వైతమతములోని దైవభావానికి భిన్నముగా ఏమైనా చెప్పుచున్నవేమో పాఠకులే ఆలోచించవచ్చు.

అక్ష్యాది బాహ్యేంద్రి యాగోచరుఁడయి యాద్యస్వరూపుఁడై
యలరువాఁడు

సచరాచరంబైన సర్వసృష్టికి నాదికారణుండయి
చాలఁగాలువాఁడు

దుష్టశిక్షణమును శిష్టరక్షణమును నాత్మకృత్యములుగ
నమరువాఁడు

సర్వజ్ఞుఁడైయుండి జను లెందుగావించు సుకృత దుష్కృతముల
జూచువాఁడు

నిత్యుఁడీశ్వరుఁడభవుండు నిర్మలుండు నాదుపత్రికా రత్నంబు
నాదరమున

బ్రబలగాఁజేసి యెల్లడవాసికెక్క నించుకంతదయ నను
గ్రహించుగాక!!"

"ఎవ్వని యిచ్ఛమైనెల్ల జగమ్ములు గలుగుచు వెలయుచుఁ
బొలియుచుండు

ఎవ్వనియానతి నించుకైనను మేరమీరక సంద్రముల్
మించినిలుచు

"తనకృపారసవృష్టి దాసులతాపంబు లణగించి నెగడించు
ఘనుడెవండు

గీతాపదబంధాలతోను, పోతనామాత్యుని" ఎవ్వనిచేజనించు "పద్యవాసనల తోను 'జగతిపై బడవచ్చు జలరాశికెరటాల మామూలుమేరకు మడవలేక ,వంటి పద్యాలలో ఆధునికకవి-అద్వైతిగా వ్రాసినదానికన్న అన్యమైన అధికమైన విలక్షణ మైన దైవభావమేమైనా యీపద్యాలలో వున్నదా? ఈపద్యకర్తను అద్వైతి కానే కాదనటానికి ఇందులో ఏదైనావున్నదా? ఇలా చెప్పడం మసిబూసి మారేడుకాయ చేయడమంటాముగదా!

పంతులుగారు 1874 లోనే బహుదేవతారాధనను విడచిపెట్టి ఏకేశ్వరోపాసన పూనినానన్నమాట బూటకం. 1878లోకూడా వారు భారతసంగ్రహం వ్రాసి ప్రక టించారు ఉత్తరరామాయణంలో శ్రీరామునిఅవతారాన్నివర్ణించారు. తమయింటిలో 1878 వరకు అనగా తమతల్లిగారు చనిపోయేవరకు గృహదేవతార్చన-పూజా పురస్కారాలు, మంత్ర తంత్రాలు అనుష్ఠించారు. తల్లి గారికి ఉత్తరక్రియలు. వైదిక కర్మకాండననుసరించే చేశారు. 1906వరకు తద్దినాలుకూడావైదిక శ్రాద్ధ పద్ధతి లోనే పెట్టారు. ఇకఏకేశ్వరోపాసన చేసినదెప్పుడు? జాతివర్గమత భేదముపాటించ నట్టి సహపంక్తి భోజనముమొక్కటిదప్ప, వితంతు వివాహ దంపతులు వైదిక మత

విశ్వాసంకల వాళ్ళైనందున వివాహవిధి వైదిక పధంలో నడిపించటంతప్ప తక్కిన కర్మకాండలో వైదికాన్ని విడనాడినట్టు ధ్వనించినదీ, స్పష్టంగా చెప్పుకొన్నదీ అంతా అబద్ధమే.

అంతేగాదు, 1878 వరకు తాముతమయింటిలో ఎటువంటిప్రార్థన చేసుకొనే వారో, అది ఎటువంటి బ్రాహ్మమత ప్రార్థనో, బ్రాహ్మ ప్రార్థనలు వారు తెలుగులో వ్రాశారా అన్న విషయాలు తెలుపలేదు. వారు బ్రాహ్మ ప్రార్థనలు వ్రాసిన జాడలేదు. తాము, తమ బ్రాహ్మణేతర మిత్రులు కలిసి స్థాపించిన ప్రార్థనా సమాజంలోపాడే కన్నమురెడ్డి పార్థ సారధినాయుడుగారు వేకువవేళ పాడుతూవుండిన కీర్తనలు మన అద్వైతాది మతస్థులు పాడే సాంప్రదాయ కీర్తనలు కాదనివ్రాయలేదు. నాయుడుగారు సరికొత్తగా బ్రాహ్మకీర్తనలు వ్రాసిపాడేవారనలేదు. బహుశా బ్రహ్మంగారి తత్త్వాల వంటివి అయివుంటాయి. బ్రహ్మసమాజ ప్రార్థనలంటూ తెలుగులో అప్పటికేవీలేవు. ప్రతి వారము పరబ్రహ్మమునుగూర్చి నిర్గుణముగ ప్రార్థనలు చేయజొచ్చిరని చిలక మర్తివారు వ్రాశారు.

పంతులుగారు 1874 అక్టోబరులో ప్రకటించిన ఆస్తిక్యము అనేవ్యాసము మొదలుకొని 1897 నవంబరులో ప్రకటించిన విగ్రహారాధనమనే వ్యాసమువరకు గల మధ్యకాలంలో వ్రాసిన మత విషయమైన వ్యాసాలలో సనాతన ధర్మమును గూర్చి మన ఆచారాలనుగూర్చి అనేక విమర్శలు చేసినప్పటికీ ఉపనిషత్తులు మొదలైనవాటినుండి తమవాదాన్ని సాగించారేగాని ఏవ్యాసంలోనూ బ్రహ్మసమాజమతమునుగూర్చిగాని, దాని సిద్ధాంతాలనుగూర్చిగాని ప్రసక్తిప్రస్తావనతేలేదు. అంతేకాదు ఆసమాజస్థాపకులైన రాజారామమోహనరాయలనుగూర్చిగాని, మహర్షి దేవేంద్రనాధఠాకూరునుగూర్చిగాని తమ బ్రహ్మసమాజ సిద్ధాంతాలకు కర్తయైన కేశవచంద్రసేననుగూర్చిగాని పంతులుగారు వ్యాసాలుగాని జీవితాలుగాని, బోధనలనిగాని ఏమీ వ్రాయలేదు. జీసస్ చరిత్రనుగూర్చి చూపినశ్రద్ధ రామమోహనరాయ్ చరిత్రగూర్చి చూపలేదు. జీసస్‌చరిత్ర పూర్తిచేశారుగాని రామమోహనుని జీవితాన్ని పూర్తిచేయలేదు. విక్టోరియారాణి చరిత్రవ్రాశారు.

పంతులుగారి రచనల ఏడవ సంపుటములో వివేకవర్ధనిలో ప్రకటించిన వ్యాసాలు కొన్ని ఎన్నిక చేసి కూర్చారు. 1875 నుంచి 1897 వరకు వ్రాసిన పాతిక వ్యాసాలు అందులో సంకలితంచేశారు. ఐకమత్యం, స్త్రీ పునర్వివాహ విషయంలో ఆరు ప్రసంగాలు, హిందూమతాలు, వర్ణములు, అతిబాల్య వివాహములు, జన్మాంతరము, విద్యాధురీణుల అర్హకృత్యములు, ప్రార్థన, దానములు, ఈశ్వర దత్త పుస్తకములు, ఈశ్వరోపాసనము, మానుషధర్మము, వేశ్యాకాంతలు, విద్యాధికుల ధర్మములు, పరకాయకష్టకర్మము, స్వయంకృషి, వైరాగ్యము, జీవితపరమార్థము-దానిని పొందుటెట్లు, విగ్రహారాధనము, గోదావరిమండలసభలోప్రసంగము ఈ వ్యాసాలలో బ్రాహ్మమతప్రసక్తి ఆప్రవక్తల నామప్రసక్తిచేయలేదు. యథార్థమిది.

కాని, 1881 సెప్టెంబరులో ఏలూరి లక్ష్మీనరసింహంగారు స్థాపించిన ఆస్తికపాఠశాలలో ఆరంభంనుండీ విద్యార్థులకు పరిశుద్ధాస్తిక సిద్ధాంతాలు బోధించాలని పంతులుగారుకోరగా, అలాచేసినట్లయితే పిల్లల తల్లిదండ్రులు భయపడతారని ఆబోధ క్రమక్రమంగా కొంచెంకొంచెముగాచేయాలని ఏలూరివారుభావించినడవడమే ఏలూరివారితో తమ స్పర్థకు ఆరంభకారణమని స్వీయచరిత్ర రెండవభాగములో వ్రాసినవ్రాత యథార్థముగా తోచదు. తమ వివేకవర్ధనిలోనే పరిశుద్ధాస్తిక మతప్రచారము చేయుటకు వెనుకదీసిన పంతులుగారు స్కూలునడపడంలో ఆమతప్రచార విషయంలోనే వివాదపడ్డామని వ్రాయడం వింతగావున్నది. అవి నమ్మతగినదిగా లేదు.

స్వీయచరిత్రలో కొక్కొండవారికి ఇంగ్లీషు రానందున మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజినుండి రాజమండ్రికి బదిలీచేశారని వ్రాశారు. అక్కిరాజు రమాపతిరావుగారు కొక్కొండవారికి ఇంగ్లీషు వచ్చునని అథోజ్ఞాపికగా విశాలాంధ్రవారు ఇటీవల ముద్రించిన స్వీయచరిత్రలో చేర్చారు.

స్త్రీ పునర్వివాహము హిందూశాస్త్రసమ్మతమని వాదిస్తూ ధర్మశాస్త్రాలు పురాణవచనాలు ఉదాహరిస్తూవచ్చారేగాని బ్రాహ్మసమాజ మతసిద్ధాంతాలపైన ఆ సంస్కారమును ఆధారపరచలేదు.

ఉపనిషన్మతమూలకమన్న ప్రచ్ఛన్న క్రైస్తవమైన (కేశవచంద్రసేను) బ్రాహ్మసమాజమతము పరిశుద్ధాస్తికమతమని పంతులుగారు 1906 నాటికి నమ్మితే నమ్మి వుండవచ్చునుగాని 1874నాటికిగాని వివేకవర్ధని పెట్టిన మరికొంత కాలం వరకుగాని నమ్మినానన్న మాటమాత్రం నిజంకాదని వారి జీవితంవల్ల రచనలవల్ల తెలుస్తూనే వున్నది. ఆనాటికే తాము బ్రాహ్మమత సిద్ధాంతాల ననుసరించియున్నట్లు స్వీయచరిత్రలో వ్రాసి బ్రాహ్మసామాజికులను సాహిత్యవేత్తలనుకూడా మోసగించజూచుట సాహసమని చెప్పక తప్పదు. బ్రహ్మసమాజంతో వారికి ప్రత్యక్ష సంబంధం 1880కి ముందు లేనేలేదు కూడా.

## లేనిగొప్పలు–నిజముకాని మాటలు

వివేకవర్ధని స్థాపనోద్దేశములను చెప్పుతూ ఇంతకన్న ఇంకా పెద్దఅబద్ధాలు వ్రాశారు. ఈపత్రిక ప్రకటనమునందు నాయుద్దేశములు రెండు. భాషాభివృద్ధి, దేశాభివృద్ధి అనిచెప్పి, జనులు నీతిమత కులాచారాదులైన సమస్తాంగములయందు సమానముగా నభ్యున్నతి పొందుటయే యభివృద్ధియగుగాని యితరాంగములకు భంగము

కలుగునట్లుగా నొక్క రాజ్యాంగము యందేగాని, ఒక్క బుద్ధి ప్రచారమునందేగాని యుత్కర్షమునొందుట క్షేమకరమైన దేశాభివృద్ధికాదని నాయభిప్రాయము. రాజ్యాంగ విషయమున నెక్కడనో దూరముననున్న పరిపాలకులను వారి శాసనములను దూషించుటకంటె సమీపములోనున్న రాజశాసనము నడుపు వారిదోషములను వెల్లడి చేయుట యధికప్రయోజనకరమని నానమ్మకము అని స్వీ. చ. 1 వ భాగంలో వ్రాశారు.

ఈభావములు, భిన్నమార్గముల ఈ సమన్వయము, స్వీయాచరణ సమర్థనము 1907 నాడు వందేమాతరం ఉద్యమమునుగూర్చి పంతులుగారి విమర్శ, దాని ప్రతి విమర్శ, చర్చలసందర్భములో కలిగినవేగాని, ఎప్పుడో 1874 లో వివేకవర్ధని స్థాపనకాలములో తాము పాతికేళ్ళ యువకులుగా ధవళేశ్వరము పాఠశాలలోనుండగా కలుగలేదని, కాంగ్రెసేపుట్టకున్నప్పుడు రాజ్యాంగమంచే దృష్టినిలిపి సాంఘిక సంస్కరణ నశ్రద్ధచేయుట అనుమాటే కలుగవీలులేదని, ఇదంతా వందేమాతరం రోజుల్లో తన ప్రవర్తనను సమర్థించుకొంటూ జెప్పుకొన్న దానిని ముప్పయ్యేళ్ళక్రిందే తమకింత దీర్ఘదృష్టి, దూరదృష్టి, అఖిలభారతరంగము మొత్తమును అర్థముజేసుకొను శక్తి ఏర్పడియున్నట్టుగా ఒకపెద్ద అబద్ధం ఆడుతున్నారు. లేనిగొప్పను తెచ్చి అతికించు కొంటున్నారు. ఈశ్వరముఖమునుజూచి సత్యమునే చెప్ప బూనుకొన్నానని పదే పదే ఆదిమధ్యాంతములలో ఉద్ఘాటించడమేగాని కల్లలేకుండ కలముసాగించిన వారుకాదు. స్వోత్కర్ష, సహచరాపకర్షగాని కథనములేదు.

పంతులుగారు వందేమాతరం ఉద్యమకాలంనుండి రాజకీయస్వాతంత్ర్య సముపార్జనమే ఏకైక వ్యాపకముగా జేసుకొనిసంఘ సంస్కారమును వెనుకబెట్టరాదనుచు రెండింటి ఆవశ్యకతను చెప్పుతున్నారని అర్థంచేసుకోవలసిందే.ఐనప్పటికీ వారికీ స్వరాజ్యరాజకీయాలకూ వేయికోసులదూరము.ఆరెండింటిని సమన్వయించి మాత్రము వారునడువలేదు. స్వరాజ్యసమరము వారిభావనకు మించినపని. అందువల్లనే వారొక చిన్నసైజు జస్టిస్‌పార్టీయుడుగా ఆపార్టీవారిచే స్మారకాంజలి పట్టించుకొన్నారు. ఆ సంగతి బంగోరే కనుగొని తన వేమన–సి.ఆర్.రెడ్డి అనేరచనలో యిచ్చారు.

అంతేకాదు 13–5–1923 ఆదివారంనాడు చెన్నపురి జస్టిస్ ప్రింటింగ్ భవనంలోని 'న్యాయదీపిక' కార్యాలయంలో జస్టిస్ పార్టీయులు జరిపిన 'వీరేశలింగం సంస్మరణ సభ"లో మాట్లాడిన వక్తలు డాక్టర్ నటేశ మొదలియార్, పింజల సుబ్రహ్మణ్యశెట్టి, గానాలరామమూర్తి నాకాటి వీరరాఘవరెడ్డి, నే. ముద్దుకృష్ణనాయుడు, కె.వి. రమణయ్య ప్రభృతులు వీరేశలింగానికి అంజలి ఘటిస్తూ (వీరేశలింగం). బ్రాహ్మణేతరుల యందద్భుతమైన వికాసమును కల్గించి యుండిర"నీ, అయన "పరిశ్రమ బ్రాహ్మణేతరుల కెక్కుడు సాయపడే"ననీ వీరేశలింగాన్ని వొక చిన్నసైజు జస్టిస్ పార్టీయుణ్ణిగా 'చేసిమాట్లాడినమీదట, ఆ సభకు అధ్యక్షత వహించిన అక్కి-

రాజు వుమాకాన్త విద్యాశేఖరులు వొక religious and philosophical turn యిచ్చి మాట్లాడిన మాటలు ప్రత్యేకించి గుర్తించదగ్గవి:

"బ్రాహ్మణుల దోషములను శ్రీవీరేశలింగం పంతులుగారు చూపించిరనిరి. కొందరు బ్రాహ్మణులు శ్రీపంతులుగారి పుస్తకములను అణచివేయ యత్నించిరని చెప్పిరి.........అయితే అది అకృత్యమని నేను మిక్కిలి వగచుచున్నాను.......... బ్రాహ్మణేతరులు వికాసము జెంది విజ్ఞాన విభవోన్నతులై బ్రాహ్మణులతో సమాన ప్రతిపత్తిని సమాన ధర్మములను ఆకాంక్షించు దినములు ఒకప్పుడుకాకున్న ఒకప్పుడు రాగలవని బ్రాహ్మణులెరిగియుండినను ఎరిగియుండకపోయినను "ఏకులమైతే ఏమిర బ్రహ్మం, నాకులమడిగే"వన్న వాక్యములు శ్రీ బ్రహ్మమతము నుంచి ఉద్గతమైన నిమిషము.........వాస్తవముగ గర్వపడదగిన సమయమని నేననుకొనుచున్నాను.........బ్రహ్మముగారు, సిద్దప్ప, వేమనయోగి చేసిన బోధలకంటె బ్రహ్మసమాజము వినిపించిన నూతన మత సందేశము లేదు. వంగీయ మగుటవలన విదేశీయమును అసలు ప్రచ్ఛన్న క్రైస్తవమును అగు బ్రహ్మసమాజమును ప్రాపుకొనుటకంటె, శ్రీ బ్రహ్మము, వేమన ప్రభృతుల పరంపరను అవలంబనముగాగొని ఆ పునాదులమీద మత సంఘ బోధలను వినిపించినచో అవి ఆంధ్ర ప్రజలయం దెక్కువ ఫలవంతములై యుండునని అనుకొందును. (ఆంధ్ర (దిన)పత్రిక రుధిరోద్గారి సంవత్సర వైశాఖమాస బహుళ 30 మంగళవారం సంచిక.)

**జందెము తీసినా వదలని బ్రాహ్మణీకం :** 1906 లో జందెము తీసివేసి అనుష్ఠానిక బ్రాహ్మలైనతరువాతకూడా తమబ్రాహ్మణీకాన్ని పంతులుగారుపూర్తిగా విడనాడ లేదనేదానికి కొన్ని ఉదాహరణలున్నవి. 1908లో కామరాజు హనుమంతరావుగారు తమ వివాహసందర్భములో మాలవారితోకలిసిభోజనంచెయ్యాలని పట్టుబట్టినారని అది భార్యా మొదలైనస్త్రీలకు ఇష్టములేదని తరువాత ఒకరోజున అలాగే మాలవారితో సహపంక్తిని తిందామని చెప్పినప్పటికీ వినలేదని, అందుచేతకూడా ఆపెండ్లి అప్పట్లో వాయిదావేయవలసివచ్చిందని వ్రాసియున్నారు. ఆమాటఅబద్ధమని కామరాజు హనుమంతరావుగారు వ్రాసియున్నారు. కాని పెండ్లిలో హరిజనులతో సహపంక్తి ఇష్టముకాక, అందుకు సిద్దపడలేకపోవడమన్న కారణమును కల్పించుకో సిద్ధమైనారంటే కూడా ఆదివారు పూర్తిగా అనుష్ఠానిక బ్రాహ్మమును అమలుపరచలేకపోవటాన్నే తెలుపుతుంది గదా!

పోతరాజు సూర్యప్రకాశరావనే మాడ్రిల్లుమాస్టరు తొలుత తమ తొలివితంతు వివాహంలో జందెము తీసివేసి బ్రాహ్మమతస్థులై మంగమ్మను వివాహంచేసుకొని, ఆమె చనిపోగా వెంటనే మరొక వితంతువును వివాహమాడగోరి, ఆవివాహాన్ని తాను జందెం వేసుకొని వైదికరీతిలో వివాహం చేయించమనగా పంతులుగారు

అలాగే మళ్ళీ వైదికవివాహం చేయించారు. దానితో చిలకమర్తివారు ఖేదించి ఆ పెళ్ళినుండి లేచివెళ్ళిపోయారు. బ్రాహ్మసమాజంవారు పంతులుగారి ఆచర్యను గర్హించారని వ్రాశారు.

1910 లో పంతులుగారి సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు చనిపోయినతర్వాత పంతులుగారు వితంతుశరణాలయంలోని పులవర్తి సుబ్బారావనే బ్రాహ్మణుని ఇంటిలోనే భోజనంచేసేవారు. తర్వాత మంగమ్మఅనే బ్రాహ్మణవితంతువుచేతనే వంట చేయించుకొనేవారు. ఆమె చనిపోయినతర్వాత బ్రాహ్మణస్త్రీలచేతనే వంటచేయించుకొనేవారు. వారు ప్రయాణాలు చేసేటప్పుడు వారికి బ్రాహ్మణమిత్రులే భోజనం పంపేవారని నాకు స్వయంగా తెలుసును. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారింట చేసిన వంటఅయినా తినేవారుకాదు. పంతులుగారు బ్రాహ్మణేతరుల ఇండ్లనుంచి భోజనం తెప్పించుకొనడంగాని వారిళ్ళలో భోజనంచేయడంగానిలేదు. ఈసంగతి వారి శిష్యులందరికీ తెలుసు.

అనుష్ఠానిక బ్రాహ్మలైనతర్వాతకూడా పంతులుగారు తమ బ్రాహ్మణీకాన్ని పూర్తిగా వదలలేదని 1973 లో ప్రచురించిన కామరాజు హనుమంతరావుగారి స్వీయచరిత్ర స్పష్టంగా తెలుపుతున్నది.

లియోనార్డు బంగోరెకు వ్రాసినలేఖలో పంతులుగారు బ్రాహ్మణ సంస్కర్తమాత్రమేనన్నారు. సుబ్రహ్మణ్యభారతియార్ అందుకే పంతులుగారిపై వ్యంగ్యరచన చేశారు.

పంతులుగారు బ్రాహ్మణసంస్కర్త అయినమాట నిజం. బ్రాహ్మణులలోని లోటుపాటు లాయన ఎరుగుదురు. వారిలో ఐకమత్యంలేదని ఎరుగుదురు. వారిని దొరలు మిషనరీలు ద్వేషిస్తారని ఎరుగుదురు. పంతులుగారు మంచి విద్వాంసులు. అద్వైతి. అయితే ఇతర అద్వైత బ్రాహ్మణులాయన నాయకత్వాన్ని అంగీకరించరు. అందువల్ల పరిశుద్ధమైన ఉపనిషన్మాత్రమును తృణీకరించి ప్రచ్ఛన్న కైస్తవమైన బ్రాహ్మసామాజిక సిద్ధాంతాన్ని అవలంబించి బ్రాహ్మణులనువిమర్శిస్తే పాశ్చాత్యులలోను ఇతరకులాల వారిలోను గొప్ప గౌరవం కలుగుతుందనే అభిప్రాయం కలిగింది. అయినప్పటికీ తమజన్మనుబట్టి సంస్కారమును బట్టి బ్రాహ్మణీకమును వదిలించుకోలేకపోయారు.

## వేమన సంస్కరణ

పంతులుగారి పూర్వం వేమనకాలంనాటినుండీ బ్రాహ్మణుల ఆధిక్యాన్ని తృణీకరించి, అసలు ఉపనిషత్తులలో పరమాత్మకు ఆత్మకు భేదంలేనప్పుడు జాతి మత కులస్త్రీపురుష తారతమ్యాలెలా కలుగుతాయని ప్రశ్నించి ధర్మసూక్ష్మాన్ని గ్రహించిన వేమనయోగి కులతారతమ్యాలను నిర్మూలించడానికి వేదాంతమతాన్ని

ప్రచారంచేశాడు. వేమనదేవుడు, వేదవేద్యుడుకాడు-వేదాంతవేద్యుడు. వేమన అచల బోధవెలయించాడు. తర్వాత పోతులూరి వీరబ్రహ్మంగారుకూడా కులతారతమ్యా లను నిరసించాడు. నిర్గుణపంథ ననుసరించి భారతీయులెందరో కులవ్యత్యాసాలు కూడవని చెప్పారు. మహమ్మదీయ ప్రభుత్వకాలంలోను, ఇంగ్లీషు రాజ్యకాలంలోను మళ్ళీ బ్రాహ్మణులు ప్రభుత్వాధికారుల నాశ్రయించి కులాధిపత్యం వహించారు.

ఈ తారతమ్యాలను నిర్మూలించి వేదాంతమతం స్థాపించడానికే రామ మోహనరాయలు, దేవేంద్రనాథఠాకూరుగారలు ప్రయత్నించారు. ఐతే కేశవచంద్ర సేను యింగ్లీషు యూనిటేరియన్‌చర్చి సిద్ధాంతాలవల్ల ప్రభావితులై బ్రహ్మసమా జాన్ని ప్రచ్ఛన్న క్రైస్తవమతంగా మార్పుపొందించారు. విక్టోరియారాణి ముందు ఉపన్యసించివచ్చారు. వీరేశలింగం పంతులుగారు కేశవచంద్రసేను సిద్ధాంతాలకు లోనయ్యారు.

పంతులుగారికి సమీపపూర్వులైన ఆంధ్రప్రముఖులు కులవ్యత్యాసాది సకల సంఘ సంస్కారములకు ఈప్రచ్ఛన్న క్రైస్తవము నాశ్రయింపక వేదాంతమతాన్నే గ్రహించి ప్రచారంచేశారు. పంతులుగారుపుట్టకపూర్వమే రాజమహేంద్రవరంలోనే స్వామినీన ముద్దునరసింహం నాయుడుగారీ సంఘసంస్కారమును ప్రబోధించ టమేగాక ప్రయత్నంకూడా చేశారు. ఆవిషయాలు ఇంతకుముందే చదివివున్నారు. బందరులో చెరుకూరి ఉమారంగనాయకులు నాయుడుగారును, వారి బ్రాహ్మ ణేతర మిత్రులును 1865 లో స్థాపించిన దైవసమాజసభ వేదాంతమతమైన అద్వై తముద్వారా పురుషార్థసాధనకు కృషిచేస్తూ 1872 జనవరిలో పురుషార్థప్రదాయిని పత్రికస్థాపించారు. అప్పట్లో వారినిచూచే వీరేశలింగంగారుకూడా మన వేదాంత మతాన్నే అభిమానించి వివేకవర్ధనిలో అద్వైతసిద్ధాంతాలను ప్రచారంచేయసాగినారు. అయితే క్రమంగా పంతులుగారికీ పూర్వసిద్ధాంతాలు రుచించలేదు. వేమన వీరబ్రహ్మల మతం అనుపానులాయనకు పట్టలేదు. పైగా అవి పామరజనమతాలుగా విద్యావంతు లను ఆకర్షించేవిగా కనిపించలేదు. సామినేని చెరుకూరివార్ల వేదాంతమతంకూడ ప్రాత దిగానేవుంది. వారు చెప్పిచూపిన సంస్కరణలను కొత్తపంథ తొక్కిచెప్పితే తమకు ప్రత్యేకత వుంటుందని, కీర్తికలుగుతుందనే భావం కలిగింది. కేశవచంద్రసేనుల వారు కొత్తమలుపు తిప్పిన బ్రహ్మసమాజమత పంథాకొంత ఆకర్షకంగాకనిపించింది. 1864లో కేశవచంద్రసేనులవారు చెన్నపట్నంలో ఉపన్యసించిన నాటినుండి అక్కడ వేదసమాజం పేరుతో బ్రహ్మసమాజంఏర్పడి తత్వబోధినీ పత్రిక స్థాపించ బడి గౌరవపాత్రమైవుంది. శ్రీధరనాయుడు మన్నవ బుచ్చయ్య పంతులుగారు దక్షిణ హిందూదేశ బ్రహ్మసమాజమంటూ గోడే గజపతి, జమిన్‌దారులైన నరసింహారావు గార్ల (విశాఖసూర్యబాగ్) తోడ్పాటుతో మద్రాసులో స్థాపించారు. ఇంగ్లీషు విద్యాధికు లకు బ్రహ్మోఆకర్షకంగావుంది. క్రైస్తవ మిషనరీల, ఇంగ్లీషు అధికారుల ఆదరాభి మానాలుకూడా దానికున్నవి. అదంతా గమనించిన పంతులుగారు బ్రహ్మసమాజ

ప్రభావం పొందినారు. దానినే పరిశుద్ధాస్తికమతమన్నారు. అనతికాలానికి రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు తోడయ్యారు. పీఠాపురం రాజాగారి ధనబలంతో ఈ మతం కొన్నాళ్ళు విజృంభించింది. ఈ ముగ్గురిలో ఎవ్వరూకూడా తమ తమ కులాన్ని మరచిపోలేక పోయినవారే. పంతులుగారు బ్రాహ్మణీకాన్ని మరచిపోలేకపోయారని విన్నారు. నాయుడుగారు కాపుజనసంఘ పెద్దలయ్యారు. పిఠాపురం రాజావారి వెలమ సంఘం, బ్రాహ్మణేతర సంఘరాజకీయాలు సరేసరి. కేశవచంద్ర సేనుగారు రామకృష్ణ పరమహంస ప్రభావానికి లోనై అర్ధ క్రైస్తవ వ్యవహారం మానుకొన్నారన్న మాటే వీరెవ్వరూ తెలుసుకోకుండా అలాగే అనుష్ఠానశుద్ధిలేని బ్రాహ్మనాయకులుగా వుండిపోయారు. ఇందులో చేరిన స్త్రీపురుషుల అవినీతివల్ల ప్రజలకు దీనిపై అసహ్యముకలిగి అడుగంటిపోయింది. ఈమతంలో ప్రముఖులైన గుడిపాటి వెంకటచలం, మొక్కపాటి రామమూర్తి, దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలైన వారి రహస్య జీవితములు చలంగారి స్వీయచరిత్రలో బట్టబయలైయున్నవి. ఇంకెందరివో చరిత్రలలా వుండేవి. పంతులుగారి సమకాలికుల ఆత్మకథలు, ఇతరరచనలు ఇటీవలవెలువడినందున, లియోనార్డు పరిశోధనలో వెలుగుజూస్తున్న వాస్తవాలవల్లను పంతులుగారి జీవితములో సత్యవ్రతము సిద్ధాంత సంబన్నతకొరవడినట్లుగా బైటపడుతున్నది.

పంతులుగారిని గూర్చి నేను చెప్పగలిగినవన్నీ ఈ పుస్తకంలో చెప్పలేదు. చాలవిషయాలు నోట్సురూపంలో వున్నాయి. ఆనోట్సుఅంతటికీ వ్యవస్థ ఏర్పరచి పుస్తకరూపం యివ్వటం ఇంత వార్థక్యంలో అసాధ్యమైనపని. ఆరోగ్యం, ఓపిక బొత్తిగాలేదు. ఆసక్తిగలవారు నానోట్సులో తలదూర్చవచ్చు. అసలు చరిత్ర కావాలి, యథార్థమేకావలనే ఆసక్తి, పట్టుదల వుండాలేగాని పంతులుగారిని గూర్చి నేనెరుగని విశేషాలెన్నింటినో త్రవ్వితీసే అవకాశముందని నానమ్మకం. విదేశీపరిశోధకుడే కొద్దికాలంలో ఎన్నోవిషయాలు బైటికితీసి చూపెట్టి వెళ్ళిపోయాడు. అది చూచిన వాళ్ళే తక్కువగావున్నారు. అటువంటి పరిశోధన ఒకటి జరిగి, పంతులుగారి స్వీయచరిత్రలో సత్యాంశ దెబ్బతిన్నదని తెలిసికూడా, ఆపరిశోధనను గమనంలోకి తీసుకోకుండానే స్వీయచరిత్ర పునర్ముద్రణ, దానికి వివరణలు, జరిగిపోతున్నాయి. ఇదేమి సత్యారాధనో తెలియడంలేదు. అయితే అది చెయ్యతగినపని. స్వీయచరిత్రను లోకం కళ్ళుమూసుకొని చదివి నమ్ముతున్నది. అందులో ఎందరికో అన్యాయం జరిగింది. పంతులుగారి సమకాలిక చరిత్రకేగాకుండా, వారి పూర్వరంగానికి కూడా అన్యాయం జరిగింది. ఆ స్వీయ చరిత్రలో సత్యాసత్యాలను విడదీయడం పెద్దపని–పెద్ద పరిశోధన. అయితే చెయ్యతగిన పని. ఆంధ్ర వికాసోద్యమ చరిత్ర నిర్మాణానికి అదెంతైనా తోడ్పడుతుంది.

Tripuraneni Venkateswara Rao
– VIJAYAWADA. –